THE LARGEST CIRCULATED
TELUGU MONTHLY

# చతుర

డిసెంబర్ 1998 ★ రూ. 7/-



సింహప్రసాద్

## సీత నడిచిన భూమి

# చతుర కతలు

## అజాత శత్రువు

మార్కండేయ శర్మగారు తన ఎనభయ్యో జన్మదినోత్సవం ఘనంగా జరుపుకున్నారు. ఆయన కుటుంబంలోని జనాభా మొత్తం ఓ వందమంది దాకా ఉంటారు మనవలు, మునిమనవలు అంతాకలిసి.



పెద్ద ఉద్యోగాలే చేసి రిటైరై పింఛను తీసుకుంటూ బిడ్డలవద్ద హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నారు. అటు కూతుళ్ళు, ఇటు కొడుకులూ కూడా మనవల్ని ఎత్తారు. ఈనాటిక్కూడా మార్కండేయ శర్మగారంటే అందరికీ ఎంతో భయమూ, భక్తీ. ఆయన సలహా సంప్రదింపుల్లేకుండా ఆ కుటుంబాల్లో ఏ పనీ జరగదు. అంతకట్టుబాటుగా నడుచుకుంటారందరూ.

ఇంట గెలిచి రచ్చగెలవమన్నట్టు ఇంట్లో తన హయాం అలా వెలుగుతోంటే బయట కూడా సంఘసేవకుడిగా, ప్రజాబంధుగా మంచిపేరు తెచ్చుకున్నారు. ఎనభై సంవత్సరాల వయసులో కూడా ఎంతో చలాకీగా నవయువకుడిలా సమాజ కార్యకలాపాల్లో పాలు పంచుకుంటారు.

అలాంటి మార్కండేయశర్మగారి ఎనభయ్యో జన్మదినోత్సవం... ఆషామాషీగా జరుగుతుందా. మనవలు, మునిమనవలు అందరూ కల్సి తాతగారి జయంతుత్సవాన్ని వివాహవేడుకల్లా జరిపించారు. సంఘంలో మంచిపేరున్న వ్యక్తిగా ఆయనకు ఎంతోమంది పెద్దలతోనూ, రాజకీయపక్షాల నాయకులతోనూ సన్నిహిత సంబంధాలున్నాయి. బంధుమిత్ర పరివారానికి లోటేలేదు. ఆహ్వానితులందరూ విచ్చేసి వేడుకల్లో పాలుపంచుకున్నారు.

మార్కండేయశర్మగారి సతీమణి సక్కుబాయమ్మగారు కూడా ఆరుపదుల వయసుపైబడ్డా శర్మగారితో సమానంగా ఉత్సాహంగా ఉన్నారు. ఇద్దరూ శివపార్వతుల్లా, లక్ష్మీనారాయణుల్లా చూడవచ్చిన వారంద



రికీ కన్నులపండువే చేశారు. ఆహూతులం దరూ వృద్ధదంపతులకు పాదాభివందనం చేసి ఆశీస్సులనందుకున్నారు. వృద్ధదంప తుల్ని ఎవరికి తోచిన ప్రశ్నలు వాళ్లడుగు తున్నారు. వాళ్ళు కూడా ఉల్లాసంగా, ఉత్సా హంగా సమాధానాలు చెప్తున్నారు.

ఓ కొంటెకోణంగి అడిగాడు శర్మగారిని, "తాతగారూ! ఈ ఎనభై సంవత్సరాల జీవి తంలో వేలాదిమందితో పరిచయాలుండి వుంటాయి కదా. మరి మీకు శత్రువు లెవ రయినా ఉన్నారా? " అని

ఆ మాటలకు పెద్దగా నవ్వేశారు మార్కం డేయశర్మగారు.

అందరూ "శర్మగారేం చెపుతారో" అను కుంటూ ఆయనచుట్టూ మూగారు.

"మంచి ప్రశ్న వేశావోయ్. నాకు శత్రువు లంటూ ఎవరూ లేరోయ్. నేను అజాతశ త్రువుని" అన్నారు.

"అసలు ఎప్పుడూ కూడా ఎవరితోనూ శత్రుత్వం రాలేదా" ఆశ్చర్యంగా అన్నారా గుంపులోనుంచి ఎవరో.

"ఎప్పుడేనా అంటే... ఒకప్పుడు ఉండేవా రనుకో. ఇప్పుడుమాత్రం ఎవరూ లేదు" అన్నారు శర్మగారు.

"అంటే ఇప్పుడు శత్రుత్వం మరిచిపోయి స్నేహంగా ఉంటున్నారా. అదెలా సాధ్యమ యింది? " మరెవరో తమ సందేహాన్ని వెలి బుచ్చారు.

"అబ్బే... అదేం కాదోయ్... నాకంటే ఎనభయ్యేళ్ళు నిండాయికానీ, అందరూ అంతగట్టివాళ్ళేం కాదుగదా... నా శత్రువులెప్పుడో చచ్చిపోయారు..." అంటూ అసలు సంగతి బయటపెట్టారు అజాత శత్రువు శర్మగారు.

—సూరిపండు

---

## నేను బిచ్చగాడిని కాదు

అబిడ్స్‌లోని ఓ విదేశీ బ్యాంక్‌లో బ్రాంచ్ మేనేజర్‌గా పనిచేసే ఏకాంబరేశ్వర్‌కి రోజూ అతను కారుదిగి బ్యాంక్‌లోకి వెళ్తూండే సమయంలో, పేవ్‌మెంట్ పక్కన ఓ పధ్నా లుగేళ్ల కుర్రాడు కనిపిస్తూంటాడు. నల్లగా మాసి, చిరుగులున్న బనీను, మాసిన ఖాకీ నిక్కరు.

ముష్టెత్తుకోవడం నామోషీ అన్నట్లుగా బూట్‌పాలిష్ చేస్తుంటాడు.

అతనికి తనలా చదువుకునే అవకాశం లేదే అని జాలిపడ్డాడు ఏకాంబరేశ్వర్. బ్యాంక్‌లోకి వెళ్లి కూర్చుని పనిచేస్తున్నా, అతని మనసు మనసులో లేదు, ఆ కుర్రా డిమీద ఆలోచనలతో.

లేచి బయటకి వచ్చి ఆ కుర్రాడికి రూపా యికాయిన్ అందించాడు ఏకాంబరేశ్వర్.

"బూట్లు పాలిష్‌కి రెండు రూపాయలు" చెప్పాడా కుర్రాడు.

"ఆ అవసరంలేదు. నేను రోజూ ఇంటిద గ్గరే పాలిష్ చేసుకుంటుంటాను. నీకు ఉప యోగపడుతుందని ఇచ్చానది" చెప్పాడు ఏకాంబరేశ్వర్ అతనివంక సానుభూతిగా చూస్తూ.

"నేను బిచ్చగాడినికాదు" రూపాయివున్న చేతిని చాపి చెప్పాడు ఆ కుర్రాడు కొద్దిగా రోషంగా.

"ఛ... నేను అలా అనుకుని ఇవ్వలేదు. నీ ఖర్చులకి ఉంచు"

"ఊహూ... తీసేసుకోండి. బిచ్చగాడిని కాదన్నానా? " ఏకాంబరేశ్వర్ క్షణకాలం ఆలోచించి చెప్పాడు ఇంకో రూపాయి ఇచ్చి

"ఆల్‌రైట్. నీ దగ్గర అడ్వాన్స్‌గా వుంచు. నేను రేపు సాయంత్రంలోగా బూట్లు పాలిష్ చేయించుకుంటే సరే. చేయించుకోక పోతే ఆ తప్పు నాది కాబట్టి ఈ డబ్బు నీద వుతుంది. సరేనా? " అది అంగీకారంగా తోచడంతో ఆ కుర్రాడు ఆ వప్పందానికి




వప్పుకున్నాడు. మర్నాడు సాయంత్రంలోగా ఏకాంబరేశ్వర్ ఆ కుర్రాడి దగ్గర పాలిష్ చేయించుకోలేదు.

రోజూ ఆ కుర్రాడి పెట్టెలో రెండు రూపాయల నాణెం పడేసి బ్యాంక్‌లోకి వెళ్లసాగాడు ఏకాంబరేశ్వర్. అయితే ఎన్నడూ



తన బూట్లని పాలిష్ చేయించుకోలేదక్కడ. ఆ కుర్రాడికి కూడా తాను బిచ్చం తీసుకోవడం లేదన్న సెంటిమెంటల్ తృప్తి లభించసాగింది.

ఇలా ఆర్నెల్లు గడిచాయి. ఓ రోజు ఏకాంబరేశ్వర్ రెండు రూపాయల నాణెం అతని డబ్బాలో ఎప్పటిలా పడేయబోతుంటే అతన్ని ఆపి చెప్పాడు ఆ కుర్రాడు,

"మీకు మొదటే చెప్పాను. నేను బిచ్చగాడ్ని కానని"

"నీకు నేను మొదట్లోనే చెప్పాగా రేపు సాయంత్రంలోగా నీ చేత బూట్లు నేను పాలిష్ చేయించుకోకపోతే ఆ డబ్బు నీదే అవుతుందని"

"అది నిజమే. కాని ఇవాల్టినించి బూట్ల పాలిష్ రేటు రెండున్నరకి పెంచాను" చెప్పాడు ఆ కుర్రాడు.

—మల్లాది వెంకటకృష్ణమూర్తి

---

## పెదవి

గోవిందం మంగతాయారుని పీకల్దాకా ప్రేమించాడు. అయితే ఆ ప్రేమని ఎలా తెలియజేయాలో అర్థం కాలేదు. స్నేహితులని సలహా అడుగుదామనుకున్నాడు, మళ్లీ అంతలోనే విరమించుకున్నాడు.

ఉత్తరంద్వారా తెలియజేద్దామనుకున్నాడు. ఊహూ, అది మరెవరి చేతిలోనో పడితే నిష్ఫలితమౌతుందనుకున్నాడు.

స్వయంగా కలిసి మాట్లాడదామంటే ఒకటే సిగ్గూ, సంకోచం. దాంతో చెప్పలేక వెనక్కొచ్చేశాడు.

ఆలోచించి, ఆలోచించి చిట్టచివరికి ఫోన్ చేసి, గొంతు సవరించుకున్నాడు. మంగతాయారు లైన్లోకొచ్చింది.

క్లాస్‌మేట్ గనుక పేరు చెప్పగానే ఆమె గుర్తుపట్టేసింది.

కొంచెంసేపు నసిగి, మరికొంచెంసేపు విసిగించి మొత్తానికి "మంగా, నిన్ను నా ప్రాణంకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. నువ్వు లేకపోతే కేబుల్ కనెక్షన్‌లేని టీవీలా



నిస్సారంగా, నిస్తేజంగా వుంటుంది. నువ్వు కాదంటే హుస్సేన్‌సాగర్‌లో దూకేస్తాను. అవునోకాదో అయిదు నిమిషాల్లో చెప్పు మళ్లీ ఫోన్ చేస్తాను" అని రిసీవర్ క్రెడిల్ చేశాడు.

గోవిందానికి ఆ అయిదు నిమిషాలూ అయిదు యుగాల్లా అన్పించింది. సెకన్ల ముల్లుని తెగతిట్టుకున్నాడు మెల్లగా నడుస్తోందని. ఏమైతేనేం సమయం గడిచింది. మళ్లీ ఫోన్ చేశాడు.

"హాయ్ గోవిందం! నీ ప్రేమని ఒప్పుకోవాలంటే నీకో చిన్న పరీక్ష. ఏం లేదు, అందరిముందూ పెదవిమీద ముద్దుపెట్టుకోవాలి" అంది మంగతాయారు.

గోవిందానికి గుండె ఆగినంత పనయ్యింది ఒక్కక్షణం. వెంటనే తేరుకున్నాడు.

సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ "అందరి ఎదుటా అంటే కొంచెం కష్టమే అనుకో మరి నా మంగ నాకు దక్కాలంటే తప్పదుగా. సరే ఎప్పుడో చెప్పు" అన్నాడు.

"ఎప్పుడో ఎందుకు ఇప్పుడే నా ఫ్రెండ్సుందరినీ తీసుకుని నేను వస్తాను, నువ్వు నీ ఫ్రెండ్సుని తీసుకుని రా"

"స్పాట్ ఎక్కడో చెప్పు"

"జూ"

"లుంబినీ పార్కయితే బాగుంటుంది మంగా"

"లుంబినీలో సింహం వుండదుగా గోవిందం"

"సింహం ఎందుకు? "

"నువ్వు ముద్దు పెట్టుకోవాల్సింది దాన్నేగదా! నీ గొప్పదనం అందరికీ తెలిసేది అలాగే గదా"

గోవిందం పెదాలు తడారిపోయాయి.

**–వి. నాగరత్న**

---

## పెళ్ళికార్డు

**ఆ**ఫీసుకి వెళ్ళగానే శుభలేఖ స్వాగతం పలికింది. కుర్చీలో కూలబడుతూ చూశాను ఎవరో పరాంకుశంగారు రాజమండ్రినుంచి తన కూతురు విమలకు బుచ్చిబాబుతో జరిగే వివాహానికి ఆహ్వానించారు. అతనెవరో తెలియదు. భార్య తరఫువాళ్ళేమో!

మధ్యాహ్నం కేంటీన్‌లో విమలా బుచ్చిబాబుల ప్రసంగం వచ్చింది.

"ఆ పరాంకుశంగారు నీకు తెలుసా? " అడిగాడు రమేష్. మాలాగే మరో టేబిల్

దగ్గర అదేవిషయం మాట్లాడుకుంటున్నారు. ప్యూన్‌నుంచి ఆఫీసర్లవరకు అందరికి ఆ పెళ్ళి పత్రిక వచ్చింది. అయితే ఎవరికీ ఆ పెళ్ళి పెద్ద ఎవరో తెలియదు.

శంకరం ఆరోజు ఆఫీసుకి రాలేదు. మర్నాడు వచ్చాడు.

"మన పోస్టల్ సూపరింటెండెంట్ శ్యామలరావుగారి తమ్ముడు" అంటూ చెప్పాడు.

ఒక చిక్కు విడింది గాని మరొక సమస్య ఎదురైంది. పెళ్ళికి వెళ్ళకపోయినా ప్రెజెంటేషను పంపాలి. అతని చేతులో మా పిలకలున్నాయి.

"మనం ఎవరం వెళ్ళకపోతే ఆ శ్యామల రావుగారు కక్ష తీర్చుకుంటారు" అని శంకరం అన్నాడు. అతనే అందరం చందాలు వేసుకొని ప్రెజంటేషన్ పంపిద్దాం అని ప్రపోజ్ చేశాడు.

"అనవసరం. మనం ఎటూ పోస్టల్ వాళ్ళం. తలా ఒక టెలిగ్రాం పంపిద్దాం" అన్నాను.

చివరకు శంకరం అందర్నీ భయపెట్టి ఒప్పించాడు. ఆఫీసర్ ర్యాంక్‌వాళ్ళు రెండేసి వందలు, సీనియర్ క్లర్కులు నూరేసి, మిగతావాళ్ళు వాళ్ళ హోదాబట్టి ఏభై లేక పాతికా చందాలు వేశారు. రెండు మూడు రోజుల్లో డబ్బులు లేవన్నవారికి శంకరం అప్పు ఇచ్చాడు. టైపు చేసి లిస్టు చూపించాడు. మొత్తం మూడువేలు.

"మీలో ఎవరెళ్ళినాసరే, లేకపోతే నేను వెళ్తానన్నాడు"

ప్రయాణం అంటే మరో రెండు వందలు అదనపు ఖర్చు రెండురోజులు సెలవుపోతుంది.

"తప్పుతుందా నేనే వెళ్తాను" శంకరం అంగీకరించాడు.

పెళ్లినుంచి వచ్చిసంతోషంగా అక్కడి విషయాలు ఏకరువుపెట్టాడు. శ్యామలరావు గారు చాలా సంతోషించారు. తతిమా చోట్ల నుంచి జాయింట్ ప్రెజెంటేషన్ ఏదీ రాలేదు. ఇద్దరో ముగ్గురో వచ్చారు. మన లిస్టుని డైరీలో ఉంచుకున్నారు. మనమీద ప్రత్యేక అభిమానం చూపిస్తానన్నారు.

అది జరిగి ఆరునెలలు గడిచాయి.

ఒకరోజు రమేష్ వచ్చి పెళ్ళి శుభలేఖలు అచ్చు వేయించాలంటూ నన్ను తనతో తీసుకుపోయాడు. నాలుగైదు ప్రెస్‌లవాళ్ళు తొందరలో ప్రింట్ చేయడం కుదరద న్నారు. ఊరి చివర ప్రెస్‌కి వెళ్ళాం. మేనేజర్ ప్రింట్ చేయడానికి అంగీకరించాడు. రమేష్ అతనితో మాట్లాడుతూ ఉంటే టేబిల్ మీదున్న నమూనా కార్డుల ఫైలు చూస్తున్నాను.



విమలా బుచ్చిబాబుల కార్డు కనిపించింది.

"ఇది మీ ప్రెస్‌లో ప్రింటు చేశారా? బయటనుంచి ఎవరైనా పంపారా?" అని అడిగాను.

"అందులో ఉన్నవన్నీ మా ప్రెస్‌లోవే" అన్న సమాధానం విని 'ఎవరు చేయించారో చెప్పగలరా' అని అడిగాను. అతను చిట్టా ఆవర్జాలు తిరగేసి పేరు చెప్పాడు.

ఆ పేరు విని నేను ఆశ్చర్యపోలేదు.

అతను శంకరం!

—గుమ్మా ప్రసాదరావు

---

## మార్నింగ్‌వాక్

**ఉ**ద్వేగ్‌కి చటుక్కున తెలివొచ్చింది. చిమ్మ చీకటి. టైమ్ ఎంతయి ఉంటుంది చెప్మా అని పడుకొనే చెయ్యి చాపాడు. టీపాయ్ మీదున్న వాచీ చేతికి దొరికింది. దాన్ని తీసుకొని టైమ్ చూసేంతలో చెయ్యి జారిపోయింది. లేచి లైటువేశాడు. కింద పడి ఉన్న వాచీ తీసిచూశాడు. ఆగిపోయి ఉందది. చిన్న ముల్లు, పెద్ద ముల్లు నూతన దంపతుల్లా జంటగా పెనవేసుకొని ఉన్నాయి. బహుశా ఎప్పుడో పండ్రెండు గంటలకి ఆగిపోయి వుండాలి.

కోళ్ళు కొక్కొరొకోమని అరుస్తున్నాయి. తన మార్నింగ్ వాక్‌కి టైమయిందని ఉద్వేగ్ ఉత్సాహవంతంగా ముందుకు కదిలాడు.

పావుగంటలో తయారయిపోయాడు. గది బైట తాళంవేస్తున్న ఉద్వేగ్‌దృష్టి బయట ఆరుతున్న లూధియానా సంచిమీద పడింది. కిందటి సాయంత్రం దాన్ని ఉతికి ఆరవేసాడు. ఇప్పుడు దాన్ని తీసిజాగ్రత్త చేయకపోతే ఎవరైనా దాన్ని జాతీయం చేసేయొచ్చు.

మళ్ళీ తాళంతీసి లోనికి వెళ్ళడానికి బద్ధకించి సంచిని భుజాన తగిలించుకొని ముందుకు నడిచాడు.

రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. స్ట్రీటులైటు వెలుగులో తనని చూసుకొన్నాడు. హోలీరోజున కుర్తా, పైజామా వేసుకొని తిరిగాడు. రంగుల్లో నానిపోయి అసలు రంగు పోగొట్టుకొని కాషాయరంగులోకి మారిపోయాయి అవి. ఏదైతేనేం చీకటిలో ఎవరు చూస్తున్నారులే అని సరిపెట్టుకొన్నాడు.

ఊరు దాటిపోయింది. ఏదో ఆలోచిస్తూ నడుస్తున్న ఉద్వేగ్ కాళ్ళకి ఏదో గట్టిగా తగిలింది. శుక్లపక్షపు చంద్రుని కాంతిలో దాన్ని చూశాడు. పొడవాటి కర్ర.

దాన్ని తీసి పరీక్షగా చూశాడు. ఐదడుగుల లాఠీలాంటిది. బహుశా ఏదైనా ఎద్దులబండినుండి పడి ఉంటుంది. తిరిగి దాన్ని పారేయడానికి మనస్సంగీకరించలేదు. సన్నగా గాలి వీస్తుంటే వడివడిగా అడుగులు పడ్తున్నాయి. భుజాన తగిలించుకొన్న సంచి ఉండుండి బెలూన్‌లా ఉబుకుతోంది.

వెనుకనుండి ఏదో మోటారు వాహనం వస్తోంది. హోలోజన్ లైట్ల కాంతి పట్టపగల్లా అనిపిస్తోంది. సైడ్‌కి తొలిగి దారిచ్చాడు. రయిమని వెళ్ళిపోవాల్సిన బండి తన పక్కకి వచ్చి ఆగింది.

అదొక పంజాబీ ట్రక్కు, సర్దార్జీ నమస్కారం చేశాడు. బహుశా కొత్తవాడయివుంటాడు. దారికోసం వివరాలు అడిగేందుకు ఆపి ఉంటాడు.

"రండి సాబ్! గాడీలో కూసోండి" అన్నాడు నమ్రతగా సర్దార్జీ.

ఉద్వేగ్‌కి గొప్ప సరదావేసింది. పంజాబీ వాళ్లంటే ఎంత మర్యాదస్తులు! అసలు వాళ్ళకి ఖాలిస్తాన్ ఏర్పాటు చేసి ఇవ్వాల్సింది. భారత ప్రభుత్వంమీద బోల్డంత కోపం వచ్చింది ఉద్వేగ్‌కు. తమాయించుకొని.




"డ్రైవరుభాయ్! ఫరవాలేదు. మీరు వెళ్ళండి" అన్నాడు.

"అచ్చా జీ!" అని సర్దార్జీ ముందుకు దూసుకుపోయాడు. ఐదు నిమిషాలు గడిచిందో లేదో మరొక ట్రక్కు వచ్చి ఆగింది.

'వణక్కం సామి! వాంగో' పిలిచాడు డ్రైవరు. ఉద్వేగ్ మనస్సు ఉద్వేగభరితమైంది. దేశంలోని తమిళులు చాలా తెలివైనవాళ్ళు, సంప్రదాయస్తులు. సుబ్రమణ్యభారతి, శివాజీగణేషన్‌ల వారసుడు ఈ డ్రైవరు. అందుకే అతి వినయంగా తనని ఆహ్వానిస్తున్నాడు.

'వణక్కం. వెళ్లుస్వామీ! నాకు నడకే



ఇష్టం' అన్నాడు ఉద్వేగ్.

'ఆమ సరిదాపోది' అని ఏభయిమైళ్ళ స్పీడులో పారిపోయాడతను.

ఉద్వేగ్ నడక స్పీడు తగ్గించాడు. ఒళ్ళంతా చెమటపోసింది. మైలురాయిమీద కూచొని సేద తీర్చుకొంటున్నాడు. అటువైపు నుండి టౌనుకి వస్తున్న వ్యాను ఆగింది. టౌనుకి పేపరు తెస్తున్న వ్యానది. చాలా లేటుగా వచ్చిందేం చెప్మా అని ఆశ్చర్యపోయాడు.

'స్వామిజీ! నమస్తే గాడీమే ఆయియె' అన్నాడు వాడు. వాడి యాస ఎలా ఉన్నా ఫక్తు పదహారణాల తెలుగువాడని తెలుస్తోంది.

"షుక్రియా! హమ్ పైదల్ హీ జాయెంగే' ' అని లేచి ముందుకు కదిలాడు ఉద్వేగ్.

రూంకి చేరుకొన్నాడు ఉద్వేగ్. ఎంతకీ తెల్లవారదేమిటి చెప్మా అని ఆలోచిస్తూ నిద్రపోయాడు. పేపరుబోయ్ కేకతో మెలకువ వచ్చింది. నిన్నటి పేపరు వెయ్యనందుకు నాలుగు తిడదామనుకునేలోపే వాడు తుర్రుమన్నాడు. వేసిన రెండు పేపర్లూ తీసి చూశాడు. రాజకీయాలు తప్ప మరేమీ లేవు. ఛీ అని గిరవాటు వెయ్యబోయి బాక్సు కట్టిన ఐటమ్ చూసి ఆగిపోయాడు ఉద్వేగ్.

"నవయువకుని పాదయాత్ర" కన్యాకుమారి నుండి కాశ్మీరు వరకు కాలినడకన బయల్దేరిన స్వామి జ్వాలావేశ్ శాంతిని ప్రభోదిస్తూ మనరాష్ట్రంగుండా సాగిపోతున్నారు. కాషాయబట్టల్లో చేతిలో కర్ర, చంకలో సంచితో కదిలివస్తోన్న ఈ యువకుని ఆంధ్రప్రదేశ్ ఆహ్వానిస్తోంది.

తాజాకలం: రాత్రిపూట ఒంటరిగా పయనిస్తున్న స్వామివారిని సగౌరవంగా తోడ్కొని స్థానిక లయన్స్ క్లబ్‌కి తీసుకొనిరావలిసిందిగా వాహనచోదకులను లయన్స్ క్లబ్ తరఫున కోరడమైనది.

అది నిన్నటి పేపరు! అదలాపడేసి ఈవాళ్టి పేపర్ విప్పాడు ఉద్వేగ్.

**—ఆనందరావ్ పట్నాయక్**

# చతుర

సంపుటి: 21   సంచిక: 11   డిసెంబర్ 1998


తల్లితండ్రులులేని, ఉన్న అన్నలు పట్టించుకోని తనను వయసు పైబడుతున్నదశలో వరించి వరమాలవేసే ఉదారులెవరూ లేరనుకుని ఉద్యోగ జీవితంలో ఇమిడిపోయిందామె.

అలాంటి సమయంలో "నా కోసం నేరుగా స్వర్గంనుండి దిగివచ్చిన దేవతవు నీవు" అంటూ ఆమెను అల్లుకుపోయాడో అందగాడు. అంతటితో ఆగక... సీతారాముల సాక్షిగా... ఆలయంలో... నలుగురు పెద్దలముందూ ఆమెను వివాహం చేసుకున్నాడు. అటుపైన అతడు ఆమెకు అనుభవంలోకి తెచ్చిన జీవితం ఎలాంటిది? అతడు తప్ప ప్రపంచమే కనుపించని, మరెవరి మాటాలెక్కించని ఆమె కళ్లకి కాలక్రమాన సాక్షాత్కరించిన సత్యాలేమిటి? పెళ్లికోసం అంగలార్చిన ఆమెకు వైవాహిక జీవితం అందించినదేమిటి? హృదయాన్ని కదిలించే కథకు ఆసక్తికర కథనంతో సింహప్రసాద్ సమర్పించిన 'సీత నడిచిన భూమి' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



# 'సీత నడిచిన భూమి'

-సింహప్రసాద్

రతనాల పందిట్లో రంగరంగవైభోగంగా కళ్యాణం జరుగుతోంది. వరుడు శ్రీరాముడు, వధువు సీత. రుషులు, బంధుమిత్రులు, పాలకులు, పాలితులు అంతా ఆ కమనీయ దృశ్యాన్ని కనులారా తిలకిస్తూ అద్భుతానందానికి లోనవుతున్నారు. అపూర్వానుభూతిని స్వంతం చేసుకుంటున్నారు.

తలంబ్రాల కార్యక్రమం మొదలయ్యింది. ముత్యాల తలంబ్రాలను చేతుల్లోకి తీసుకుంది సీత. అవి పగడాలయ్యాయి. వాటిని రాముడి దోసిలిలో పోసింది. రామవర్ణం సోకి అవి నీలాలుగా మారిపోయాయి.

అది క్రీగంట చూసి అల్లరిగా నవ్వింది సీత. ఆమె ముక్కుపుడక తళుక్కుమని మెరిసిందప్పుడే. అది చూసిన రాముడి మదిలో గిలిగింతలు చిందులేశాయి. చిద్విలాసంగా నవ్వేడు రాముడు. సిగ్గుల మొగ్గ అయ్యింది సీత.

తానుకూడా పెళ్లి మంటపం పక్కనే నిలబడి కళ్యాణాన్ని తిలకిస్తున్నదాన్లా టీవీలోని దృశ్యాల్ని తన్మయురాలై చూస్తోంది హర్ష.

సీతారాముల కళ్యాణం ఎంత కమనీయంగా కన్నులపండుగగా వుందీ!

యువతీయువకుల గుండెల్లో తీపి వూహలు రేపుతూ అలాంటి మధుర ఘట్టం తమ జీవితంలో ఎప్పుడు వస్తుందోనని తలపోసేలా చేస్తోంది.

అందుకే కాబోలు సీతారాముల కళ్యాణం లోకకళ్యాణమంటారు. ఏటేటా వూరూరా వాడవాడనా వారికి కళ్యాణం చేసి సంబరపడతారు.

'మా సీతమ్మ పెళ్లికూతురాయెనే, మా రామయ్య పెళ్లికొడుకాయెనే' అనే సంగీతం సన్నగా విన్పిస్తోంటే టీవీ ముందు నుంచి లేచింది.

ఎప్పటిదో ఆ పాట.

కాని ఇప్పటికీ ప్రతి పెళ్లిలోనూ ఆ పాటని తప్పక వాయిస్తారు భజంత్రీలు.

వధూవరులు సీతారాముళ్లలా ఆదర్శ దాంపత్యం నెరపాలనో నెరపుతారనో వారి తాత్పర్యం!

తనకి తెలీకుండానే సన్నగా నిట్టూర్చింది హర్ష. ఆ పిమ్మట ఏదో గుర్తురాగా వులిక్కిపడింది.

గబగబా డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరికెళ్లి అద్దంలో తన ముఖం పరీక్షగా చూసుకొంది.

బుగ్గల్లో నిగారింపు తగ్గింది. కళ్ల కింద నలుపు చారలు కన్పించి అదిరిపడింది. ఆత్రంగా జుట్టంతా విడదీసి చూసుకుంది. ఎక్కడా తెల్లవెంట్రుక కన్పించలేదు. గాఢంగా నిట్టూర్చింది.

అప్పుడే ఒంటిమీదికి ఇరవై ఎనిమిదేళ్లొచ్చాయి.

పెళ్లి ఘడియ ఎప్పుడొస్తుందో!

పిలిచినా విన్పించని లోకాలకెళ్లిపోయిన తల్లిదండ్రుల్నీ, విన్పించినా పలకని అన్నల్నీ తలచుకుంది.

'ఏదో రోజున ఎవడ్నో లేవదీసుకొచ్చి పెళ్లి చేసేసుకుని మీ అందరి తిక్కా కుదురుస్తాను' అనుకుంది.

సరిగ్గా అప్పుడో బంతి వచ్చి ఆమె తలని బలంగా తాకి కిందపడింది. కోపంగా చూసింది. అయిదారేళ్ల కుర్రాడొచ్చాడు ఒగురుస్తూ.

"ఈ బాల్ నీదేనా?"

భయంగా చూస్తూ తలాడించాడు.

"ఇంట్లో ఆటలేవిట్రా వెధవా''

హర్ష కోపం చూసి బిక్కచచ్చిపోయి చేయిచాచాడు బంతికోసం. చేతికివ్వకుండా బయటికి విసిరేసింది.

నిరసనగా చూసి కిందికెళ్లిపోయాడు.

వాడి వెనుకే బాల్కనీలోకొచ్చింది. వాడు కింది పోర్షన్లోని ప్లీడరు గారింట్లోకి వెళ్లడం చూసింది. బంధువో క్లయింటు తాలూకో అనుకుంది. ఇంతలో కిందనుంచి సన్నగా




ఏడ్పులు విన్పించాయి. చెవుల్ని నమ్మలేక రిక్కించి వింది. నిజమే ప్లీడరుగారింట్లోంచే వస్తున్నాయి.

తలుపులు దగ్గరకివేసి గబగబా కింది పోర్షన్లోకెళ్లింది.

ప్లీడరు రామలింగయ్యగారు కళ్లొత్తుకుంటున్నారు. అయినా మనిషి నిలువెల్లా కంపించి పోతున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

ఆయన పక్కనో యువతి విషాదమూర్తిలా కూర్చునుంది. గుమ్మం పక్కన చతికిల బడి రోదిస్తోంది రామలింగయ్యగారి భార్య కామేశ్వరి.

"ఏం జరిగింది బాబాయిగారూ'' అంది హర్ష.

"రామ్మా రా... ఎంత ఘోరం జరిగిపోయిందో చూడు''

"ఏమయ్యింది బాబాయిగారూ''

"ఇంకా ఏం కావాలి తల్లీ! నా కూతురి కాపురం నిలువునా కూలిపోయాక!" అంది కామేశ్వరి ముక్కు చీదుతూ.

ప్లీడరుగారింటి పైభాగంలో హర్ష అద్దెకి దిగి వారంరోజులే అయ్యింది. అయితేనేం ప్లీడరు దంపతుల్ని బాగా స్టడీ చేసింది. రామలింగయ్యగారు సాత్వికుడు. మంచితనం మూర్తీభవించినట్టుంటారు. అంచేత ఆయన్ని నోరారా బాబాయిగారూ అనిపిలుస్తోంది.

ఆయన సతీమణి ఆయనకి భిన్నంగా వుంటుంది. ముఖ్యంగా మాట పెడసరంగా ఎత్తి పొడుస్తున్నట్టుగా వుంటుంది. ఆవిడ మాటంటే హర్షకి భయం పట్టేసుకుంది.

ఆవిడ్ని పట్టించుకోకుండా రామలింగయ్యగారివంక ఏం జరిగిందన్నట్టు చూసింది హర్ష.

"మా అమ్మాయి ఇందిర" పక్కన కూర్చున్న యువతిని పరిచయం చేశారు.

"నమస్తే..."

"ఈ అమ్మాయి హర్ష అనీ ఈమధ్యనే మన మేడమీది పోర్షన్లోకి అద్దెకి దిగింది. ఏదో బ్యాంకులో ఆఫీసరుగా పనిచేస్తోంది''

"ఏం జరిగింది బాబాయిగారూ''

"మొగుడు తన్ని తగలేస్తే దిక్కుతోచక పుట్టిల్లు వెదుక్కుంటూ వచ్చింది'' కామేశ్వరి అందుకునంది...

"నువ్వుండవే..."

"వుండకేం చేస్తాను. అతగాడు రంగుల విసనికర్రతో రింగురంగా అంటూ తిరుగుతున్నాడు. నా బిడ్డ బొడ్డూడని పిల్లాడ్ని పెట్టుకుని ఇంట్లో ఏడుస్తూ కూర్చుంటుంది. నోరు మూసుకుని పడుండకేం చేస్తానూ. మీరంటే మగమహారాజులాయె!"

"అసలే అది దుఃఖంతో సుళ్లు తిరుగుతోంటే మధ్యలో నీ ఎగదోపుళ్లేవిటే. కూతురి కాపురం మూణ్ణాళ్ల ముచ్చటయ్యిందని నాకు మాత్రం బాధగా లేదూ. ఏదో మార్గం ఆలోచించాలి. సంసారం చక్కబడేట్లు చూడాలి. అంతేగాని వూరికే ఆవేశపడితే పనులవుతాయా!"

"అయ్యో సంబడం! ఈ అయిదారు నెలల్నుంచీ మీరు చేస్తున్న భాగోతం కళ్లొట్టుకుని చూస్తూనే వున్నాగా! మీరు బతిమాలే కొద్దీ అతగాడు చెట్టెక్కి కూర్చుంటున్నాడు. నలుగుర్లో నిలబెట్టి నాలుగు దులిపేస్తే సిగ్గొచ్చేదా పెద్దమనిషికి!"

"తెగేదాకా లాగాలంటావేమిటే''

"ఇప్పుడు తెగకుండా ఆగిందా ఏమిటి. నలుగురి చేతా తలవాచేలా చివాట్లు పెట్టించి వుంటే సరిపోయేది. చీమూ నెత్తురూ వున్నవాడైతే అమ్మాయిని ఏలుకొంటాడు. సిగ్గువెగ్గూ లేనివాడైతే ఆ కులుకులాడితో వూరేగుతాడు''

హర్షకి విషయం అర్థమైంది. ఇందిర వంక సానుభూతిగా చూసింది. ఆమె కుంద



నవు బొమ్మలా వుంది. బిడ్డ కూడా ముచ్చటగా వున్నాడు. అలాటి భార్యని ఇంట్లో వుంచుకుని వగలాడివాలుచూపు కోసం తపించడానికతగాడికి మనస్సెలా వచ్చిందో!

"స్త్రీ. బుద్ధి ప్రళయాంతకం అంటారుగానీ అసలు మగబుద్ధి సర్వ అనర్థాలకీ హేతువనుకోండి. మగాడి బుద్ధి కుక్కతోకలా వంకరగా వుంటుంది'' అంది హర్ష అతగాడిమీద కోపమూ అసహ్యమూ కలగ్గా.

"మా అల్లుడు ఇదివరకు బుద్ధిమంతుడేనమ్మా! మధ్యలో ఏమయ్యిందో ఏమోగాని మరొకామెతో సంబంధం పెట్టుకున్నాడు. అన్నివిధాలా నచ్చచెప్పి చూశాం. కానామెతో సంబంధం వదులుకోలేదు. ఇప్పుడేకంగా ఆవిడ్ని ఇంట్లోకే తెచ్చి పెట్టాట్ట. అది సహించలేక అమ్మాయి ఎదురుతిరిగేసరికి ఇంట్లోంచి గెంటేశాట్ట. ఎలాటికాలం దాపురించిందో చూడమ్మాయ్''

ఏడ్వడానికి సిద్ధంగా వున్న ఆయన కళ్లు చూసేసరికి హర్షకి గుండెల్ని మెలిపెట్టినట్టుగా అన్పించింది. అంతక్రితం బంతి విసిరిన కుర్రాడొచ్చి ఇందిర ఒళ్లో కూర్చున్నాడు. వాడి పసిమొహం చూసేసరికి ఆమెలో ఆవేశం పడగవిప్పింది.

"చక్కని భార్యా, ఇంచక్కని కొడుకూ వుండగా అతగాడికదేం పోయేకాలం? చూస్తోంటే తప్పంతా ఆ మూడో మనిషిదే అన్పిస్తోంది బాబాయిగారూ. ఆవిడే మీ అల్లుడికి మత్తుపెట్టో మాయచేసో లోబరుచుకునుంటుంది. అదెంత గుండెలు తీసిన బంటుగాకపోతే తాళికట్టిన పెళ్లాంలా ఇంటికే వచ్చేస్తుంది?"

"అదీ పాయింటే..." సాలోచనగా అన్నారు రామలింగయ్యగారు.

"మొత్తం స్త్రీ జాతే సిగ్గుతో తలొంచుకునేలా చేసిందా ఆడది బాబాయిగారూ. నన్నడిగితే ఆవిడసలు ఆడదేకాదు. రాక్షసి... శూర్పణఖ. అలాటి దాని ముక్కూచెవులూ కోసి పారెయ్యాలి. నడివీధిలో ఉరితీయాలి. అప్పుడుగాని ఆమెకీ ఆమెలాటి వారికీ బుద్ధిరాదు''

"బాగా చెప్పేవమ్మాయ్. నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్లూ చల్లగా వర్ధిల్లు''

కామేశ్వరి మాటలకి మరింత రెచ్చిపోయింది హర్ష.

"ప్లీడరై వుండి కూడా అలా డీలా పడతారేం బాబాయిగారూ. ఆవిడమీదా అతగాడి మీదా పోలీసు కేసు పెడదాం. కోర్టుల చుట్టూ తిప్పుదాం. ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిద్దాం. అప్పుడుగాని అతగాడు తప్పు తెలుసుకుని లెంపలేసుకోడు!"

"అదంత సులభమైన విషయం కాదమ్మాయ్''

రామలింగయ్యగారేదో చెప్పబోతోంటే మధ్యలోనే అడ్డుకునంది హర్ష. "కనీసం ఈ పసివాడి భవిష్యత్తు గురించైనా ఏదో గట్టి చర్య తీసుకోవాలి బాబాయిగారూ. లేకపోతే వాళ్లు పేట్రేగిపోతారు. వాళ్లని చూసి మరింత మంది బరితెగిస్తారు. ఇలాటి సాంఘిక దురన్యాయాల్ని మొక్కలోనే తుంచెయ్యాలి. లేకపోతే మొత్తం సమాజమే భ్రష్టుపట్టిపోతుంది''

"కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందమ్మా. ఇలాటి విషయాల్లో వూరికే ఆవేశపడితే లాభంలేదు. సంయమనం పాటించాలి. నయాన్నో భయాన్నో దారిలోకి తీసుకురావాలి. ఇవి నూరేళ్ల కాపురాలమ్మా. జాగ్రత్తగా బతకాలి. ఉద్రేకం తగ్గేక కాళ్లు లాక్కొచ్చేక ఎలాటివాడైనా పెళ్లాం బిడ్డల్ని వెదుక్కుంటూ వస్తాడమ్మా. మనం కొంచెం ఓపికపట్టాలంతే''

"అంటే అంతవరకూ ఆ వగలరాణిని ఏమీ అనకుండా వదిలెయ్యాలంటారు?"

"మనం వదిలినా మన సమాజం వదలదులేమ్మా''

అర్థం కానట్టు చూసింది హర్ష.

"ఎన్ననుకుంటే ఏం లేమ్మా. దాని నుదుట ఎలా రాసుంటే అలా జరక్కతప్పదు. ఒంటిమీద ఎంత అనుభవించాలని రాసుంటే అంత అనుభవించకా తప్పదు'' వేదాంత ధోరణిలో అంది కామేశ్వరి.

వారికి ఇందిర దీటైన సమాధానం ఇస్తుందని ఆశించింది హర్ష. కానామె మౌనంగా వుండిపోయింది. విసుగ్గా చూసి విసురుగా తన ఇంట్లో కెళ్లిపోయింది.

ఈ ముసిలివాళ్లింతే. ప్రతిదానికీ కూల్‌గా రియాక్టవుతారు. ఆ ఇందిర కూడా మన్నుతిన్న పాములానే వుంది. ఆమె స్థానంలో తనుండివుంటే?

చచ్చినా ఇలా వెన్నిచ్చి పారిపోయి వచ్చేదికాదు. ఆ వన్నెలాడి జుట్టు పట్టి బయటికీడ్చి చీపురుతో సత్కరించి తరిమేసేది. తన భర్తని మెత్తగా మందలించి సంస్కరించి మరీ కొంగున ముడివేసుకునేది.

ఈ కాలపు అమ్మాయిలకి చదువూ తెలివితేటలేకాదు చొరవా చురుకుదనం తెగింపూ ప్రశ్నించగల సత్తా ఎదిరించగల శక్తీ అనుకూలంగా మరల్చుకోగల యుక్తీ వుండాలి. అప్పుడే వారి సంసారాలు సుఖమయమవుతాయి.

లేకపోతే ఇందిర బతుకులా దుఃఖభా





జనం కాకతప్పదు.

తన ఆలోచనా స్రవంతి ఎంతో వుత్సాహాన్నిచ్చి వుత్తేజాన్ని కలిగించేసరికి తనెంతో శక్తిమంతురాలన్న భావన కల్గింది.

ఉప్పొంగిపోయింది హర్ష.



సినిమా హాలు ప్రాంగణంలో కెనెటిక్ హొండా పార్కుచేసింది హర్ష.

రెండడుగులేసిందో లేదో హౌస్‌ఫుల్ బోర్డు కన్పించింది. డీలా పడిపోయిందొక్కసారే.

ఆదివారం గనుక రష్ ఎక్కువగా వుంటుందని త్వరగా తెమిలి వచ్చింది. అయినా టిక్కెట్లు అయిపోయాయి.

నిరాశగా దిక్కులు చూసింది. బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మేవాళ్లు ఆమె దగ్గరికొచ్చి గొణిగారు. విననట్టు మొహం తిప్పేసుకుంది.

బ్లాక్‌లో టిక్కెట్లు కొనడం ఆమెకిష్టంకాదు. అలా కొనటంవల్ల బ్లాక్ మార్కెటింగ్‌ని ప్రోత్సహించినట్టవుతుందనీ అది మన వయస్సుకే అవమానమనీ కాలేజీ డేస్‌లో వాదించింది కూడానూ.

ఒకపక్క సినిమా చూడాలన్న ఆశ. మరో పక్క బ్లాక్‌లో టిక్కెట్టు కొనకూడదన్న సిద్ధాంతం.

కింకర్తవ్యం? ఆలోచనలో పడింది.

"గుడీవినింగ్ మేడం! టిక్కెట్ దొరకలేదా?"

ఆలోచనల్నుండి తేరుకుంటూ చూసింది... ఓ యువకుడు.

సన్నగానే అయినా బలంగా, పొడుగ్గా వున్నాడు. కోలమొహం. అతి సన్నని కోర మీసం. ఒత్తైన నల్లని వంకీల జుట్టు...

అతడెవరో అర్థం కాలేదు.

కాని టిక్కెట్టు దొరకలేదన్నట్టు తలాడించింది.

"జస్ట్ ఎ మినిట్ ప్లీజ్..." అంటూ సినిమా హాలువారి ఆఫీస్ రూంలోకెళ్లాడు. అయిదు నిమిషాల్లో టిక్కెట్ తెచ్చిచ్చాడు.

"నిజంగానే టిక్కెట్ తెచ్చారా థాంక్‌గాడ్..."

"టిక్కెట్ నేను తెస్తే దేవుడికి థాంక్స్ చెబుతారేవిటి"

"దేవుళ్లా వచ్చారుకదా అందుకని మీకే థాంక్స్"

"వెల్‌కమ్"

హేండ్‌బేగ్‌లోంచి డబ్బు తీసిచ్చింది. థాంక్స్ చెప్పేడు.

"బయట హౌస్‌ఫుల్ బోర్డుపెట్టి జనాన్ని మోసం చెయ్యడం దారుణం"

"పైకి కన్పించినట్టుగా లోపలుండవు మేడం. మేడిపండు చూడ మేలిమై వుండును పొట్ట విప్పి చూడ పురుగులుండు పురుషులందు పుణ్య పురుషులు వేరయా విశ్వదాభిరామ వినురవేమా"

నవ్వింది హర్ష.

"ఎందుకు నవ్వుతున్నారు మేడం. పద్యం తప్పుచెప్పేనా?"

"పురుషులందు పుణ్యపురుషులు లేరయా అంటారేమోనని భయపడ్డాను"

"అదీ నిజమే మేడం! ఆ పద్యపాదం గురించి కాంట్రవర్సీ వుంది"

నవ్వేడు. ఆ నవ్వులోని ఏదో ఆకర్షణ

ఆమెని ఆకట్టుకుంది.

"క్షమించాలి, మీరెవరో గుర్తు రావట్లేదు''

"నేను చిరంజీవినీ, అజరుద్దీన్‌నీ, రెహమాన్‌నీ కాదు. మరెలా గుర్తు పట్టగలరు? కాని నేను మిమ్మల్నెరుగుదును''

"నన్నా?"

"అంతగా ఆశ్చర్యపడాల్సిందేంలేదు. మిమ్మల్నీ మీ అందాన్నీ మీ పనినీ మీ సిన్సియారిటీనీ ఒక్కసారి చూసిన వాళ్లెవరూ మర్చిపోరు''

''రెండుసార్లు చూస్తే మర్చిపోతారా'' చిన్నగా నవ్వుతూ అంది.

"వూహూ స్నేహం చేస్తారు''

"బాగా మాట్లాడతారే''

"మాటలే నా పెట్టుబడిలెండి. బైదిబై నేను మీ కస్టమర్ని, సారీ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ! మీ బ్యాంక్ కస్టమర్ని''

"ఓ ఐసీ నేనీ వూరు ట్రాన్స్‌ఫర్ మీదవచ్చి పదిరోజులు కూడా కాలేదులెండి. కస్టమర్లంతా పూర్తిగా తెలీదు''

"కస్టమర్ గురించి తెలుసుకుంటూ నిలబడితే అవతల సినిమా అయిపోతుందిగాని పదండి''

మరోసారి థాంక్స్ చెప్పి లోపలికి నడిచింది. అతడూ వస్తున్నాడేమోనని చూసింది. రావట్లేదు. కనీసం అతడి పేరేవిటో కనుక్కోనందుకు గిల్టీగా ఫీలయ్యింది హర్ష.

సరదా మనిషి అనుకుందతడి ప్రవర్తన, ముఖ్యంగా పొగడ్త గుర్తొచ్చి.

తనేమిటో వయస్సైపోయినట్టు ఫీలవుతోందిగాని తను అందంగానే వుందన్న మాట.

గబుక్కునామె బుగ్గలు గులాబీ రంగు పులుముకున్నాయి. మరేవో తీయని రాగాలు విన్పిస్తోంటే వింత తలపుల్లోకి జారిపోబోయి సినిమా మొదలవడంతో ఆగిపోయింది.

కాస్సేపటికి టిక్కెట్ కొనిచ్చిన యువకుడొచ్చి "మీకభ్యంతరం లేకపోతే ఈ సీట్లో కూర్చుంటాను'' అన్నాడు పక్క సీటు చూపిస్తూ.

అతడ్ని గుర్తుపట్టింది "మీరా?"

"కాదు మీరుడ్ని''

"కూర్చోండి''

కూర్చుని "కథేమైనా జరిగిందాండీ'' అనడిగాడు.

"ఇప్పుడిప్పుడే పాత్రలు ఇంట్రడ్యూస్ అవుతున్నాయి''

"అసలు కథ వుంటేగా జరగటానికి. నాలుగు ఫైట్లు, ఆరు పాటలు, అయిదు వెకిలి కామెడీ సీన్లు వెరశి తెలుగు సినిమా. అన్నట్టు ఓ బక్కెట్టుడు కన్నీళ్ల సీన్లు కూడా వుంటాయండోయ్. ఇహ ఆ పాటలూ ఆ సీన్లు ఏ సినిమాలో దూర్చినా చక్కగా అతుక్కుపోతాయి. ఇలాటి సినిమాలు చూడాలంటే కాస్త టైమ్‌పాస్ గడ్డి వుండాలి. అందుకని పొటాటో చిప్స్ తెచ్చాను. మధ్యమధ్య నమలండి మేడం"

ఒక పాకెట్ ఇచ్చాడు. మొహమాట పడ్తూనే తీసుకుంది.

సినిమా చూస్తున్నంతసేపూ చిన్నగా ఆమెకే వినబడేలా ఏదేదో చెబుతూనే వున్నాడు. వ్యాఖ్యానాలు విసుర్తూనే వున్నాడు. జోకులు పేలుస్తూనే వున్నాడు.

సినిమాకన్నా అతడి కంపెనీని బాగా ఎంజాయ్ చేసింది హర్ష.

ఇంటర్వెల్‌లో కూల్ డ్రింక్స్ తెచ్చిచ్చాడు. వద్దన్లేదు. మొహమాటపడనూలేదు.

"మీరు క్షమిస్తానంటే వెళ్లిపోతాను''

"అదేమిటి? సినిమా పూర్తిగా చూడరా?"

"నాకు అర్జంటు పనుంది. ఓ ఇద్దరు పార్టీలని కలవాలి. ఇప్పుడు వెళ్తేనే వాళ్లు దొరుకుతారు. డ్యూటీ ముఖ్యంకదా. నిజానికి నేను సినిమాకోసం రాలేదు''



"మరి చిప్స్ తినడానికొచ్చారా?" నవ్వింది.

"అబ్బో మాటలవారేనే. మీరు కన్పించారు గనుక మనస్సుని అదుపు చెయ్యలేక వచ్చాను. క్షమించండి. మనస్సులోని మాట మొహంమీద చెప్పెయ్యడం నా అలవాటు"

ఆమె గుండె ఝుల్లుమందొక్కసారే. తడబడ్తూ చూసి "మీరు మీరేం చేస్తారు?" అనడిగింది.

"మార్కెటింగ్ నా వృత్తి, స్నేహం నా ప్రవృత్తి. వస్తాను మేడం" లేచాడతడు.

"ఒన్ మినట్. మీ పేరు?"

"శ్రీను, 'నిన్నే పెళ్లాడతా' శ్రీనుని కాదు లెండి'' అనేసి వెళ్లిపోయాడు.

అతడెళ్లిన వైపే చూస్తుండిపోయింది చాలా సేపు.

నడక స్టైలు బాగుందే అనుకోకుండా వుండలేకపోయింది. నడకేమిటి మాట బావుంది. రూపం బావుంది. ప్రవర్తన బావుంది. మనస్సు కూడా బాగానే వున్నట్టుంది. పెళ్లికాకుండా వుండివుంటే మరీ బావుంటుంది. తన ఆలోచనా ధోరణికి వులిక్కిపడింది. అంతలోనే నవ్వుకుంది.

ఆ పిమ్మట సినిమా చూడాలన్పించలేదు. అతడ్నీ అతడి మాటల్నీ తలచుకుంటూ అన్యమనస్కంగానే వుండిపోయింది.

అతడు తన పక్కనుంటే ఎంత సరదాగా, సంతోషంగా వుందీ!

ఇతడి కంపెనీ శాశ్వతమైతే?

ఆమె గుండె గుభిల్లుమందొక్కసారే. ఆ శబ్దం ఎవరైనా విన్నారేమోనని చుట్టూ కలవరంగా చూసింది. అంతా సినీ మాయలో కొట్టుకుపోతూండటం గమనించి నిట్టూర్చింది.

ఆ రాత్రి హర్ష కంటినిండా నిద్రపోలేదు. నిద్రపోయిన కాస్సేపూ తీయని కలలు కంది.

ఆ కలల్లో శ్రీను గ్రీకు వీరుడిలా కన్పించాడు.

★ ★ ★

పీక్అవర్స్ అవడంవల్ల బ్యాంక్‌లో రష్‌గా వుంది.

లోన్స్ డిపార్ట్‌మెంట్ చూసే హర్ష దృష్టి డిపాజిట్స్ కౌంటర్ మీద వుంది. అతడు కన్పిస్తాడేమోనన్న ఆశతో వెదుకుతున్నాయామె చూపులు.

"ఇవాళ ఎటో వెళ్లిపోయినట్టుంది మీ దృష్టి'' క్లర్క్ సరిత అంది.

"అబ్బే.. ఎటూ వెళ్లలేదు నా మనస్సు''

చిత్రంగా చూసి నవ్విందామె "అంటే డెఫినిట్‌గా వెళ్లిపోయిందన్నమాట. ఎవరా లక్కీ ఫెలో?" చెవిలో గుసగుసలాడింది.

సిగ్గుల దొంతర్ల మధ్య నలిగిపోతూ, "ఇంకా ఏం కాలేదు. వుంటే నీకు చెప్పనా?" అంది.

"ట్రాన్స్‌ఫర్ దెబ్బకి బూరెల బుట్టలో పడ్డారన్న మాట. విష్యూ బెస్టాఫ్ లక్''

'సరిత అఖండురాలు సుమా. ఇట్టే పట్టేసింది చూడు' అనుకుంది హర్ష. పనిమీద దృష్టి నిలపడానికి విఫలయత్నం చేసింది.

లంచ్‌టైములో హర్ష, సరిత, శిల్ప డైనింగ్ రూంలో లంచ్ చేస్తున్నారు. సరిత ఏదో చెబుతోంటే వింటూ తింటున్నారు మిగతావాళ్లు.

సరిత, శిల్ప ఇద్దరికీ కూడా పెళ్లయ్యింది. హర్ష ఆఫీసరూ వాళ్లు గుమాస్తాలూ అయినా ఎలాటి భేద భావం లేకుండా కలిసుంటారు. అంతేకాదు పెళ్లి తెచ్చి పెట్టిన హోదావల్ల హర్షతో కాస్త పెద్దతరహాగానే మాట్లాడుతూంటారు కూడా.

సరిత చాలా తెలివైంది. పాలూ నీళ్లూ విడదీసి చూడగలదిట్ట. ఆమె భర్త మరో బ్యాంక్‌లో పనిచేస్తున్నాడు. ఆమెని స్కూటర్ మీద డ్రాప్‌చేసి వెళ్తాడు. మళ్లీ అయిదింటికో




చ్చి పికప్ చేసుకుంటాడు. వాళ్లది అన్యోన్య దాంపత్యం అంటారంతా.

శిల్ప కేషియర్. పది గంటలకి కేష్ కేబిన్లోకెళ్లి రెండు గంటలకి బయటికొస్తుంది. మళ్లీ రెండున్నరకి వెళ్లి నాలుగున్నర, అయిదుకి బయటికొస్తుంది. సహెూద్యోగుల్తో కూడా ఏమీ మాట్లాడదు. ఆమె భర్త నిత్య శంకితుడనీ అందుకే ఆమె అందరికీ దూరంగా మసల్తూంటుందనీ అనుకుంటారంతా.

"హర్షగారు మనకి త్వరలో పెళ్లి భోజనం పెట్టించబోతున్నారు'' అంది సరిత.

శిల్ప హర్ష మొహంలోకి చూసి తల దించుకుంది.

"ష్..." సైగ చేసింది హర్ష.

"నాకు తెలిసిపోయిందిలెండి. ప్రొద్దుట్నుంచీ పోస్ట్మేన్ కోసం ఎదురు చూస్తున్నారు. పెళ్లి కబుర్ల లేఖ కోసమేనని అర్ధమైపోయిందిలెండి. పెళ్లి సంబంధం మీ పెద్దన్నయ్య చూస్తున్నారా చిన్నన్నయ్య చూస్తున్నారా?"

పొలమారింది హర్షకి.

"అదిగో మిమ్మల్నప్పుడే పెళ్లివారు తలచుకుంటున్నారు''

ఇబ్బందిగా కదిలింది. అదే సమయంలో సరిత మరోరకంగా భావిస్తున్నందుకు ఎంతో రిలీఫ్ ఫీలయ్యింది కూడా.

"ఇద్దరు అన్నయ్యలూ చూస్తున్నారు'' అతి కష్టం మీద అంది.

"మరింకేం మా బ్రాంచికొచ్చిన వేళావిశేషం వల్ల ఏదొకటి సెటిలైపోతుంది. త్వరలో హర్ష హర్షిణి అయిపోతుందన్నమాట"

"హరిణి కాకుండా వుంటేచాలు'' అనేసి లేచెళ్లిపోయింది శిల్ప.

బ్రమాన్పడిపోయారు మిగతా ఇద్దరూ.

నాలుగు రోజులు గడిచాయి.

శ్రీనుకోసం హర్ష కళ్లు ఎదురు చూస్తూనే వున్నాయి. నిరాశతో కనురెప్పలు వాలిపోతున్నాయి. మనస్సు పదేపదే కలవరిస్తోంది. కలవరపడుతోంది.

కానతడి జాడలేదు.

'మరచిపోయాడేమో' అని చిన్నగా అనుకుంటే చాలు ఆమె కళ్లల్లోకి నీళ్లొస్తున్నాయి.

రీజినల్ ఆఫీసుకి పంపడానికి ఓ లోన్ ప్రపోజల్ సీరియస్గా తయారు చేస్తోంది హర్ష.

"నమస్తే మేడం"

తలెత్తి చూసింది. నవ్వుతూ శ్రీను.

ఆమె మొహంలోకి సంతోషతరంగాలు వెల్లువలా త్రోసుకొచ్చాయొక్కసారిగా.

"అలా చూస్తున్నారేమిటి. నేనండీ శ్రీనుని. మర్చిపోయారా ఏమిటి''

"అహ... అబ్బే... కూర్చోండి..."

"బతికించారు. మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడంలేదుకదా?"

"అహ... అదేంకాదు''

టీ కుర్రాడొచ్చి ఆమె ముందు టీ గ్లాసు పెట్టాడు.

అతడికీ ఇమ్మని సైగచెయ్యగా మరో గ్లాసతడిముందు పెట్టివెళ్లాడు.

"మీరిలా టీ ఇప్పిస్తోంటే రోజూ వచ్చి మీకెదురుగుండా కూర్చునుంటాను. తర్వాత తిట్టుకుంటారు మరి. ఆపైన మీ ఇష్టం"

"రండి టీ భాగ్యానికేనా!"

"ఇంత చిన్నవయస్సులో అసిస్టెంట్ మేనేజరెలా కాగలిగారో ఇవాళే తెలిసింది''

"ఎలా అయ్యాను?"

"ఇన్వాల్వ్మెంట్. పనిలో మమేకం అంటారే అలాంటి దన్నమాట. అది వుంది గనుకే మిమ్మల్ని గుర్తించారు. త్వరగా మెక్కెక్కించేశారు''

"థాంక్స్''

"థాంక్స్ కోసం చెప్పలేదండీ. మనస్సులోని మాట ముఖంమీదే చెప్పెయ్యడం నా

అలవాటు. అన్నట్టు మీకేమైనా సేవచేసే భాగ్యం కల్గిస్తే మరింత సంతోషిస్తాను. గ్యాస్ కనెక్షన్ తీసుకున్నారా?''

"ఆపని అయ్యింది గాని రేషన్‌కార్డ్ పన వ్వలేదు. యమ్మార్వో ఆఫీసుచుట్టూ తిరగడానికి వీలు చిక్కడంలేదు''

"పాతకార్డు వుంటే ఇవ్వండి రేపటికల్లా మార్పించి తెస్తాను'' హేండ్ బేగ్‌లోంచి తీసిచ్చింది.

ఇంతలో మరో ఆఫీసరొచ్చి హర్షతో అన్నాడు "మీ దగ్గర స్పేర్ సిలిండర్ వుందా హర్షగారూ. గ్యాస్ అయిపోయిందని మా ఇంటినుంచిప్పుడే ఫోన్ వచ్చింది. ఇంట్లో బంధువులుకూడా వున్నారు..."

ఆమె బదులిచ్చేలోగానే, "మీ కనెక్షన్ నెంబరివ్వండి మాస్టారూ రెండుగంటల్లో గ్యాస్ సిలిండర్ మీ ఇంటికి నడుచుకుంటూ వస్తుంది'' అన్నాడు శ్రీను.

"కాస్త హెల్ప్ చెయ్యవోయ్. పదో, పరకో ఎక్కువైనా పర్లేదు''

"ఎక్కువేమీ ఇవ్వక్కర్లేదు. మీ నెంబరివ్వండి చాలు''

అతడి దగ్గర నెంబరు తీసుకున్నాడు.

"మరిక పర్మిషనిస్తే మాయమైపోతాను''

"మాయమైపోండయితే'' నవ్వుతూ అంది.

క్షణాల్లో అందర్నీ తప్పించుకుంటూ వేగంగా వెళ్ళిపోయాడు.

"భలే చిత్రమైన మనిషి సుమా'' అనుకుంది. ఆమెలో కొత్తవ్యూహం పుట్టుకురాగా చకచకా ప్రపోజల్ని తయారుచేసేసింది.

"అతనెవరు?" లంచ్ టైంలో అడిగింది సరిత.

"ఎవరి గురించీ.."

"అతనే. పొద్దుట మీతో చాలా సేపు మాట్లాడుతూ కూర్చున్నాడు. మీరు టీ కూడా ఇప్పించారు''

'అతనా? శ్రీను అనీ...'

"అనీ...? ఎవరూ? ఏం చేస్తాడూ?"

"అవేమీ తెలీదు. ఏదో చిన్న పరిచయమంతే''

'అంతేనా' అన్నట్టు నిరాశగా చూసింది సరిత.

"అతడు విజేతా హౌసింగ్ అండ్ రియల్ ఎస్టేట్స్‌వారి ఖాతాలో డబ్బు జమ చేయడానికి అప్పుడప్పుడూ వస్తుంటాడు''

శిల్ప మాటలకి మిగతా ఇద్దరూ తుళ్ళిపడి చూశారు.

హర్ష ఆశ్చర్యానికైతే అవధులే లేకపోయాయి.

తలొంచుకుని తన పనేదో తను చేసుకుపోయే శిల్పకూడా తనతో శ్రీను మాట్లాడి వెళ్లడం గమనించిందంటే...! బహుశా బ్యాంకులోని వాళ్లంతా కూడా చూసే వుంటారు. ఏమనుకున్నారో!

ఆమెకెంతో సిగ్గుగా అన్పించింది. ముఖంలోని భావాలు వారికగుపించకుండా జాగ్రత్తపడింది. గబగబా లంచ్ ముగించి తనసీట్లో కెళ్ళిపోయింది.

★ ★ ★

బ్యాంకునుంచొచ్చి స్కూటర్‌కి తాళంవేసింది హర్ష.

మేడపైకెళ్లబోయి ఆగి రామలింగయ్యగారింట్లోకి నడిచింది.

ఇందిర టీవీ చూస్తోంది. ఆమె కొడుకు గోపి ఏవో బొమ్మల్తో ఆడుకుంటున్నాడు.

"బావున్నారా''

పేలవంగా నవ్విందామె.

తనెంత అనాలోచితంగా అడిగిందో తెలుసుకుని నొచ్చుకుంది. "మీరేం దిగులుపడకండి. మన ధైర్యం సడలకుండా వుంటే ఏమైనా సాధించొచ్చు''

"మిగతా విషయాలు వేరు, ఈ సంబంధాలు వేరు''




"ఇది నూరేళ్ల బంధమండీ. ఆషామాషీగా తెగిపోయేది కాదు. రెండుజీవితాల్ని కలిపేదే మంగళసూత్రం. మీ ప్రేమకి రూపమే గోపి. ఎవరి ఆకర్షణలోనో పడి రెండుమూడురోజులు తిరగొచ్చుగాని తిరిగి మీదగ్గరికి రావాల్సిందే. మీ ఒడిలో సేద దీరాల్సిందే''

"మీ వాక్కు నిజం అవుతుందనే మా ఆశ"

"తప్పకుండా అవుతుంది. గోపీ చదువు పాడవుతోందేమో''

"ఇవాళే కాన్వెంట్లో చేర్చాం. రేపట్నుంచి వెళ్ళిపోతాడు''

"మంచిపనిచేశారు. పిల్లలచదువుని ప్రాథమిక స్థాయిలో అస్సలు నిర్లక్ష్యం చెయ్యకూడదు. పునాదిగట్టిగా వుంటేనే కదా భవనాలు నిలిచేది''

"నా గొడవకేం గానీ మీ కబుర్లు చెప్పండి. మీ నేటివ్‌ప్లేస్ ఎక్కడ?"

"నర్సాపురం. నాన్నగారు స్కూళ్ల ఇన్‌స్పెక్టరుగా పనిచేసేవారు. ఆయనపోయాక ఆవూరితో సంబంధాలు తెగిపోయాయిలెండి''

"అమ్మానాన్నా వుండివుంటే మీకీసరికి పెళ్ళిచేసేసేవారనుకుంటూ వుంటాం. మీకిద్దరు అన్నయ్యలు వున్నార్టగా. వాళ్ళేం పట్టించుకోరా?"

"పెద్దన్నయ్య హైదరాబాద్‌లో ఫుడ్ కార్పొరేషన్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. చిన్నన్నయ్య తిరుపతిలో యూనివర్శిటీలో పనిచేస్తున్నాడు. నేనేమో ఇక్కడ ఉద్యోగం చేస్తున్నాను''

"బావుంది. ముగ్గురూ మూడు ప్రాంతాలనీ పంచుకున్నారన్నమాట. అన్నయ్యలు బాగానే సెటిలైనట్టున్నారుకదా. పైగా మీరు బ్యాంకు ఆఫీసరుగా పనిచేస్తున్నారు. చక్కనిసంబంధంచూసి చేసెయ్యాల్సిందేనే''

"మీకు తెలీందేవుంది. ఎవరి సంసారపు జంఝూటాలు వారివి. అయినా ఏవో చూస్తూనే వున్నార్లెండి. దేనికైనా టైము రావాలి. నాన్నగారితో మాట్లాడాలి.... వస్తానూ..."

రామలింగయ్యగారి ఆఫీసు రూంలోకెళ్ళింది. ఏవో లా బుక్స్ తిరగేస్తున్నారాయన. ఒక్కసారే పదేళ్ళు పైబడ్డట్టుగా అయిపోయిన ఆయన వంక సానుభూతిగా చూసింది.

"నువ్వా. రామ్మారా... కూర్చో..."

"మీ అల్లుడుగార్నేమైనా కలిశారా బాబాయిగారూ''

"కలిశామమ్మా. బంధుమిత్రుల్తోకూడా చెప్పించి చూశాను. ఎక్కడా కొరుకుడు పట్టంలేదు. విడాకులు కావాలంటున్నాడు''

"అతగాడికేం ఇంకొకతె వుంది. ఇందిరా, పిల్లాడూ ఏమైపోవాలిట?"

"అవన్నీ ఆలోచించే వాడైతే అలాంటి పనెందుకు చేస్తాడమ్మా''

"మరేంచేద్దామంటారు. భార్యాభర్తలమధ్య ప్రవేశించిన ఆ మూడోమనిషిని తలచుకుంటే చాలు నా ఒళ్ళు రగిలిపోతోంది బాబాయిగారూ. ఆవిడకి తగిన విధంగా బుద్ధిచెప్పాలి. అలాటివాళ్ళ వల్లనే పచ్చని సంసారాలు వల్లకాడులైపోతున్నాయి. వాళ్ళని వూరికే వదలకూడదు''

"కోర్టులో కేసుపెట్టొచ్చు. కానది రెచ్చగొట్టే చర్య అవుతుందని చూస్తున్నాం. దానివల్ల పరిస్థితి మరింత వికటించే ప్రమాదముంది. అయినా మన బంగారంమంచిది కానప్పుడు ఆవిడ్నని లాభం ఏవిట్లే''

"మన బంగారం మంచిదైనా కంసాలి చేతిలో ఏమైనా అవ్వొచ్చుగా''

"అదీ నిజమే అనుకో... మా వియ్యంకుడితో కూడా మాట్లాడేం. సర్దిచెబుతామనీ తొందరపడొద్దనీ చెప్పారు. కాస్త ఆలస్యమైనా అమ్మాయికాపురం చక్కబడుతుందని నమ్మకంగా వుంది మరి..."

"అదీ నిజమే బాబాయిగారూ. వేడి తగ్గాక వాళ్ళే కాళ్ళు బేరానికొస్తారు. వస్తాను

బాబాయ్''

ఇందిరకి కూడా చెప్పి వచ్చేసింది. ఎందుకో గోపీ జోలికెళ్లలేకపోయింది. వాడూ ఆమెని అదోలా చూస్తున్నాడు. ఆ రోజున బంతి గురించి తిట్టిందనేమో!

కామేశ్వరి కంట బడనందుకు సంతోషించకుండా వుండలేకపోయింది హర్ష!

★ ★ ★

హర్ష ఋణవసూళ్లకోసం బస్తీలో తిరిగి తిరిగి వస్తోంటే దారిలో శ్రీను కన్పించాడు.

స్కూటర్ ట్రబులిచ్చింది కాబోలు కుస్తీ పడుతున్నాడు.

తన స్కూటర్నాపి "హలో' అని పలకరించింది.

'ఓహ్! ఏం పుణ్యం! దేవతలా ప్రత్యక్షమయ్యారనుకోండి. గంటనుంచి ఇది స్టార్టవ్వక లిఫ్ట్ ఇచ్చేవాళ్ళు దొరక్క ఘోరతపస్సు చేస్తున్నాను మేడం. ఎలాగూ ప్రత్యక్షమయ్యారు గనుక కాస్త కరుణించి లిఫ్ట్ వరాన్ని దయచేస్తే..."

ఆమె ఇబ్బందిగా సందేహిస్తూ చూసింది.

"మేం అవనిలో సగం ఆకాశంలో సగం అని స్త్రీ వాదులు పిడికిళ్ళు బిగిస్తున్నారు. మీరేమో ఒంటెద్దు బండి కాలపు వాళ్లలా మీనమేషాలు లెక్కపెడుతున్నారు. ఇది మొత్తం స్త్రీజాతికే అవమానం మేడం. మీలాంటి యంగ్ ఎడ్యుకేటెడ్ ఫైనాన్షియల్ ఫ్రీడం గలవారైనా స్త్రీ ఎందులోనూ తీసిపోదని రుజువు చెయ్యకపోతే ఎలా చెప్పండి? నాకు మాత్రం ఆవేశం వచ్చేస్తోంది. ఉపన్యాసం ఇచ్చేస్తాను మరి. ఆపైన మీ ఇష్టం!"

"వద్దొద్దు. మీ వాక్ప్రవాహంలో కొట్టుకుపోలేను గాని రండి లిఫ్ట్ ఇస్తాను'' చిన్నగా నవ్వుతూ అంది నెర్వస్‌గా ఫీలవుతూనే.

"ఇప్పుడు నాకు నచ్చారు. అయినా మనస్సులు నిర్మలంగా వున్నప్పుడు రాసుక్కూర్చున్నా తప్పు లేదంటాను. ఏమంటారు?"

"అవుననకపోతే వూరుకుంటారా! యస్ అంటున్నానుగానీ ఇక ఫుల్‌స్టాప్ పెట్టెయ్యండి''

"థాంక్స్ ఎ లాట్'

కెనెటిక్ హెూండా వెనుక కాళ్ళు అటూ ఇటూ వేసి కూర్చున్నాడు శ్రీను.

అతడి శరీరం ఆమెకి తాకనట్టుగా తాకుతోంది. ఆమె శరీరం వింత అనుభూతికి లోనవుతుంటే ఆమె బుగ్గలు ఎర్రబడ్డాయి. కళ్లల్లో ఏవో తెలీని సిగ్గులు పిల్లిమొగ్గలేశాయి.

కుదుపులవల్ల ఆమెకి మరీ దగ్గరగా వచ్చేశాడు. అయినా పట్టించుకోకుండా ఏదేదో చెప్పేస్తున్నాడు గాని ఆమె చెవిలో ఒక్క మాటా దూరటం లేదు. మధ్యమధ్య రెండు మూడుసార్లు ఆమె భుజాల మీద చేతులేసి గబుక్కున తీసేశాడు.

"హెూల్డాన్ హెూల్డాన్! నా గమ్యం వచ్చేసింది మేడం" అని ఓ మెకానిక్ షెడ్ దగ్గర ఆపించి దిగాడు శ్రీను.

"మీకు మీ స్కూటర్ మొయ్యగలిగినన్ని కేజీల థాంక్స్''

అతడి ముఖంలోకి చూళ్ళేక తలూపి యాక్సిలేటర్ రెయిజ్‌చేసింది.

మరి రెండ్రోజులకి శ్రీను బ్యాంకుకొచ్చాడు.

తిన్నగా హర్ష సీటు దగ్గరికొచ్చి కుర్చీలాక్కుని కూర్చుంటూ "మీ ఇన్వెస్ట్‌మెంట్ ప్లాన్ ఏమిటి మేడం" అనడిగాడు.

"షేర్స్‌లో పెట్టను బాబోయ్''

"అది ఓల్డ్ ట్రెండ్. మా కంపెనీ కొత్తగా టౌన్‌సెంటర్లో అపార్ట్‌మెంట్స్ కడుతోంది. రీజనబుల్ రేటు. డెవలప్‌మెంటు ఆఫీసరుగా నాకొచ్చే కమీషన్ని వదులుకుని నా ఇన్ఫ్లూయన్సు కూడా ఉపయోగించి తక్కువ రేటుకి ఇప్పిస్తాను. ఒక ఫ్లాట్ తీసుకోండి మేడం"

"హౌస్ మీద నాకంత ఇంట్రస్టు లేదు''

"ఎందుకులేదో నాకు తెలుసు. పెళ్లికీ





దీనికీ ముడి పెట్టొద్దు. ఒక ఫ్రెండ్‌గా నేను చెప్పేది కాస్త వినండి..."

అతడి గ్రాహకశక్తికి అచ్చెరువొందుతూనే "చెప్పండి'' అంది.

"ఇవాళరేపు అప్రిసియేషన్, రిటర్న్ అత్యధికంగా వున్నది రియల్ ఎస్టేట్‌లోనే. ఆలస్యంచేస్తే ముందుముందు అస్సలు కొనలేరు. అంతవేగంగా పెరుగుతున్నాయి రేట్లు. పైగా మీకు తక్కువవడ్డీకి బ్యాంకు అప్పు ఇస్తుంది. కాస్తో కూస్తో తక్కువైతే పీ.యఫ్.లోన్ తీసుకోవచ్చు. లేదా మరో లోన్ తీసుకోవచ్చు. అంతా మీ చేతుల్లోని పనేకదా!"

"అవుననుకోండి. కానీ..."

"అప్పుడే చప్పరించెయ్యొద్దు. నేను చెప్పేది సాంతం వినండి. మీకంటూ ఒకస్థిరాస్థి వుండిపోతుంది. దాని మీదొచ్చే అద్దె మీ లోన్ వాయిదా సొమ్ముకి సరిపోతుంది. పదిహేను ఇరవై ఏళ్లకి ఇల్లు మీ స్వంతమైపోతుంది. పైగా వడ్డీకీ అసలు చెల్లింపుకీ ఇన్‌కమ్ టాక్స్ రాయితీవుంది. గనుక అదో అదనపు బెనిఫిట్. బాగా ఆలోచించండి..."

అద్భుతమైన ఆలోచన అన్పించిందామెకి. 'ఈరకంగా తను ఆలోచించనే లేదసలు. స్నేహితులుకూడా సలహా ఇవ్వలేదు. అలాంటిది నిన్నగాక మొన్న పరిచయమైన ఇతడు'

"ఇంకేం ఆలోచించకండి మేడం. నామీద నమ్మకముంటే ఈ అప్లికేషన్ మీద సంతకం పెట్టండి. మీ దగ్గరుంటే రిజిస్ట్రేషన్ ఫీజు అయిదువేలివ్వండి. లేదూ నేను కట్టేస్తాను. తర్వాత ఇద్దరుగాని''

అతడి అభిమానానికి కరిగిపోయింది. సంతకంపెట్టడమే కాదు చెక్కురాసిచ్చింది. రసీదిచ్చాడు.

"వాస్తు మీద నమ్మకముందా మేడం?"

"వూహూ..."

"అయినా వాస్తు పండితుడికి చూపిస్తాన్లెండి. మనకి నమ్మకమున్నా లేకపోయినా అన్నిరకాలుగా బావుండేట్లు చూసుకుంటే మంచిదికదా!"

"నాకవేం తెలీవు. ఎలా బావుంటుందంటే అలా చెయ్యండి''

"ఓ.కే. చూస్తాండండి. ఈశాన్యపు అపార్ట్‌మెంట్ మీకొచ్చేలా ప్రయత్నిస్తాను. లోపలి పనికూడా మా ఇంజినీరుకి చెప్పి ప్రత్యేకశ్రద్ధతో చేయిస్తాను. ఏడాది తిరిగేసరికి బెస్ట్ ఎడ్వైజ్, బెస్ట్ ఇన్వెస్ట్‌మెంట్ అని మీచేత అనిపించకపోతే నాపేరు మార్చేసుకుంటాను. బైదిబై మీ బ్యాంకులోని మిగతా వారిక్కూడా రికమండ్ చేస్తే మరీ సంతోషం. వస్తాను మేడం"

వెళ్లిపోయాడతడు.

"అపార్ట్‌మెంట్ తీసుకున్నారా హర్షగారూ'' ఎక్కౌంటెంట్ అడిగాడు.

"అవునండీ. హౌసింగ్ లోన్ వస్తుంది కదాని..."

"అయితే ఈ వూళ్ళోనే సెటిలైపోతున్నారన్నమాట. బెస్టాఫ్ లక్'

వులిక్కిపడింది.

తనారకంగా ఆలోచించనేలేదు సుమా! అయితేనేంలే. త్వరత్వరగా అభివృద్ధి చెందుతోన్న టౌన్. శ్రీను అన్నట్టు అప్రిసియేషన్ అధికంగా వుంటుంది. అద్దెకూడా బాగా వస్తుంది. తను ఏ వూరికి ట్రాన్స్‌ఫర్ అయినా బ్యాంకులో వాళ్లకి అద్దెకిస్తే సరి. అద్దె నిక్కచ్చిగా వస్తుంది. ఇల్లూ కనిపెట్టుకు చూస్తారు. నథింగ్ టు వర్రీ అనుకుంది.

"మీ పరిచయం హౌసింగ్‌కే పరిమితమా లేకహౌస్‌కి కూడానా'' నవ్వుతూ అంది సరిత ఎవ్వరూ లేకుండా చూసి.

"అలాంటిదేం లేదు. అతడి అభిప్రాయమూ తెలీదు''

"ఇంకా తెలిసేదేమిటి. మిమ్మల్ని తలమున్కలుగా ప్రేమిస్తున్నాడు. మీరు కంటబ

దేసరికి అతడి కళ్లల్లో మెరిసిన మెరుపుల్ని గమనించాల్లెండి''

"ఒకవేళ... అయితే ఎలా వుంటుందంటావు?"

"గుడ్ సెలక్షన్. ఈడూ జోడూ బా గుంటుంది..."

"అతడికి నామీద గౌరవాభిమానాలున్నా యనుకో..."

"ఇంకేం ఆలోచించకుండా మీ పెద్దవారికి చెప్పండి. మిగతా వివరాలు సేకరించి మిగ తా ముగ్గులు పెట్టేస్తారు''

"మనకి నచ్చటం ముఖ్యం మనస్సులు కలవటం ముఖ్యంగాని పెద్దవాళ్ళేంచేస్తారు సరితా. ఇన్నాళ్ళూ నిజం చెప్పలేదుగాని మా అన్నయ్యలంత స్వార్ధపరులెక్కడా వుండ రు. ఎంతసేపూ వాళ్ళ గోలే తప్ప నా అతీ గతీ పట్టించుకున్న పాపాన పోలేదెన్నడూ. లేకపోతే ఇన్నేళ్ళు అవివాహితగా ఎందు కుంటాను. ఎప్పుడో పెళ్ళిచేసుకుని మీలాగే పిల్లా పాపల్తో సుఖంగా వుందును'' నిట్టూరు స్తూ అంది.

"అయినా పెద్దవాళ్ళున్నప్పుడు వాళ్ళకి చెప్పడం మన ధర్మం కదా''

"చెబితే పెళ్ళి ఖర్చు మీద పడుతుందని ముందే దూరంగా జరిగిపోతారు''

"కావొచ్చు. కానీ పెళ్లంటే కట్నాలూ, ఖర్చులే కాదు కదా. రెండు జీవితాల్ని ముడివేసే బంధం. నూరేళ్లపంట. అందుకే అటు ఏడుతరాలూ, ఇటు ఏడుతరాలూ చూడా లంటారు. జీన్స్‌ద్వారా చాలా చాలా సంక్ర మిస్తాయని తెలిశాక మన పూర్వుల దూరదృ ష్టిని శాస్త్రవేత్తలే మెచ్చుకుంటున్నారు. అంచేత మిగతా విషయాలమాటెలా వున్నా మంచి చెడ్డలు విచారించడానికైనా పెద్ద ఉండకపోతే ఎలా?"

"అదంతా ట్రాష్. నాకు వాటిల్లో నమ్మ కంలేదు. మనక్కావాల్సింది భవిష్యత్తుగాని గతంకాదు''

"గతపు పునాది మీదే కదా భవిష్యత్ సౌధం నిలబడేది''

"ఆ కబుర్లమీద నాకు విశ్వాసం లేదు. నా నమ్మకమంతా మనిషిమీదే. మనిషి విజ్ఞత మీదే''

"అఫ్ కోర్స్. విష్యూ గుడ్ లక్''

"బావుంది. ఆలీ లేదు చూలూలేదు. కొ డుకు పేరేదో అన్నట్టు..."

"అబ్బాయి ప్రేమవుంది. మరింకెందుకా లస్యం?"

"గడుసు దానివేనే'' నవ్వేసింది హర్ష.



డిసెంబరు 31 అర్ధరాత్రి.

టీవీలో వస్తోన్న స్పెషల్ ప్రోగ్రాం చూ స్తోంది హర్ష.

ఆమెకి చాలా ఆనందంగా వుంది.

కొత్త సంవత్సరం క్రొంగొత్త శుభాల్ని కానుకగా ఇస్తుందని ఆశగా వుంది. ఆరా టంగా వుంది. ఒంటిగా గడిపే డిసెంబరు 31 ఇవాళ్టితో సరి అనుకుంటోంది.

అందుకే కొత్తనైటీ తొడుక్కుంది. స్పెషల్ స్వీట్ తయారుచేసుకుంది.

వచ్చే ఏడాది జంటగా గడిపే నూతన సంవత్సర శుభవేళని తలచుకుంటూ ఖైమ రుస్తోంది. పులకింతలకౌగిళ్లలో నలిగిపో తోంది.

సరిగ్గా పన్నెండు గంటలయ్యింది.

టీవీలో బాణాసంచా పేలుళ్ల మధ్య ఫ్లాష్ గా నూతన సంవత్సర శుభాకాంక్షలు చెబుతున్నారు.

తలుపు చప్పుడైంది.

ఇందిర కాబోలనుకునెళ్ళి తలుపు తీసింది.

ఓ పెద్ద పుష్పగుచ్ఛాన్ని ఆమెకందిస్తూ "విష్యూ హేపీ హేపీ హేపీ న్యూ ఇయర్'' అన్నాడు శ్రీను.

ఊహించని ఘటనకి ఉక్కిరిబిక్కిరై పోయి తిరిగి విష్ చెయ్యడంకూడా మర్చిపోయింది.

ఒంటరిగా వుంటోన్నందున నిస్సంకోచంగా ధరించిన నైటీ పలుచగా వుందని గ్రహించి సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది. పుష్పగుచ్ఛాన్ని వక్షానికి ఆచ్ఛాదనగా ఉపయోగించింది.

అతడదేమీ పట్టించుకోలేదు. తను తెచ్చిన పాకెట్ని గబగబా విప్పి కేక్ని బయటికి తీశాడు. ఒక కొవ్వొత్తి గుచ్చి వెలిగించాడు.

"కమాన్. కొత్త వత్సరానికి స్వాగతం పలకండి''

హంసలా నడిచొచ్చి కేక్ కట్చేసింది. మొదటి ముక్కని అతడి నోటికందించింది. అతడు మరోముక్కని ఆమె నోట్లో పెట్టాడు.

"కొత్త సంవత్సరానికే కాదు నూతన ప్రేమమయ జీవితానిక్కూడా స్వాగతం సుస్వాగతం" అంటూ హఠాత్తుగా ఆమెచేతి మీద ముద్దుపెట్టుకున్నాడు.

ఆమె తనువు పులకించగా తన్మయంగా కళ్ళు మూసుకుంది.

బయట స్కూటర్ స్టార్ట్ అయిన శబ్దం విన్పించింది.

స్వప్నలోకంనుంచి మేల్కొన్నట్టుగా వెళ్ళి గుమ్మంలోంచి చూసింది.

శ్రీను చీకట్లో అదృశ్యమయ్యాడు.

తలుపులేసేసి పుష్పగుచ్ఛాన్ని మంచంమీదికి విసిరేసి మయూరిలా నర్తించింది హర్ష.

అది మామూలు నాట్యంకాదు. కారుమబ్బుల్ని చూసి నెమలి చేసిన ఆనంద తాండవం!

★ ★ ★

ఐస్క్రీం పార్లర్లోకెళ్ళి కూర్చుంది హర్ష.

వెయిటర్ రాగానే "ఒక స్ట్రా బెర్రీ ఐస్క్రీం" అని చెప్పింది.

"ఒకటి కాదు రెండు'' అంటూ వచ్చి కూర్చున్నాడు శ్రీను.

"ఓ మీరా. వాటె సర్ప్రియిజ్..."

"మీరే నల్లపూస అయిపోయారు''

"నేనేం నల్లపూసని కాదు ఎర్రపూసనే''

"తప్పైపోయింది'' లెంపలేసుకున్నాడు.

ముత్యాలొలకబోసినట్టు నవ్వింది.

"మీ నవ్వు మోనాలిసా మందహాసంలా నమ్మోహనంగా వుంటుంది. మనస్సులోని మాట ముఖంమీద చెప్పడం నా అలవాటు''

"పొగడ్తలొద్దుగాని ఐస్క్రీం వచ్చింది తినండి''

"ఆడపిల్లా ఐస్క్రీం ఒకేరకమట"

"ఎందుకని?"

"పెదాలు తాకీ తాకగానే కరిగిపోతాయిట"

"స్వానుభవమా?"

"హతోస్మి! టకారప్రయోగం చేసినా నా మీద ఇంతటి అభాండం వేస్తారా. నేను అస్ఖలిత బ్రహ్మచారినండి బాబూ''

"కాదనెవరన్నార్ట?"

"హమ్మో, మాటల్తో మిమ్మల్ని గెలవలేం"

"అయితే ఓడిపొండి''





"ఓడిపోవడమేమిటి మీముందు సాగిలపడిపోయాను గాని ఇక వదిలెయ్యండి''

"అలా దారికి రండి''

ఎప్పుడూ మీదారిలోనే వున్నాను మేడం"

"సంతోషించాంగాని ఐస్‌క్రీం తిననివ్వండి. ఐస్‌క్రీం నాకెంతో ఇష్టం. ఐస్‌క్రీం కన్పిస్తే చాలు చిన్నపిల్లనైపోతాను''

"అరె. నిజం? నాకూ ఎంతో ఇష్టమండీ''

"బావుంది. వచ్చేవారం వూరికెళ్తున్నాను. ఒక పదిరోజులదాకా కన్పించను''

"అయితే చాలా మిస్సవుతానన్నమాట. నేనూ ఏదో ప్రోగ్రాం వేసుకోవాలైతే. మీ అన్నయ్యగారింటికా? ఏమైనా విశేషమా?"

"వూరికే... నే వెళ్లేలోగా మీ ఇంటికోసారి రావాలనుకుంటున్నాను. ఎప్పుడు రమ్మంటారు?"

"మాది ఇల్లు కాదు బ్రహ్మచారి గది. పైగా మా ఇంట కూర్చుండ మీకు కుర్చీలు లేవు..."

"ఏవిటి? కుర్చీయేలేదా?"

"వుంది''

"మరిలేదంటారేం? నేను రావటం ఇష్టంలేదా?" బుంగమూతి పెట్టింది.

"ఎంతమాట! కూర్చుండ మా ఇంటి కురిసీలు లేవు. అంటూ పద్యం రాసిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారింటికి కొందరు విద్యార్థులు వెళ్లేర్ట. వారు కూర్చోవడానికి కుర్చీలు వెయ్యగా 'కుర్చీలు లేవన్నారుగా మాస్టారూ' అనడిగార్ట. 'మీరొస్తే కుర్చీలు లేవని కాదు భగవంతుడొస్తే లేవని నా భావం' అన్నార్టాయన. అలాగే మిగతావాళ్ళొస్తే కుర్చీలున్నాయి. కాని నాదేవతవస్తే ఆమె కూర్చోదగిన ఆసనం లేదన్నది నా తాత్పర్యం"

ఆమె మురిసిపోయింది. అతడి ఆరాధనకి కరిగిపోయింది.

మరి మాటలు దొర్లలేదు.

★ ★ ★

బస్సుమీద పాకేజీటూర్లో దక్షిణదేశయాత్రకి బయల్దేరింది హర్ష.

అనుకోని ఈ ప్రయాణానికి యల్టీసీ బ్లాక్ ముగిసిపోతూండటం చిన్నకారణం. భద్రాచలంకూడా టూర్లో వుండటం పెద్దకారణం.

భద్రాచలం వెళ్లొచ్చాకే తన కడుపు పండిందని హర్షతల్లి ఎప్పుడూ అంటూండేది. నాలుగేళ్ల క్రితం ఆమె చనిపోయే ముందు భద్రాచలం వెళ్ళిరమ్మనీ కళ్యాణ ఘడియ నడిచొస్తుందనీ శతపోరింది. కాని తనామాటల్ని సీరియస్‌గా తీసుకోలేదు. తల్లీ ఆ తర్వాత తండ్రీ మరణించేక అన్నలు తన పెళ్లిగురించి అస్సలు పట్టించుకోవడం మానేశాక ఓసారి భద్రాచలం వెళ్లొస్తే బావుణ్ణనుకుంది.

ఇంతలో ప్రమోషన్ రావడం ఆ వెంబడి ట్రాన్స్‌ఫర్ రావడంతో ఎప్పటికప్పుడు ప్రయాణం వాయిదా పడుతూ వచ్చింది.

అనుకోకుండా శ్రీనుతో స్నేహం పెరిగింది. అది ప్రేమగా పరిణతి చెందింది. భద్రాచలం వెళ్ళి సీతారాముల్ని దర్శించివస్తే తమకి పెళ్లవుతుందని బలంగా అన్పించసాగింది. అందుకే టూర్‌కి టిక్కెట్ బుక్ చేసుకొంది.

కానీ సంగతి శ్రీనుకి చెప్పలేకపోయింది. ఏదో సంకోచం, మరేదో బిడియం, ఇంకేదో పిరికితనం ఆమె నోరు నొక్కేశాయి. అందుకని అన్నగారింటికెళ్తున్నానని అబద్ధమాడింది.

తీరా ప్రయాణమయ్యాక నిజం దాచి తప్పుచేశానన్పించి దిగులుపడింది. చెప్పి వుంటే అతడూ వచ్చేవాడేమో. ఒకరికొకరం మరింత అర్థమై మరింత దగ్గరయ్యే వాళ్ళమేమో అన్న భావం ఆమె మనస్సుని తొలిచెయ్యసాగింది.

టూర్ గురించి రామలింగయ్య దంపతులకి చెప్పి బయల్దేరింది హర్ష.



"మగతోడు లేకుండా వెళ్తున్నావా?!" ఆశ్చర్యపడింది కామేశ్వరి.

"నేనేమైనా చిన్నపిల్లనా పిన్నిగారూ''

"చిన్నపిల్లవి కాదుగనుకే జాగ్రత్తగా వుండాలి. అసలే పదిరోజుల యాత్రలంటు న్నావు. తెలిసిన వాళ్ళెవరైనా వస్తున్నారా లేదా?"

ఆమె అర్థంలేని ఆందోళనకి చిర్రెత్తుకొచ్చింది హర్షకి. "నా ఫ్రండ్స్ కూడా వస్తున్నార్లెండి''

"అయితే ఫర్లేదు. ఒకరికొకరు తోడుగా వుంటారు. జాగ్రత్తమ్మా. అసలే మాయదారి కాలం. ఆడదంటే అందరికీ లోకువే. తలెత్తి చూసినా తప్పే. నవ్వినా తప్పే. ఆడదానిగా పుట్టేకన్నా అడవిలో మానైపుట్టడం నయం!"

"అమ్మాయి సరదాపడి పుణ్యక్షేత్రాలు దర్శించి రావడానికెళ్తోంటే మధ్యన నీ మంత్రాలేవిటే..." రామలింగయ్యగారు అందుకున్నారు.

"వయసొచ్చిన పిల్లా పొంగిన వాగూ ఒకటేనన్నారు. ఎప్పుడెలా మారుతుందో ఎవరికి తెలుసు! మీరు బస్సుదాకా వెళ్ళి జాగ్రత్తగా చూస్తూండమని ఎవరికైనా అప్పగించి రాకూడదూ''

ఇబ్బందిగా చూస్తూ అన్నారు. "రమ్మంటావా అమ్మాయ్. తెలిసినవాళ్ళు వుండకపోరు''

"పిన్నిగారిదంతా చాదస్తంగాని నాకేం ఫర్లేదు బాబాయిగారూ. నన్ను నేను రక్షించుకోగలను. జాగ్రత్తగా వెళ్ళివస్తానుగా. బై బై..."

"జాగ్రత్తమ్మాయ్. కనకదుర్గమ్మ తల్లికి మా ఇందిర గురించి కూడా చెప్పి మా తరఫున వేడుకోమ్మా''

"అలాగే పిన్నిగారూ'' ఆటో ఎక్కుతూ జవాబిచ్చింది.

మరేవనుకుందో ఆగమని చెప్పి గబగబా ఇంట్లోకెళ్ళి అరడజను ఆపిల్స్ ప్లాస్టిక్ సంచిలో వేసి తీసుకొచ్చిచ్చింది.

"త్వరగా మెడ నిండాలని ఆపైన ఒడి నిండాలని అందరి దేవుళ్లకీ సిగ్గుపడకుండా మొక్కుకో అమ్మాయ్''

ఆమె ఆప్యాయతకి కళ్లు చెమ్మగిల్లగా "అలాగే పిన్నిగారూ'' అంది.

ఆటో కదిలింది.

హర్ష వెళ్ళేసరికి చాలామంది వచ్చేశారు. తన సామాన్లు భద్రంగా సర్దుకుని తన సీట్లో కూర్చుంది.

అన్ని సీట్లూ నిండిపోయాయి తన పక్క సీటు తప్ప.

ఆమెకి కంగారుగా అన్పించింది. టూర్‌ని నిర్వహిస్తోన్న పిచ్చయ్యని పిలిచి "ఈ పక్క సీటు మగాళ్ళకివ్వలేదుకదా?" అనడిగింది.

బుర్రగోక్కుని కాగితాలు తిరగేశాడుగాని ఏమీ తెలీలేదు.

"మగాళ్ళైతే మాత్రం వాళ్లనింకోచోట ఎడ్జస్టుచేసి ఇక్కడ ఆడవాళ్లనే కూర్చోబెట్టు తెల్సిందా?"

"పెళ్ళికాని ఆడపిల్ల పక్కన మగాయన్నెలా కూర్చోబెడతావూ!" మరొకావిడ అంది.

ఏదో గొణుక్కుంటూ వెళ్ళాడు పిచ్చయ్య.

"బస్సు ఎనిమిదిగంటలకి బయల్దేరుతుందన్నావు. అప్పుడే పదయ్యింది. ఇంకెప్పుడు బయల్దేరుతుందయ్యా'' ఒకాయన నిలదీశాడు.

"ఇంకో టిక్కెట్టు రావాలి. అదొచ్చేస్తే బయల్దేరిపోవచ్చు'' బయటికి చూస్తూ జవాబిచ్చాడు.

హర్ష బుర్రలో ఓ ఆలోచన పుట్టింది.

ఆ రావాల్సినవారు రాకుండా వారి బదులు శ్రీను వస్తే?

ఈ టూర్ పదిరోజులూ అతడ్తో ఎంతో సన్నిహితంగా మెలిగే అవకాశం దక్కేది. ఒకరికొకరు బాగా అర్థమవడమేగాక మనస్సు విప్పి

మాట్లాడుకునేవారు. ఒకరిగురించొకరికి, ఒకరి అభిరుచుల గురించి, అభిప్రాయాల గురించి మరొకరికి బాగా తెలిసేది. హనీ మూన్ ట్రిప్‌కి రిహార్సల్‌లా వుండేది.

ప్చ్! ఇదంతా తనవల్లే 'ఉఫ్' మని ఊదేసినట్టు అయిపోయింది. తను కాస్త చొరవ కనబరిచి అతడికంతా చెప్పి అతడ్ని రమ్మని కోరివుంటే ఇంకేం ఆలోచించకుండా వచ్చేసేవాడు.

ఇప్పుడేం చెయ్యడం? పోనీ ఆ టిక్కెట్టు కేన్సిలయినా బావుణ్ణు. ఆటోమీదెళ్ళి శ్రీనుని లాక్కొచ్చేది. కాని... అతడి రూమెక్కడో తెలీదే! శ్రీరామపురంలో వుంటున్నాడని తెలుసుగాని కరెక్ట్ లొకేషన్ తెలీదు కూడానూ!

ఒకపక్క ఆశ. మరోపక్క నిరాశ.

ద్వైదీభావంతో నలిగిపోతూ దిక్కులు చూస్తోంది. తథాస్తు దేవతలామె కోరికను మన్నించినట్టుగా ప్రత్యక్షమయ్యాడు శ్రీను!

"రండి రండి మీకోసమే చూస్తున్నాం" తొందరపెట్టాడు పిచ్చయ్య.

"వావ్!" చిన్నపిల్లలా కేరింతలు కొట్టింది హర్ష.

"భలే చిత్రంగా వుందే. ఒకరికి తెలీకుండా ఒకరం ఒకే యాత్రకెళ్ళడానికి ఒకే బస్సెక్కామన్నమాట. వండరాఫ్ ద వండర్స్!" అన్నాడు శ్రీను ఆమెని చూసి అమితాశ్చర్యపోతూ.

"మీ సీట్లోకెళ్ళి కూర్చోండి బస్సు బయల్దేరుతోంది" అన్నాడు పిచ్చయ్య.

"నా పక్కన తప్ప ఎక్కడా సీటు లేదే" హర్ష అంది.

"అయితే మీ పక్కనే నా సీటు రాసిపెట్టాడన్నమాట దేవుడు" అంటూ వచ్చి కూర్చున్నాడు.

"ఆ అమ్మాయి పక్కన నువ్వు కూర్చున్నావేమిటబ్బాయ్. నువ్వు వెనక్కెళ్ళి ఎవరైనా ఆడవాళ్ళని కూర్చోమను" ఒకామె అంది.

"ఫరవాలేదండీ. మాకు కావాల్సినతనే" అంది హర్ష.

ఎన్నో నోళ్ళూ కళ్ళూ చిత్రంగా చూశాయి. కొన్ని నుదుర్లు ముడివడ్డాయి.

"మీ అన్నయ్య దగ్గరికెళ్తానన్నారు"

"సారీ. నిజం చెప్పలేకపోయాను. ఎందుకో సంకోచం ఫీలయ్యాను" సిన్సియర్‌గా అంది హర్ష.

"మీరెలాగూ వూళ్ళో వుండనన్నారుకదాని నేనీ ప్రయాణం పెట్టుకున్నాను"

"నేను లేకపోతే వూళ్ళో వుండకూడదా?"

"మీరుంటే పౌర్ణమి. లేకపోతే అమావాస్య"

ఆ సమాధానం ఆమె గుండెల్లో గిలిగింతలు పెట్టింది. మనస్సు తీయని రాగాల్ని ఆలాపించింది.

బయటి దృశ్యాల్ని చూస్తూ మౌనంగా వుండిపోయింది.

ఉన్నట్టుండి శ్రీను నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఆ కళ్యాణమంటపం ముందు ఏమని రాశారో చూశారా? రమ వెడ్స్ సత్యం"

"అంతా అలాగే రాస్తారుకదా. సత్యం వెడ్స్ రమ అని రాయాలంటారా? ఆడపెళ్లివారింట పెళ్లి జరుగుతుంది గనుక అలా రాస్తూంటారనుకుంటా"

"అలా రాయకూడదంటాను"

"మరెలా రాయాలి?"

"రమా బైస్ సత్యం"

అమితాశ్చర్యంగా చూసింది. ఆ పిమ్మట అతడి చేయి తన చేతిలోకి తీసుకుని చిన్నగా నొక్కి అభినందన పూర్వకంగా నవ్వింది.

విజయవాడ వెళ్లారు.

కృష్ణలో స్నానంచేసి కనకదుర్గని దర్శించారంతా.

హర్షా శ్రీనూ పక్కపక్కన నిలబడి నమ

స్కరించారు.

అమ్మవారి మోములో ఎంతో ఆప్యాయతా మరెంతో అనురాగం కనిపించాయి. ముఖ్యంగా ఆమె నేత్రాలు చల్లగా వెన్నెల్ని కురిపిస్తున్నట్టుగా వున్నాయి. ఎంతో ఆత్మీయభావం కలిగింది. కన్నతల్లి గుర్తొచ్చింది. కళ్లల్లో సన్నని కన్నీటిపొర కదిలింది.

"నా కోరిక నెరవేరేట్టు దీవించు తల్లీ. శ్రీను నాకు దక్కేలా చూడు. ఇంతకంటే మరే వరమూ కోరుకోను అమ్మా" ప్రార్థించింది హర్ష.

"అమ్మా! నువ్వు కోరినట్టే భద్రాచలం వెళ్తున్నాను. తిరిగొచ్చేసరికి పెళ్లి కుదిరేలా ఆశీర్వదించమ్మా" అని తల్లిని మనస్సులోనే అర్థించిందామె.

ఇద్దరూ కొండమీద ఓ పక్కగా కూర్చుని కొబ్బరిచిప్ప కొట్టుకుని తినసాగారు.

"మీరేం కోరుకున్నారు?" శ్రీను అడిగాడు.

ఒక్క నిమిషం ఆలోచించింది. మనస్సులోని మాట బయటపెట్టడానికి దుర్గమ్మ తల్లి సన్నిధి మించినది లేదన్పించింది.

"ఆ జన్మాంతం మీ సాహచర్యం లభించాలని"

"థాంక్స్. వచ్చే నెలలో అంతర్వేది నరసింహస్వామి కళ్యాణం అయిపోతుంది. ఆ వెంటనే మన కళ్యాణం అయిపోవాలని కోరుకున్నాను"

ఆమె మోము రాగరంజితమైంది. సిగ్గుల గులాబీలు మొలవగా ఎరుపెక్కింది. కనురెప్పలు బరువుగా వాలిపోయాయి. మనస్సులో మల్లెలమాలలూగాయి. గుండెల్లో కోటివీణల రాగాలాపనలు మోగాయి.

కాస్సేపయ్యాక అంది "నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నానని చెప్పలేదే"

"ప్రేమకి లిపిలేదుకదా చెప్పడానికి"

"అదేవిటి?"

"ఐలవ్యూ అంటూంటారు కొందరు. నిజానికి వాళ్ళు-ప్రేమించట్లేదన్నమాట"

"కొత్త సిద్ధాంతమా?"

"వినండి మరి. ప్రేమకి భావం తప్ప భాషలేదు. భావ వ్యక్తీకరణకి నోటితో పనిలేదు. కళ్లతో, చూపుల్తో, బుగ్గలతో, పెదాలతో, మందహాసంతో, ముఖంలో కదలాడే భావనలతో శరీరంలోని అణువణువుతోనూ వ్యక్తీకరించబడేదే ప్రేమ. గుండె వూసులు వినడానికి ప్రేమ గుండె కావాలిగాని చెవులు అవసరంలేదు. మీరెన్నోసార్లు ఎన్నో రకాలుగా మీ ప్రేమని వ్యక్తీకరించారు. దాన్ని నా మనస్సు రిసీవు చేసుకుని, రికార్డు చేసుకుని అన్నిసార్లూ ప్రతిస్పందించింది. ఆ సంకేతాలు మీకు అందలేదూ? నిజం చెప్పండి?"

తలాడించింది.

ఆమె భుజంమీద చెయ్యివేసి దగ్గరికి అదుముకున్నాడు. అతడి ఒళ్లో వాలిపోయిందామె.

"నేను చాలా అదృష్టవంతుణ్ణి. బహుశా భూమ్మీద నా అంత అదృష్టశాలి లేడనుకుంటాను"

"ఏం పాపం?"

"స్వప్నాల్లోంచి నా ప్రేయసి ఇలా తిన్నగా నడిచిరావడం అదృష్టం మహాభాగ్యం అనిగాక ఇంకేమనాలి?"

"నా పరిస్థితీ అలాగే వుంది. నీ పరిచయ భాగ్యం కలిగించడానికే నన్నీవూరికి ట్రాన్స్‌ఫర్ చేసివుంటారు. ఇన్నాళ్లూ పెళ్లి కాలేదే అని ఇదయ్యేదాన్ని. నీతో రాసిపెట్టి వుంటే వేరేవాళ్ళతో ఎలా అవుతుంది? అందుకే పెళ్లిళ్లు స్వర్గంలో నిర్ణయించబడతాయంటారు"

"అవునవును. పెళ్ళిళ్లు స్వర్గంలో చేస్తారు. కాపురాలు నరకంలో చేస్తారు"

"అదేవిటి శ్రీనూ- అవేం మాటలు?" కళవళపడింది.

"పిచ్చి హర్షా చాలామంది విషయంలో




# ఏరిన ముత్యాలు

★ అనుభవంలోగానీ కొన్ని సత్యాలు అర్థంకావు.

–స్టీవెన్ సన్

★ ఒక నేరం మరో నేరానికి దారితీస్తుంది.

–బర్క్

★ నేరానికి అనుగుణంగా శిక్ష వుండాలి.

–సిసిరో

★ రాజకీయాలతోనే ప్రజలను సంతోషపెట్టాలి అనుకోవడం దురాశ.

–కార్లయిల్

★ మంచికే విజయం లభిస్తుంది అనుకోవడం భ్రమ.

–ఐజాక్ సింగర్

★ విజయం అప్పుడప్పుడూ తన స్థానాన్ని మార్చుకుంటూ వుంటుంది.

–హోమర్

★ నిందరాకుండా వుండాలంటే నడవడిక మార్చుకోక తప్పదు.

–డెమోస్టెనెస్

★ తప్పులకన్నా అసంబద్ధమైన నిజాలే ఎక్కువ హానిచేస్తాయి.

–థామస్ హన్స్లీ

★ ప్రజాస్వామ్య యంత్రాంగంలో నడిచే నియంతృత్వం ఎంతో ప్రమాదకరం.

–జూలియస్

★ విద్వేషం బలంగా వున్నప్పుడు విజ్ఞత బలహీనంగా వుంటుంది.

–శాస్త్రసూక్తి

★ కార్యహాని కలిగించే శక్తులలో ఆలస్యానిది అగ్రస్థానం.

–జాన్ ఫాస్టర్

★ నిజాయితీ అంటే తన అంతరాత్మకు విరుద్ధంగా చేయకుండుటయే.

–హోం

★ అదృష్టం కలిసి రావాలంటే సాహసం బాటగా, అవకాశం నీడగా వుండాలి.

–ఓ. హెన్రీ

★ చేసిన అప్పుతీర్చకుండా మళ్లీమళ్లీ చేసేవాడు మూర్ఖుడు.

–సిసిరో

-సేకరణ : కొత్రగడ్డ వెంకట్రావు




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు నకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

డిసెంబర్ చతుర నవల 'సీతనడిచిన భూమి'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా ..............................

..............................

..............................

ఇలా జరుగుతూంటుంది. మన విషయంలో మాత్రం పెళ్లీ కాపురం, స్వప్నం స్వర్గం అన్నీ భూమ్మీదే జరుగుతాయి''

"హమ్మయ్య. ఒక్కక్షణంపాటు ఎంతగా భయపడిపోయానో!" గుండెలమీద చేయివేసుకుంటూ అంది.

"ఏం? నామీద నమ్మకంలేదా? లేదంటే చెప్పు. ఇప్పుడే ఈ కొండమీంచి దూకేస్తాను'' లేవబోతూ అన్నాడు.

"అంత సాహసం చెయ్యొద్దులేగాని నీమీద కొండంత నమ్మకం వుంది. చాలా?"

"మనిషిమీద మనిషికుండాల్సినవి నమ్మకం, అభిమానం, గౌరవం, ప్రేమ, మమకారం. అవి మాత్రమే ఇద్దర్ని శాశ్వతంగా కలిపి వుంచగల్గుతాయి. తాళి కట్టినంతమాత్రాన అవన్నీ రావు. తాళి కట్టనంత మాత్రాన అవన్నీ పోవు. ఆ రకంగా చెప్పాలంటే మన పెళ్లి అమ్మవారి సన్నిధిలో అయిపోయినట్టే''

"నాకూ అలాగే అన్పిస్తోంది. ఇంకొక్కసారి ఇద్దరం కలిసి అమ్మవారి దర్శనం చేసుకుందాం పద"

"పిచ్చయ్య గొడవ పెడతాడేమో?"

"రష్‌గా వుంటే దూరాన్నుంచే దర్శించివద్దాం"

మళ్ళీ వెళ్ళి దర్శించారు. అమ్మవారి ఎదుట అమ్మవారి కుంకుమతో ఆమె నుదుట బొట్టు పెట్టాడు శ్రీను.

పులకించిపోయింది హర్ష.

ఆనందబాష్పాలు జలజల రాలిపోయాయి ఆమె కన్నులవెంట!

★ ★ ★

హర్ష, శ్రీనూ మరింత సన్నిహితంగా వుండటం, ఒకరిమీదొకరు పడటం, పగలబడి నవ్వుకోడం చూసి టూరిస్టు బస్సులోని జనం ఆశ్చర్యచకితులయ్యారు. రెండ్రోజుల యాత్రకే ఇంత దగ్గరెలా అయిపోయారో ఎవరికీ అర్థం కాలేదు.

ఆడవారి మూతి విరుపుల్నీ, మగవారి చూపుల బాణాల్నీ ఎదుర్కోలేక కాస్త ఎడంగా వుండాలని చూసింది హర్ష. కాని దాన్ని సాధ్యం కానీయలేదు శ్రీను. 'నవ్విపోదురుగాక మనకేటి సిగ్గు' అనేశాడు.

వారి ప్రవర్తన శృతిమించిపోతోందన్పించి కాబోలు ఒకతను శ్రీనుని పక్కకి తీసుకెళ్లి క్లాసు తీసుకున్నాడు.

"పెళ్లి కావాల్సిన పిల్ల. పుణ్యక్షేత్ర దర్శనార్థమై వెళ్తోంది. ఆమె వెంటబడటం, అల్లరిపెట్టడం భావ్యంకాదు. చదువుకున్నవాడివి. నీకంతగా చెప్పాలా చెప్పు?"

"క్షమించాలి మావయ్యగారూ. మీరు అపార్థం చేసుకున్నారని చెప్పడానికి చింతిస్తున్నాను. మేం కాబోయే భార్యాభర్తలం. మాది పెద్దలు కుదిర్చిన పెళ్లి. దగ్గరి బంధుత్వం కూడానూ. పెళ్లికిముందు కొన్ని మొక్కులు తీర్చాల్సివుండటంతో అవన్నీ తీర్చుకురమ్మని మమ్మల్ని మా పెద్దవాళ్లు పంపితే వెళ్తున్నాం. వచ్చే నెలలోనే మా పెళ్లి. మిమ్మల్నందర్నీ పేరుపేరునా ఆహ్వానించాలనుకుంటున్నాం"

శ్రీను మాటలకి నోరు వెళ్ళబెట్టేశాడతడు.

అది చెప్పుకుని పడీపడీ నవ్వుకున్నారు శ్రీనూ హర్షా.

ఆ ఉత్తర క్షణాన్నుంచి మరింత స్వేచ్ఛగా మరింత నిస్సంకోచంగా చెట్టా పట్టాలేసుకుని తిరగసాగారు.

సహప్రయాణీకులు కొందరు బుగ్గలు నొక్కుకున్నారు. కొందరు 'మా కాలంలో ఇలాంటి విడ్డూరాలు ఎరగవమ్మా' అన్నారు. ఇంకొందరు చిత్రంగానూ, మరికొందరు ఈర్ష్యగానూ చూశారు. 'వచ్చేనెలలో పెళ్లంటలే' అని సమర్థించినవారూ వున్నారు. అతికొద్దిమంది మాత్రం వాళ్లని సినిమా హీరో హీరోయిన్లలా చూస్తూ మధ్య మధ్య హుషారైన కామెంట్లు విసుర్తున్నారు.

ఏమైతేనేం భద్రాచలం వెళ్ళేసరికి ఇద్దరూ బాగా చేరువయ్యారు. పెళ్లి జరిగిపోయినట్టు గానే వుంది ఇద్దరికీ!

హర్షకి చాలా థ్రిల్లింగ్‌గా పట్టరానంత ఆనందంగా వుంది.

పెళ్లవుతుందో లేదో అయితే గియితే జుట్టు నెరిశాక అవుతుందేమోనని బెంగపెట్టు కుందిన్నాళ్లూ. అలాటిది శ్రీనులాంటి అరుదైన, చురుకైన యువకుడు భర్తగా లభించబోతున్నాడు. సినిమాల్లో జరిగినట్టు జరుగుతున్నాయన్నీ. ప్రేమ, విరహం విచిత్రానుభూతులు అన్నీ అనుభవంలోకొచ్చాయి. ఇలాటి అదృష్టం అతికొద్దిమందిని మాత్రమే వరిస్తుందని పొంగిపోతోంది. తననితాను సినిమా హీరోయిన్‌గా భావించుకుని మురిసిపోతోంది.

"భద్రాచలం చూడాలి చూడాలి అని ఎన్నేళ్లనుంచి తపించాను. ఇప్పటికి తీరిందా కోరిక" బస్సుదిగి చుట్టూ తన్మయంగా చూస్తూ అంది హర్ష.

"భగవంతుడు ఏ అవతారంలోనూ భరించనన్ని కష్టాలు రామావతారంలో అనుభవించాడు. అలాటి రాముడిమీద నీ ఆరాధన చూస్తోంటే చాలా ఆశ్చర్యంగా వుంది''

"రాముడు ధర్మానికి ప్రతీక. ఆయన ధర్మాన్ని ఉపదేశించలేదు. ఆచరించి చూపాడు. అందుకే ఆదర్శపురుషుడయ్యాడు. అలాంటి రాముణ్ణి ఆరాధించని వారెవరుంటారు శ్రీనూ? రాముడికోసం సర్వస్వాన్నీ తన సొమ్మునే కాదు ప్రభుత్వ సొమ్మును కూడా అర్పించిన కంచర్లగోపన్న కథ ఇక్కడే జరిగింది తెలుసా?"

"ఇది కూడా వినండి. ఇంతవరకూ కొండల్లో కోనల్లో బండరాళ్ల మధ్య ఒరుసుకుంటూ ప్రవహిస్తోంది నా జీవనవాహిని. దానిని నేలమీదకి మళ్లించి ఒక నిలకడని, ఒక సంపూర్ణత్వాన్ని, ఒక అమరత్వాన్ని కల్పించిందో దేవత. తన ప్రేమామృతధారల్లో నన్నభిషేకించి పునీతం చేయబోతోంది. ఆమె ఋణం జన్మజన్మలకీ తీర్చుకోలేను. అందుకే చంద్రునికో నూలుపోగులా ఆమె పేరిట అభిషేకం చేయించాలి. సహస్రనామార్చన చేయించాలి..."

శ్రీను మాటలకి చలించిపోయిందామె.

"యూ ఆర్ రియల్లీ గ్రేట్ శ్రీనూ. నీలాంటి అమృతభాండం లభించడం నా అదృష్టం. ఐ లవ్యూ... ఐ లవ్యూ సోమచ్..." అంటూ అతణ్ని వాటేసుకుని ఏడ్చేసింది హర్ష.

"యూ సిల్లీగాళ్. ఏమిటిది? వూరుకో. అంతా చూస్తున్నారు. ప్లీజ్..."

ఎడంగా జరిగి కళ్లు తుడుచుకుంది.

"పద" అన్నాడు భుజంమీద చేయివేసి.

"నీతో కలిసి ఏడుకాదు, ఏడువేల అడుగులు వేస్తున్నాను. పుణ్యక్షేత్రాలు దర్శిస్తూ ముక్కోటి దేవతల ఆశీస్సులందుకుంటున్నాను. నిజంగా ఇది పూర్వజన్మ సుకృతమే''

హర్ష మాటలకి శ్రీను అన్నాడు, "నూటికి నూరుపాళ్లూ నిజం. కాదంటే నువ్వు పైకి చెబుతున్నావు. నేను లోపల చెప్పుకుంటున్నాను. అంతే తేడా''

గబుక్కున అతడి తలవంచి పెదాలమీద ముద్దు పెట్టుకుంది.

"అమ్మో! సీతారాములు సిగ్గుపడతారు''

కిలకిలా నవ్వేసింది. అంతా తలలు తిప్పి చూశారు.

సిగ్గుపడ్డారిద్దరూ.

పవిత్రగోదావరిలో స్నానం చేశారు. చెయ్యీ చెయ్యీ పట్టుకునెళ్లి సీతారాముల దివ్యమంగళరూపాల్ని దర్శించారు. అర్చనతో అభిషేకాలూ చేయించారు. రామదాసు గురించి ముచ్చటించుకున్నారు. శ్రీను త్యాగరాజు కీర్తన పాడగా అంతా మెచ్చుకున్నారు.

"నీకు రానిదీ తెలీనిదీ అంటూ ఏదీ లేదా శ్రీనూ''

"ఎందుకొచ్చిందా డౌట్?"

"అందర్తో స్నేహంగా వుంటావు. సినిమా టిక్కెట్‌నుంచి గ్యాస్ సిలిండర్‌వరకూ అన్ని పనులూ చేసిపెడతావు. చక్కగా మాట్లాడ తావు. పాటలు పాడతావు. కథలు చెబుతావు. జోక్స్ విన్పిస్తావు. నిజంగా నీ అంత జీని యస్‌ని నేనెక్కడా చూళ్ళేదు''

"శ్రీరాముణ్ణి చూసేసరికి తాళాలూ మద్దె లా వాయిస్తున్నావ్. మనిషన్నాక కుసింత కలాపోసనుండాలి. తిని తొంగుంటే మనిసికీ గొడ్డుకీ తేడా ఏటుంటాది...!"

"మైగాడ్! అచ్చం రావుగోపాలరావులా మాట్లాడుతున్నావ్. నీకు మిమిక్రీ కూడా వచ్చా?" ఆశ్చర్యంలో నిలువునా మునిగిపో తూ అంది హర్ష.

"అవుమల్ల. ఈ పోరి గట్లందేంటి మల్ల. జర ఎర్రగడ్డ దవాఖాన్ల సూపియ్యరాదు..."

"నిన్నూ..." కొట్టబోతే అందకుండా పరు గెత్తాడు.

పర్ణశాల ప్రాంతానికెళ్లారు.

"ఇదే సీతారాములు అరణ్యవాస కా లంలో విహరించిన పర్ణశాల ప్రాంతం" గైడ్ వివరించాడు.

చప్పున జోళ్లు తీసేసింది హర్ష.

"అదేవిటి. జోళ్ళు తీసేశావెందుకు?"

"సీతారాములు నడయాడిన ఈ పావన ప్రదేశాన్ని అపవిత్రం చెయ్యకూడదని''

ఆమె మాటలు విని మిగతా ఆడవాళ్ళు కూడా చెప్పులు తీసేసి లెంపలేసుకున్నారు. తమ తమ మగవారి జోళ్ళు కూడా తీయించే శారు.

"ఓహ్! ఎంత బావుంది. ప్రకృతి రమణీ యతకన్నా ఇక్కడ పుణ్యదంపతులు విహ రించారన్న భావన నన్ను వింత అనుభూతు లకి లోను చేస్తూ వుక్కిరి బిక్కిరి చేస్తోంది. జన్మధన్యమైందన్న భావన కలిగిస్తోంది. సీ తమ్మ ఇక్కడిక్కడే తిరిగిందని, ఈ అడవి లోని కుటీరంలోనే స్వర్గాన్ని ఆవిష్క రించిందని, భర్త అడుగుల్లో అడుగువేసి ధన్యత పొందిందని తలచుకుంటే చాలు ఒళ్లు గగుర్పొడుస్తోంది'' ఆనందోద్వేగంతో పరవశిస్తూ అంది.

"అవును హర్షా. నిజంగా అరణ్యవాస సమయంలో సీతారాములీప్రదేశానికొచ్చారో లేదో తెలీదు. కాని వచ్చారనుకుంటే ఈ ప్రాంతాన్ని పావనం చేశారనుకుంటే మన స్సు ఉద్విగ్నమవుతోంది. ఏదో తెలీని అపూర్వానుభూతి మనస్సునీ, శరీరాన్నీ కుదిపేస్తోంది. ఇది మాటలకందని అనిర్వచ నీయమైన అనుభూతి''

"రామాయణగాథ జరిగి వేనవేల సంవ త్సరాలయింది. అయినా సీతారాముల్ని ఆద ర్శదంపతులుగా జనం పూజిస్తూనే వున్నా రు. భారతీయ జనజీవన స్రవంతిపై రామా యణమంత బలవత్తరమైన ముద్ర వేసిన కావ్యం మరొకటి లేదు. మనదేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ రాముడు అడవులకి వెళ్లినప్పుడు ఇక్కడ విశ్రమించాడని, ఇక్కడ బాణం వేశాడని, సీతమ్మ ఇక్కడ స్నానం చేసిందని, ఇక్కడ కూర్చుందని అనేక స్థలా లను చూపిస్తుంటారు. బహుశా ఏ దేశంలో నూ, ఏ సంస్కృతిలోనూ జనం గుండెల మీద ఇంత గాఢంగా ముద్రవేసిన ఘటన లేదనుకుంటాను''

"అంతేకాదు. రామకథ చెప్పే సత్యం మరొకటుంది. అప్పుడైనా ఇప్పుడైనా భవిష్య త్తులో ఎప్పుడైనా సరే పరస్త్రీమీద కన్నేసినవా డు పదితలలున్నాసరే బంధుమిత్రసహితంగా బూడిదైపోతాడు''

"బాగా చెప్పావు. పరస్త్రీ అనేకాదు పరపు రుషుడిమీద కన్నేసినా అంతే. శూర్పణఖలా ముక్కూ చెవులూ కోయించుకోబడి సమా జంచేత అవమానింపబడతారు. అవహేళన చేయబడతారు''

"కరెక్ట్. భార్యాభర్తల్ని వేరుచెయ్యాలని చూసిన రావణుడైనా రావణి అయినా మట్టి



గొట్టుకుపోకతప్పదు. ఇది ఈ పుణ్యభూమి మీద నడచిన సీతమ్మ ఇచ్చిన శాపం"

"అవునంతే. మూడోమనిషి కథలెన్ని విన టంలేదు? లేటెస్ట్ ఎగ్జాంపుల్ మా ఇంటా యన కూతురు ఇందిర"

"అంటే ఆవిడ...?"

"అహ అదికాదు, ఆమె కాపురంలో మరో కతి ప్రవేశించి చిచ్చుపెట్టింది'' అంటూ ఆవిడ కథంతా చెప్పింది హర్ష.

"కొన్ని అరబ్‌దేశాల్లో వ్యభిచార నేరాలకి కఠినశిక్షలు విధిస్తూంటారట. అలాగే ఇక్కడ మగవాడిని నడివీధిలో వేలాడదీయాలి. కాళ్ళూ చేతులూ నరికెయ్యాలి'' అన్నాడు ఆవేశంగా శ్రీను.

"మగాడివయ్యుండి కూడా మగాళ్ళని కఠినంగా శిక్షించాలంటున్నావంటే, నిన్నెలా అభినందించాలో తెలీటంలేదు శ్రీనూ''

"నా పేరు శ్రీనివాస్. అయినా నేను మాత్రం అన్ని విషయాల్లోనూ శ్రీరాముడ్నే. మంచి బాలుడ్నే''

"అయితే నేను సీతనే. నిన్నిహ ఏ శూర్పణఖా, ఏ రావణుడూ నానుండి వేరు చేయలేరు'' అతడి చేతిని గట్టిగా పట్టేసుకుంటూ అంది.

"యస్ వుయార్ ఒన్. రెండు శరీరాలూ ఒక ఆత్మ, అదే ప్రేమంటే''

"అంతా చాలా ముందుకెళ్ళిపోయారు..."

"మనమూ వెళ్దాం పద..."

పోటీపడి నడిచి మిగతావారిని చేరుకున్నారు.

"ఇక్కడే రావణుడు సీతామహాసాధ్విని అపహరించుకెళ్ళాడు'' అన్నాడు గైడ్.

హర్ష గుండెలు బరువెక్కాయి. దిగులుగా భయంగా చుట్టూ చూసింది.

"డోంట్‌వర్రీ. ఇక్కడిప్పుడు రావణుడూ లేడు, రావణీ లేదు''

శ్రీను మాటలకి తేలిగ్గా నిశ్వసిస్తూ నవ్వేసింది.

వెనుదిరుగుతూ అన్నాడు శ్రీను "రామరావణ యుద్ధంలో రావణుడు గెలిచివుంటే ఏం జరిగేదంటావు?"

స్థాణువైపోయిందొక్కసారే. ఏదో వినకూడనిది విన్నట్టు కంపించిపోయింది. ఆందోళనగా చూస్తూ "అదేం ఆలోచన శ్రీనూ? అంత ఘోరంగా, భయంకరంగా ఎలా ఆలోచించావు?" అంది ఉద్వేగంతో వూగిపోతూ.

"కూల్‌డౌన్ ప్లీజ్. జస్ట్ సరదాకి, జస్ట్‌ఇమాజిన్. ఏం జరిగేదంటావు?"

"వూహించడానికే ధైర్యం చాలట్లేదు''

"సీతకి తనని రక్షించగల శక్తి భూమ్మీద లేదని తెలిసిపోయేది. కాపలా రాక్షసులు ఆత్మహత్య చేసుకోనిచ్చేవారు కాదు. రావణుడికి పట్టపగ్గాలుండేవి కాదు. మండోదరి బిక్కమొహం వేసేది. అప్పుడు రావణుడు..."

"వద్దొద్దు. నేను విన్లేను'' చెవులు మూసుకుంటూ అంది. "ఆమె ఎన్నటికీ లొంగదు. ఆమరణ నిరాహారదీక్ష చేసి తనువు చాలించేది''

విస్మయంగా చూశాడు శ్రీను. ఏదో తెలీని భీతి కదలాడిందతడి కళ్ళల్లో ఓ క్షణంపాటు! "నీ ధోరణి చూస్తోంటే ఒక్కోసారి భయమేస్తూంటుంది హర్షా. నేన్శ్రీరాముడిలా వుండగలనంటావా?"

"నేను సీతనైనప్పుడు ఎందుకుండలేవు? మనల్ని వేరుచెయ్యగల శక్తి దశకంఠుడికే కాదు శతకంఠుడిక్కూడా లేదు. అందుకెవరైనా సాహసిస్తే వాళ్ళని నేనే సంహరించేస్తాను'' ఉద్రేకంగా అందామె.

"అక్షరాలా నీ రాముళ్ళా వుండటానికి ప్రయత్నిస్తాను హర్షా. సీతారాముల పాదస్పర్శచే పునీతమైన ఈ భూమి సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను'' అన్నాడామె చేతిలో చేయివేస్తూ.

"ఎమోషన్ ఫీలవ్వొద్దు. నీ మనస్సు నాకు తెలుసు శ్రీనూ. భద్రాచలం వెళ్ళిరా అని మా అమ్మ మరీ మరీ చెప్పింది. దానర్థం ఏమిటో ఇప్పుడే తెలుస్తోంది. ఆ ఫలం ఏమిటో ఇప్పుడే తెలిసింది'' నవ్వుతూ అతడ్ని క్రీగంట చూస్తూ అంది.

"నన్నో రోజు ప్రధానమంత్రిని చేస్తే దేశంలోని ప్రతి జంటా పెళ్ళైన వెంటనే భద్రాచలం వచ్చి ఇవన్నీ తిరిగెళ్లాలనీ ఆ తర్వాతే ఫస్ట్ నైట్ జరుపుకోవాలనీ ఆర్డినెన్స్ జారీ చేసేస్తాను''

"గొప్ప ఐడియా. ఇలాంటి ఐడియాలు నీకెలా వస్తాయి శ్రీనూ?"

"నా దేవత పూజా మహత్మ్యం!"

"ఛీ... ఫో..."

బస్సెక్కారు. అది కదిలింది.

చాలా సేపటివరకూ సీతారాముల భావనల్నుండి బయట పడలేదు హర్ష.



కాంచీపురం, పక్షి తీర్థం,మహాబలిపురం చూపించి చెన్నై తీసుకొచ్చింది బస్సు!

పాకేజ్‌టూర్ గనుక టూరిస్టులకి బస ఏర్పాట్లు నిర్వాహకులే చేశారు.

అది చాలా చిన్న హెూటల్. చెక్కల్తో కార్డు బోర్డుల్తో గదులు ఏర్పాటు చేశారు. ఒక మంచంతప్ప మరేమీ పట్టదు. ఆ పార్టిషన్ కూడా కొంత ఎత్తువరకే వుంది. మూడు రూములకి ఒక సీలింగ్ ఫాన్ చొప్పున అరేంజ్ చేశారు. కామన్ బాత్‌రూమ్, టాయ్‌లెట్టూనూ. పైగా నీళ్లకి రేషన్.

"ఇలాంటి చెత్త హెూటల్‌కి తీసుకొచ్చావేంటయ్యా'' నిర్వాహకుడు పిచ్చయ్యమీద కోప్పడ్డాడు శ్రీను.

"సత్రంకన్నా నయమేకదండీ. రాత్రి పడుకోడానికే కదా సర్దుకుపోండి సార్. మంచి హెూటల్ అయితే మీరు అదనంగా రేటు పెట్టుకోవాలి'' అన్నాడు.

"ఇక్కడ నిండా సౌకర్యముండాదబ్బా. మేముదా తెలుగువాళ్ళం" అన్నాడు హెూటల్ ఓనర్ రాజు.

తలలూపారతడి భార్య రాణీ, బామ్మర్ది జాకీనూ.

వాళ్ళ పేర్లేకాదు వాళ్ళూ చిత్రంగానే వున్నారు. వారి ప్రవర్తన మరీ చిత్రంగా వుంది. ఆ హెూటల్లో యజమానినుంచి, వంటవారినుంచి, క్లీనర్‌నుంచి బోయ్ వరకూ అన్నీ వాళ్ళే. సమయానుకూలంగా అవతారాలెత్తుతూంటారన్నమాట.

"ఇక్కడ వూపిరాడదు. ఏం హర్షా. ఈ పక్కనే పెద్ద హెూటల్ వుందిట. అక్కడికెళ్దామా?" అనడిగాడు శ్రీను.

మిగతావారివంక చూసింది హర్ష. అంతా ఎలావోలా సర్దుకుపోదామనుకుంటున్నారు. కొందరైతే యాత్రలకోసం వచ్చాంగాని హెూటల్‌కోసం కాదు కదా అంటూ రూమ్సులోకి వెళ్ళిపోయారు.

తామిద్దరూ ప్రత్యేకంగా వెళ్లడానికి మనస్కరించలేదామెకి. ఆమె సిక్స్‌సెన్స్ జాగ్రత్తంటూ చిన్నగా హెచ్చరించింది కూడానూ.

"ఈ రాత్రికి ఎలావోలా ఎడ్జస్ట్ అయిపోదాం. రేపింకోచోట చూడమందాం" అందామె.

"ఓకే. నీ గురించే గాని నాకెక్కడైనా

ఒక్కటే. కటికనేలమీద పడుకోవడానిక్కూడా నేను సిద్ధమే'' అనేసి మెల్లగా ఆమె చెవిలో "ఇంకోపాయింటేవిటంటే నువ్వున్నచోటే నా స్వర్గం కదా'' అన్నాడు.

ఆమె సిగ్గుల మొగ్గయ్యింది.

హెూటల్లోని బాత్‌రూములకి గొళ్ళేలు లేవు. ఎవరోకరు కాపలావుండాలి. ఒక్కొక్కరికీ చిన్న బకెట్టుడు నీళ్ళు ఇచ్చారు. ఆడవాళ్ళు చీరలు మార్చుకోవడానిక్కూడా ఇబ్బంది పడ్డారు. ఇక గదుల్నిండా బొద్దింకలూ, దోమలూనూ!

రాజూ, రాణీ, జాకీ కలిసి అన్నిటికీ ఏదోటి చెప్పి సమర్ధిస్తున్నారు.

గట్టిగా కోప్పడితే మాపొట్ట కొట్టకండని బతిమాల్తున్నారు.

ఒక కూర, గోంగూర పచ్చడి,సాంబారుతో భోజనం పెట్టారు. సాంబారు బాగానే వుండటంతో ఇబ్బంది పడకుండా తినేశారు.

దుప్పట్లు వుతికినవి ఇవ్వలేదు.

ఇదేవిటని కోప్పడ్డాడొకాయన. దాంతో వాళ్లలోవాళ్ళు ఒకరి మీదొకరు కేకలు వేసుకున్నారు. నిజంగా కొట్టేసుకుంటారేమోనన్నంతగా రెచ్చిపోయారు.

"మా గురించి మీరు దెబ్బలాడుకోవద్దు. మేమే సర్దుకుంటాంలే' అని చెప్పి మళ్లీ వీళ్ళే వాళ్ళని విడదీయాల్సొచ్చింది.

"హమ్మయ్య'' అనుకునెళ్ళిపోయి నవ్వుకున్నారు వాళ్ళు.

వారిది నాటకమని రెండ్రోజులుండి వెళ్లిపోయేవారికి తెలీదు కదా!

భోంచేసి బయటికెళ్ళారు. కాస్సేపు అటూ ఇటూ తిరిగి అరటిపళ్ళు కొనుక్కొచ్చారు హర్షా, శ్రీనూ.

తమ గదుల్లోకెళ్లబోతుంటే హఠాత్తుగా దారుణమైన పొగ చుట్టేసింది.

హెూటల్ తగలబడిపోతోందని భయపడి అంతా బయిటికి పరుగెత్తారు. పిట్టగోడ మీంచి వంటశాలలోకి చూశాడు శ్రీను. పరిస్థితి అర్ధమైంది. ఏమీ కంగారు పడాల్సిన పని లేదన్నాడు.

కానెవరూ విన్పించుకోలేదు. బిలబిలా కిందికి దిగివెళ్ళిపోయారు. మొదటి అంతస్తులో శ్రీనూ, హర్షా ముక్కుకి కర్చీఫ్ అడ్డం పెట్టుకుని మిగిలిపోయారు.

ఏకాంతంకోసం కాచుక్కూర్చున్నట్టు అమాంతం హర్షని కావలించుకుని ముద్దుల వర్షం కురిపించాడు. ఆమె తనువెల్లా నిమిరాడు. ఆమె కూడా తమకంతో హత్తుకుపోయింది.

కంగారుపడొద్దనీ, తడిసిన గోనెపట్టా కాలిందనీ కిందినుంచి అరుస్తున్నారు రాజూ, రాణీ, జాకీ.

కాస్సేపటికి పొగ మెల్లగా చెదరిపోయింది.

ఎవరేమనుకుని భయపడిందీ వర్ణిస్తూ అంతా తిరిగివచ్చారు. పేలుడు శబ్దం వచ్చివుంటే బాంబు అనుకునే వాళ్లమనీ అప్పుడే కంగా ప్రాణాలే పోయేవనీ అన్నారొకరు.

"తమిళనాడు ఇదివరకట్లా ప్రశాంతంగా వుండట్లేదు. బాంబుల సంస్కృతి పెరిగిపోతోంది'' అని వ్యాఖ్యానించాడొకాయన.

గొడవ సర్దుమణిగేక తమతమ గదుల్లోకెళ్ళి పడుకున్నారంతా.

హర్ష గదిపక్క గదిలోనే శ్రీను పడుకున్నాడు. ఇద్దరి గదులకీ మధ్య అతుకుల కార్డ్‌బోర్డ్‌గోడ! అది లేకపోతే తామిద్దరి మంచాలమధ్యదూరం మూడడుగులు!

ఆమె ఒంట్లోంచి ఆవిర్లు వస్తోంటే నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతోంది. మరోపక్క గదిలోంచి గురక విన్పిస్తోంది. పగలంతా తిరిగి తిరిగి అలసినందున త్వరగా నిద్రలోకి జారుకున్నారంతా.

ఉన్నట్టుండి హర్షకీ, శ్రీనుకీ మధ్యనున్న పార్టీషన్‌లోంచి రెండడుగుల ముక్క వూడి వేలాడసాగింది. ఉలిక్కిపడి లేచారిద్దరూ.




అతడు స్ప్రింగులా ఎగిరొచ్చి కన్నంలో నుంచి చూశాడు. ఆమెకూడా సమీపించింది.

"ఇలా జరిగిందేమిటి? ఇది దైవికమా, దైహికమా?"

"ష్... ఎవరైనా వింటారు"

"విననీ నువ్వు నా గుండె చప్పుడుమాత్రం వింటేచాలు"

ఆమె చేతులందుకుని గుండెల మీదుంచుకున్నాడు.

మెల్లగా ఆమె చేతుల్ని నిమురుతూ మెడ దగ్గర గిలిగింతలు పెట్టాడు. ఆమె అతడి చేతుల్నాపి అరచేతుల్లో ముద్దులు కుమ్మరించింది. అతడామె మెడని కావలించుకున్నాడు.

ఆమెని వదలకుండానే మెల్లగా ఆమె గదిలోకి దూరాడు. ఆమెని నిలువెల్లా తడిమాడు. గిలిగింతలు పెట్టాడు. ఏమేమో చేశాడు. శృతిచేసిన వీణ అయ్యిందామె అతడి చేతుల్లో.

మరి నిగ్రహించుకోలేకపోయారు.

ఒకర్లో ఒకరు ఐక్యమైపోయారు!

మర్నాటి ఉదయం శ్రీనువంక చూట్టానికి హర్ష చాలా సిగ్గుపడింది. కానతడు ఆమె దగ్గరికొచ్చి సీరియస్‌గా అన్నాడు "మన వూరికి తిరిగి వెళ్ళి వెళ్లగానే మనం చెయ్యాల్సిన మొదటి పని పెళ్ళి చేసుకోవడం"

ఆమె మహదానందపడిపోయింది. అతడి చేతుల్ని ఆప్యాయంగా నొక్కింది.

వి.జి.పి. చూసి కిష్కింధ కెళ్ళారంతా.

బోటులో వాటర్ ఫాల్స్‌మీద దూకడం బాగా ఆకర్షించింది హర్షని. అదే సమయంలో ఎంతో భయంగా అన్పించింది.

"నేను పక్కనుండగా భయమేమిటి? కమాన్ డార్లింగ్" అన్నాడు శ్రీను దారితీస్తూ.

భయపడ్తూనే వెళ్ళి చిన్నబోటుమీద అంతెత్తు నీటిమీంచి పడ్డారు. నీళ్ళు నలువైపులకీ చెదిరాయి. బోటు ఆగేక 'బాపురే' అంది హర్ష.

"ఇలాంటి థ్రిల్లింగ్ ఈవెంట్స్ లేకపోతే లైఫ్‌లో మజా వుండదు"

"నువ్వు పక్కన లేకపోతే అమ్మో! నా తరం అయ్యేదికాదు"

"ఇకనుంచెప్పుడూ అమ్మాయిగారి పక్కనే వుంటానుగా" అన్నాడామెని గట్టిగా అదుముకుంటూ.

ఆమె అందంగా సిగ్గుపడుతూ అతడి వక్షంలో ముఖం దాచుకుంది.

సరిగ్గా అప్పుడు కెమేరా క్లిక్‌మంది.

"ఫెంటాస్టిక్. యూ ఆర్ మేడ్ ఫర్ ఈచ్ అదర్' అన్నాడు ఫొటో తీసిన ఫారినర్.

"నో...నో. మాడ్ ఫర్ ఈచ్ అదర్' నవ్వెందతడి జోడీ.

"కంగ్రాట్స్" అంటూ షేక్ హేండిచ్చారిద్దరూ.

శ్రీనూ, హర్షా కూడా సరదాగా నవ్వేసుకున్నారు. చేతులు కలిపి 'కేన్ యూ సెండె కాపీ ఆఫ్ ద స్నాప్ టు అజ్' అనడిగాడు శ్రీను.

"వైనాట్. గివ్ యువర్ ఎడ్రస్..."

శ్రీను ఎడ్రస్ రాసిచ్చి 'థాంక్స్' చెప్పాడు.

రెస్టారెంట్లో పూరీ తిని ఒకే బాటిల్లో రెండు స్ట్రాలు వేసుకుని కూల్‌డ్రింక్ తాగారు.

"కార్ డ్రైవింగ్ చేద్దాం రా"

"అది చిన్నపిల్లలక్కదా?"

"కాదు పెద్దపిల్లలక్కూడానూ. రెండేళ్ళలో మనం కారులో తిరగాలోయ్. అందుకిది శాంపిల్‌డోస్ అనుకో. పద..."

కారెక్కి అటూ ఇటూ అడ్డదిడ్డంగా డ్రైవ్ చేసి ఒకర్నొకరు గుద్దించుకుని నవ్వేసుకున్నారు.

"నీతో గడుపుతోంటే టైమే తెలీటంలేదు శ్రీనూ"

"దాన్నే ప్రేమమైకం అంటారు"



"నువ్వు పక్కనుంటే నాకెంతో ధైర్యంగా, వుత్సాహంగా వుంటుంది. అందరానివేవో అందినట్టు, ఏవేవో జయించినట్టు అన్పిస్తూంటుంది. ప్రతి పురుషుడి విజయం వెనుకా ఒక స్త్రీ వుంటుందంటారు గాని ప్రతి స్త్రీ విజయం పక్కనా ఒక పురుషుడుంటాడంటాను. ఏమంటావు?"

"ఏమీ అనను గాని ఓ సంగతి చెప్పనా?"

"సందేహమెందుకు?"

"ప్రతి పురుషుడి విజయం వెనుకా ఒక స్త్రీ వుండి 'నువ్వు చేస్తున్నదంతా తప్పే' అంటూంటుందిట!"

"మా మీదే జోకులేస్తావా? నిన్నూ..." చెయ్యెత్తింది కొట్టడానికన్నట్టు.

దూరంగా వెళ్ళి కవ్వించాడు.

ఇద్దరూ పరుగులు పెట్టి అలసిపోయి కూర్చుండిపోయారు.

శ్రీను వెళ్ళి ఐస్‌క్రీం తెచ్చాడిద్దరికీ.

"నువ్వు చెప్పిన ఐస్‌క్రీం జోక్ నిజమే' కనురెప్పలు టపటపలాడిస్తూ అంది హర్ష.

"స్వానుభవంతో కన్ఫర్మ్ చేస్తున్నావా డియర్''

"అవునంతే కదా మరి. నేనంత ఇదిగా కరిగిపోతానని గాని, పెళ్లి కాకుండానే నన్ను నీకు సమర్పించుకుంటానని గాని కలలో కూడా అనుకోలేదు''

"మనకి విజయవాడలో పెళ్ళయ్యింది, చెన్నైలో శోభనం అయ్యింది''

"అఫ్‌కోర్స్. అదీ నిజమే అనుకో. అయినా సంప్రదాయం సంప్రదాయమే కదా''

"ఆ సంప్రదాయానికి గోలీ మారో. నేటి సమాజంలో భార్యాభర్తలంటే అర్థం ఏవిటో తెలుసా?"

"భర్త అంటే భరించువాడు, భార్య అంటే భరింపబడేది''

"అది ట్రాష్ కాదూ? రేపు నిన్ను నేను భరిస్తానా చెప్పు? ఇద్దరి కాళ్లలోనూ శక్తి వున్నప్పుడు అది తప్పుకాదూ? పెళ్లిచేసుకున్నంతమాత్రాన ఆడది మగాడి సొత్తు అయినట్టూ అతని కాళ్లదగ్గర బానిసలా పడుండాలనడం నాన్సెన్స్. అలాటి అమ్మమ్మల కబుర్లు నాకు నచ్చవు''

"మరేం నచ్చుతాయి?"

"పెళ్లిలో ఏ ఒక్కరూ కొవ్వొత్తీ కాదు, గుదిబండా కాదు. బాధ్యతల్లో చెరిసగం పంచుకోవాలి. సుఖదుఃఖాల్లో తోడునీడగా ఉండాలి. అలాటి సాహచర్యమే పెళ్లి. కాని వాళ రేపు ఏం జరుగుతోంది? భర్తంటే బాధించేవాడుగానూ భార్య అంటే బాధల్ని భరించేదిగానూ అర్థాలు మారి పోయాయి!"

"బాగా చెప్పేవు శ్రీనూ. పెళ్లయ్యాక రెండునదుల కలయికలా కలిసిపోవాలి. త్రివేణీ సంగమంలో ఇది గంగ ఇది యమున ఇది సరస్వతి అని తెలీవుట. అన్నీకలసి ఒకటిగా ఒకేనదిలా వుంటాయిట. మనంకూడా ఈమె హర్ష ఇతడు శ్రీను అనిగాక ఒక్కటిగా కలిసిపోవాలి. ఒక్కటిగా సాగిపోవాలి'' ఆర్తిగా అంది.

"అందులో ఎలాంటి సందేహాలకీ తావులేదు'' అంటూ అభయమిచ్చాడు.

"రాత్రికి మరో హొటల్‌కి తీసుకెళ్తాను. సామాన్లు సర్దుకోండి'' అన్నాడు పిచ్చయ్య.

శ్రీను అడ్డుపడ్డాడు. "వద్దులే. టూరిస్టులంతా ఎక్కువగా ఇక్కడికే వస్తారటగా. పైగా తెలుగువాడు. అతడి పొట్టకొట్టడం ఎందుకూ. ఈ రాత్రికి కూడా ఎలాగోలా సర్దుకుపోతాంలే. రేపెలాగూ రామేశ్వరం వెళ్లిపోతాంగా''

అతడివంక అయోమయంగా చూస్తూ తలాడించాడతడు.

అంతా నిద్రపోయాక ఉదయం తగిలించిన అట్టముక్కని తొలగించి పిల్లిలా హర్షపక్కకి చేరాడు శ్రీను.

'ద్వితీయ విఘ్నం వుండకూడదు'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

 

ఆమె అడ్డు చెప్పలేదు.

ఆ మర్నాటి నుంచి మిగతా టూర్ అంతా హనీమూన్ దంపతుల్లా గడిపారిద్దరూ!

★ ★ ★

రామలింగయ్యగారు కోర్టుకెళ్ళబోతుంటే రిక్షా దిగింది హర్ష.

"వచ్చేశావా! హమ్మయ్య. ప్రయాణం అదీ బాగా జరిగిందా అమ్మాయ్'' అనడిగారాయన.

"భగవంతుని దయవలన అంతా బాగా జరిగింది బాబాయిగారూ. ఎక్కడా ఎలాంటి ఇబ్బందీ పడలేదు''

"పోన్లేమ్మా. ఆడపిల్లవి ఒంటరిగా వెళ్ళేవని మీపిన్ని ఒకటే గొడవపెడుతోంది. అన్ని మొక్కులూ సవ్యంగా తీరినట్టేనా?"

"తీరాయి బాబాయ్''

"సంతోషం. అలసిపోయుంటావు లోపలికెళ్లమ్మా''

తన పోర్షన్ వైపెళ్తోంటే కామేశ్వరీ ఇందిరా ఎదురొచ్చారు.

హర్షలో ఏదో మార్పు కొట్టొచ్చినట్టు కన్పించింది కామేశ్వరికి.

బుగ్గల్లో నిగారింపు, కళ్లల్లో సిగ్గు, తనువులోని కొత్త అందాలూ, మెరుపులూ ఆమె దృష్టినుంచి తప్పించుకోలేకపోయాయి.

"ఏదేదో అనుకుని భయపడ్డాం. బాగానే తిరిగి వచ్చావే. తెలిసిన వాళ్లుకూడా వచ్చారేమిటి?"

కామేశ్వరి మాటల్లో విపరీతార్థం కన్పించింది హర్షకి.

"అవన్నీ మీకనవసరం. మీ ఇంట్లో అద్దెకుంటున్నానని నామీద పెత్తనం చెలాయించాలని చూస్తే వూరుకోను'' అని దులిపెయ్యాలనుకుంది. కాని తన యోగక్షేమాలు కనుక్కుంటూ తనని కూతుర్లా చూసే రామలింగయ్యగారి ముఖం గుర్తొచ్చి మింగేసింది.

"మా అమ్మ నోటిదురుసు మీకు తెలిసిందేకదా. వెళ్లి రెస్ట్ తీసుకోండి'' అంది ఇందిర.

దూరంగా నిలబడి చూస్తున్న గోపిని చూశాక 'వాడికోసం చిన్న బహుమానమైనా తేలేకపోయానే' అని బాధపడింది. సాయంత్రం బజార్లో కొనేసి మద్రాసులో కొన్నానని చెప్పాలనుకుంది.

పెద్దపెద్ద అడుగులేసుకుంటూ ఇంట్లోకెళ్లిపోయింది.

ఇల్లు బోసిగా అన్పించింది.

గత పదిహేను రోజులుగా క్షణం విడవకుండా శ్రీనుతో కలిసుంది మరి. అలాంటిదిప్పుడు...!

"ఇంకెన్నాళ్ళులే ఈ ఒంటరి బతుకు!" అనుకుంది.

తీయని తలపులు చుట్టెయ్యగా శ్రీనుతో గడిపిన మధురక్షణాలు స్మృతిపథంలో మెదలగా సినీ హీరోయిన్లా డ్యాన్స్ చేస్తూ గదంతా కలతిరిగింది. ఒంటిమీది చీర లాగి పారేసి 'గ్రీకువీరుడు... నా రాకుమారుడు..." అని పాడుకుంటూ బాత్‌రూంలో దూరింది.

మర్నాడు బ్యాంకులో అడుగుపెడుతోంటే ఏదో కొత్తగా ప్రత్యేకంగా అన్పించింది హర్షకి.

ఆమెని చూస్తూనే చేటంత మొహంతో సమీపించింది సరిత.

"హాయ్. ఎలావుంది టూర్? ఫస్ట్‌క్లాసా?"

గుంభనంగా నవ్వింది హర్ష.

"మీ బోయ్‌ఫ్రెండ్ కూడా వచ్చాడు కదూ?"

"నీకెలా తెలుసు?"

"మీరు లీవుపెట్టారని తెలిసి వివరాలడగ్గా మీ టూర్ ప్రోగ్రాం గురించి నేనే చెప్పాను''

ఒక్కసారిగా ఆమె మొహం మ్లానమయ్యింది.

తన ప్రోగ్రాం గురించి తెలీదనీ యాక్సి

డెంటల్‌గానే అయినా భలే కలిశామంటూ అతడన్నమాటలు గుర్తొచ్చాయి.

ఎందుకలా అబద్ధమాడినట్టు?

బుల్లి అనుమానపు బీజం పడిందామె మనస్సులో!

కాస్సేపటిదాకా ఆ విషయం గురించే ఆలోచించి ఆలోచించి పీకులాటపడింది.

తనని ప్రేమిస్తున్నందున తనకి మరింత చేరువవ్వడానికీ తన ప్రేమ గెలుచుకోడానికీ వచ్చి వుంటాడు. అందుకనే అబద్ధంచెప్పి నాటకమాడి వుంటాడు.

యుద్ధంలోనూ ప్రేమలోనూ మోసం అన్నపదానికి చోటులేదు. రెండింట్లోను గెలుపు ముఖ్యమంతే!

ఆ సమాధానమెంతో తృప్తినిచ్చింది. ఆమె పెదాలమీద చిరునవ్వు మొలిచింది. మనస్సులో సువాసనల పూలు పుష్పించాయి!

మరి నాలుగురోజులు దొర్లిపోయాయి.

శ్రీను జాడలేదు!

హర్ష ఆశ్చర్యానికి ఎల్లలు లేకపోయాయి.

నిన్ను విడిచి వుండలేనన్నాడు. తిరిగెళ్ళి వెళ్లగానే పెళ్లాడదామన్నాడు. కనీసం ముఖంకూడా చూపించకుండా చాటేసేడంటే ఏమనుకోవాలి?

కొద్దిరోజులక్రితం పడ్డ అనుమాన బీజం మొలకెత్తసాగింది. గుండెల్లోకి భయాలవేళ్ళు చొచ్చుకుపోసాగాయి.

ఆ రాత్రి చెన్నై లాడ్జిలో గది పార్టిషన్‌కి కన్నంపడటం యాదృచ్ఛికమా లేక అందులో అతడి హస్తలాఘవం వుందా?

ఎన్నో భయాలు నిర్దాక్షిణ్యంగా ఆమె మీద దాడిచేశాయి. దాంతో బెంబేలు పడిపోయిందామె.

శ్రీను పనిచేస్తోన్న విజేతా హౌసింగ్‌కి ఫోన్‌చేసింది.

టూర్ నుంచి వచ్చాక అర్జంటు పనిమీద అత్తవారింటికెళ్లాలని చెప్పి శలవు పొడిగించాడని చెప్పారు.

ప్రాన్పడిపోయింది. కాళ్లకింద భూమి చీలినట్లూ తను భూమిలోకి క్రుంగిపోతున్నట్టూ అన్పించింది. దుఃఖోద్వేగంతో గజగజ వణికిపోయింది.

"అంటే... అంటే... అతడికి అంతక్రితమే పెళ్లయ్యిందన్నమాట! ఆ సంగతి దాచి తనని ప్రేమిస్తున్నట్టు నటించి లొంగదీసుకున్నాడన్న మాట! తన కన్యత్వాన్ని అపహరించి పరిహసించాడన్నమాట! ఎంత మోసం! ఎంత దారుణం..."

కోపం, దుఃఖం వెల్లువలా పొంగిరాగా నిగ్రహించుకోలేక ఏడ్చేసింది.

'ఎక్కడో ఏదో పొరపాటు జరిగి వుంటుంది. శ్రీను అలాటివాడు కాదు' అని సరిపెట్టుకోజూసింది గాని సాధ్యం కాలేదు.

అతడు చెప్పిన గుర్తుల్ని బట్టి శ్రీరామపురాన్ని జల్లెడపట్టేసింది. అయినా అతడి ఇల్లు తెలీలేదు. పిచ్చిదాన్లా అన్నిరూట్లూ చుట్టేసింది. బజార్లో సినిమా హాళ్ళ దగ్గర వెతికింది.

అతడెక్కడా కన్పించలేదు.

తను నిలువునా మోసపోయిందని విశ్వసించింది. అతడి కల్లబొల్లి కబుర్లు నమ్మి గుడ్డిగా ప్రేమించానే! సర్వం అర్పించానే అని కుళ్ళిపోయింది. కృంగిపోయింది. మగాడి వెనుకే మోసం దాగి వుంటుందని తెలిసికూడా జాగ్రత్తపడలేకపోయానే అని ఏడ్చేసింది.

తన ముఖం ఎవరికీ చూపించలేక శలవుపెట్టి ఇంట్లోనే వుండిపోయింది. ఉబ్బిన ఆమె కళ్ళూ వాలకం చూసి రామలింగయ్య దంపతులు కంగారుపడ్డారు.

ఒంట్లో బాగుండలేదని మాత్రం చెప్పి వూరుకుంది. వాళ్ళు నమ్మలేదు. అయినా నమ్మించ ప్రయత్నించలేదు. తలుపులు వేసేసుకుని ఇంట్లోనే వుండిపోయింది.





భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పించి భయపెడుతుంటే భయవిహ్వల య్యై వణకిపోతోంది. కన్నీటి జడివానలో తడిసి పోతోంది. విషనాగుకాటుకి బలైన దానిలా విలవిల్లాడుతోంది.

డిగ్రీ పాసయ్యింది. ఆఫీసర్‌గా ఉద్యోగం చేస్తోంది. టీనేజ్ అమాయకత్వపు దశని ఎన్నో ఏళ్లక్రిందటే దాటేసింది. ఎంతో తెలివైందని ప్రశంసలందుకుంది.

అయినా ఒక హైస్కూలు విద్యార్థినిలా అతడ్ని తేలిగ్గా నమ్మేసింది. షుగర్ కోటెడ్ మాటలకి లోబడిపోయింది. అత్యంత దారుణంగా మోసబోయిందంటే ఏమనుకోవాలి? ఏరకంగానూ సమర్థనీయంకాని విధంగా ప్రవర్తించింది. విజ్ఞత మరచి వివేకం విడిచి లొంగిపోయింది. సూటిగా చెప్పాలంటే కళ్ళు మూసుకుని మూర్ఖంగాలోబడిపోయింది.

కాలింగ్ బెల్ మోగింది.

విసుక్కుంటూ వెళ్లి తలుపు తీసింది.

శ్రీను!

కళ్లు నలుపుకుని చూసింది. . నిజమే. కోపం కట్టలు తెంచుకుని రాగా "ఇన్నాళ్ళూ అయిపు లేకుండా ఎక్కడికి పోయావ్' అని గద్దించింది.

"అత్తవారింటికెళ్ళేను'' లోపలికొచ్చి తాపీగా అన్నాడు కుర్చీలో కూర్చుంటూ.

"యూ చీట్! నీకు ముందే పెళ్లి అయ్యిందని చెప్పకుండా మోసం చేస్తావా? నన్ను లోబరుచుకుని సర్వస్వం దోచుకుంటావా? నిన్ను బతకనివ్వను..." ఆవేశంతో వూగిపోతూ చేతికందినవన్నీ పిచ్చిగా అతడి మీదకి విసిరేసింది.

దెబ్బలు తప్పించుకుంటూ "ఆగు హర్షా... ఆగాగు... నిన్నే..." అంటూ వచ్చి వెనకనుంచి ఆమె చేతులమీంచి వాటేసుకున్నాడు.

"ఛీ! వదులు. నీ మొహంచూపించొద్దు. నువ్వు విలన్‌వి. ద్రోహివి. నీకేం అన్యాయం చేశానని నన్నిలా మోసగించావు? నీలాటి భ్రష్టుడు బతక్కూడదు. కాల్చి చంపెయ్యాలి..." ఏడ్చేస్తూనే గొంతు చించుకుంది.

"స్టాప్... స్టాప్... నేను చెప్పేది విను..."

"వినను. నువ్వు రోగ్‌వి. అబద్ధాలకోరువి..."

"మగాడు మోసం చెయ్యాలంటే అబద్ధాలే చెప్పక్కర్లేదు. తనకనువైన నిజాలు మాత్రమే చెప్పికూడా మభ్యపెట్టొచ్చు తెలుసా?"

"నీమాటలు నేను నమ్మను. నువ్వు నీచుడివి. నమ్మకద్రోహివి..."

"షటప్. చెప్పేది విన్పించుకోవేం? సరదాకేదో అంటే రెచ్చిపోయి రభస చేస్తావా?" ఆమె నొదిలేసి వురిమిచూస్తూ కోపంగా అరిచాడు.

చేష్టలుదక్కి అతడివంక బేలగా చూసింది.

"అవును. అత్తవారింటికే వెళ్లాను. కాని నువ్వు అపోహపడుతున్న చోటుకి కాదు. నా కాబోయే అత్తవారింటికెళ్ళేను''

"అంటే... నువ్వు..."

"యస్. మీ అన్నయ్యల ఇళ్ళకెళ్ళేను.!"

"నిఝంగా?"

"నీతోడు!"

"ఓ. సారీ సారీ! ఏదేదో వూహించుకుని నిన్నపార్థం చేసుకున్నాను. క్షమించు శ్రీనూ. నీగొప్పమనస్సుని అర్థంచేసుకోలేకపోయాను''

అతడి గుండెల్లో తల దాచుకుని వెక్కివెక్కి ఏడ్చేసింది.

"ఛా. వూరుకో. నీ స్థితిలో ఎవరున్నా అలాగే అపార్థం చేసుకుందురేమో. కాని ఎంతో బేలన్స్‌డ్‌గా వుండే నువ్వు కూడా తొందరపడటమే నమ్మలేకపోతున్నాను''

"ఎంతైనా నేనూ ఆడదాన్నేగా. అనుమానం మా పక్కనే పొంచివుంటుంది''



"నాదీ తప్పేలే. చెప్పివెళ్ళాల్సింది. సర్ప్రయిజ్ చేద్దామనెళ్ళాను"

"మా అన్నయ్యలతో ఏం మాట్లాడావ్? వాళ్ళేమన్నారు?" ఆత్రంగా అడిగింది హర్ష.

"అన్నీ అక్షరం పొల్లుపోకుండా చెబుతాను గాని ముందు స్టౌ మీద టీ పెట్టి గదంతా నీట్‌గా సర్దేసెయ్. ఎవరైనా వస్తే పోట్లాడు కుంటున్నామని అపార్థం చేసుకోగలరు"

"సారీ... వెరీ సారీ..."

గబగబా అన్నీ సర్దేసింది. ముఖం కడు క్కొని ఫ్రెష్‌గా తయారై వేడివేడి టీ కప్పుల్తో వచ్చింది.

ఇప్పుడు హర్ష మంచి అమ్మాయిలా ఉంది.

"సస్పెన్స్ భరించలేకపోతున్నాను. మా అన్నయ్యలేమన్నారో చెప్పు. ఇద్దర్నీ కలిశా వా?"

"ఆహా. హైదరాబాద్ వెళ్ళి పార్వతీశాన్ని తిరపతెళ్ళి గిరీశాన్నీ కూడా కలిసొచ్చాను"

"ఏమన్నారు? మన పెళ్ళికి ఒప్పుకు న్నారా?"

"వాళ్ళన్నది అన్నట్టు చెబుతాను. ను వ్వేం ఫీల్ కానని ప్రామిస్ చెయ్యాలి మరి..."

"మనసులోని మాట ముఖాన్నే చెప్పె య్యడం నీకలవాటేగా చెప్పెయ్. ఏమీ అను కోన్లే. మా అన్నయ్యలనైజం తెలీకపోతే కదా ఏమైనా అనుకోవాలి!"

"మీ పెద్దన్నయ్య జెంటిల్‌మెన్. నేను చెప్పిందంతా ఓపిగ్గా విన్నాడు. కులం గు రించీ, ఉద్యోగం గురించీ మన పరిచయం గురించీ ఏదీ దాచకుండా చెప్పేను. పెళ్ళికి తనకేం అభ్యంతరం లేదుగాని కట్నకానుకలి వ్వలేమన్నాడు. అక్కర్లేదన్నాను. హర్ష అనే భాగ్యాన్ని ప్రసాదిస్తే చాలన్నాను. బాగా ఇంప్రెస్ అయ్యాడు. బంధువులు అన్నిమూ లల్లో వున్నారనీ, అందర్నీ పిలిచి పెళ్ళి చేయాలంటే చాలా ఖర్చుతో కూడిన పని అన్నాడు. అలాగని తూతూమంత్రం పెళ్ళిచే స్తే బంధువులు ఆడిపోస్తారన్నాడు... అంచేత ఇక్కడే రిజిస్టర్ మేరేజ్ చేసేసుకుని హైదరా బాద్ రమ్మన్నాడు..."

"కనీసం పెళ్ళి ఖర్చు కూడా పెట్టుకోడన్న మాట! ఎంత స్వార్థపరుడో చూడు. మా అన్నయ్య మంచివాడే పాపం. ఇదివరకు నన్నెంత ప్రేమగా చూసేవాడనీ. ఇదంతా తెరచాటునుండి మా వదిన ఆడిస్తోన్న నా టకం!" వుక్రోషంగా అంది.

"తెలియని విషయాల గురించి ఎంత తక్కువగా మాట్లాడుకుంటే అంతమంచిది. అక్కడ్నుంచి తిన్నగా తిరుపతెళ్ళాను. నేను చెప్పేది పూర్తిగా వినకుండానే ఆల్సేషియన్ డాగ్‌లా నా మీద పడ్డాడు మీ చిన్నన్నయ్య. నీ అందం, సంపాదనా చూసి ప్రేమమంత్రం జపిస్తోన్న మోసగాడ్నని నిందించాడు. మౌ నంగా భరించాను..."

"మోసగాడివైతే అతడి ఇల్లు వెతు క్కుంటూ వెళ్తావా? ఆమాత్రం ఆలోచించలేక పోయాడు. మనుషుల్ని అర్థం చేసుకోవడం కూడా తెలీదు వాడికి"

"నన్ను చెప్పనీ. అతడి సందేహాలన్నీ నివృత్తిచేశాను. ముందుగా మీ వదినే మెత్త బడింది. చెల్లి పెళ్ళి చెయ్యలేదని మాటపడేక న్నా వారి ప్రేమ పెళ్ళికి ఒప్పుకుంటేనే మంచిదికదా అంది"

"మా చిన్న వదిన అలాటి ఎత్తువేసి అన్నయ్యని ఒప్పిస్తుందని నాకు ముందే తెలుసు. ఎలాగోలా నా బరువు దిగిపోతే చాలని చూస్తోందావిడ"

"ఆవిడ ఉద్దేశ్యాలేమైతేనేంగాక మనకి అనుకూలంగా మాట్లాడింది. మీ అన్నయ్య కూడా మెల్లగా దిగివచ్చాడు. ఇద్దరన్నలు వుండి కూడా పెళ్ళి చేయనందున చెల్లెలు ఎవర్నో ప్రేమించి పెళ్ళాడిందని బంధువులు ఆడిపోసుకుంటారని నీలిగాడు. ఇది మీరు




కుదిర్చిన సంబంధమేనని అందరికీ చెబుతామన్నాను. కట్నం ఇచ్చారనీ అబద్ధమాడతానన్నాను. దాంతో ఒప్పుకున్నాడు. ముహూర్తం పెట్టి రాయమన్నాడు. తాము రాకపోయినా ఫీలవ్వొద్దన్నాడు. పెళ్లయ్యాక ఇద్దరూ తిరుపతి వస్తే దేవుడి దర్శనం చేసి పంపిస్తానన్నాడు''

"వాడెప్పుడూ అంతే. పైసా విదపడు. కబుర్లు మాత్రం భారీగా చెబుతాడు. మీరిద్దరూ తిరుపతి రండి పెళ్లిచేసి పంపిస్తాననకూడదూ? అనడు''

"పెళ్లికి మనం ముఖ్యం. మన మనస్సుల కలయిక ముఖ్యం. అంతేగాని ఆడంబరమూ భజంత్రీలూ హంగూ ఆర్భాటం అనవసర ఖర్చుకాదూ. అంచేత వాళ్లు పెళ్లి ఖర్చు పెట్టుకోనన్నారని ఇదవ్వొద్దు. పెళ్లికి ఒప్పుకున్నందుకు సంతోషించు''

"సరే... నా అదృష్టంకొద్దీ అన్నీ అర్థం చేసుకుని సర్దుకుపోయే వాడివి దొరికేవు గనుక సరిపోయింది. లేకపోతే...?"

"అలాటి వూహలు అనవసరం. పెళ్లెప్పుడు చేసుకుందాం చెప్పు"

"నీ ఇష్టం. నీకంటే నాకెక్కువ తెలుసా ఏం? నా బదులు నువ్వెళ్లి మావాళ్లని కలిసి ఒప్పించినందుకు నీ ఋణం ఎలా తీర్చుకోను?"

"నీ ముద్దుల్తో" అంటూ ఆమెని అమాంతం మీదకి లాక్కున్నాడు.

"ఎవరైనా వస్తారు..."

"ఎప్పుడో గడియపెట్టేశాన్లే"

"మరీ ఇంత తొందరా?"

"కళ్లెదుట రసగుల్లా వుంటే నోరూరదా?"

ఆ పైన మాటల్లేవు.

★ ★ ★

అర్జంటుగా మాట్లాడాలి. ఇంకో అరగంటలో పార్కుకొస్తాను'' ఫోన్ చేసి అడిగాడు శ్రీను.

"నా స్కూటర్ సర్వీసింగ్‌కిచ్చాను'' అంది హర్ష.

"పోనీ నేనొచ్చి పికప్ చేసుకోనా?"

"వద్దొద్దులే. నేను రిక్షాలో వచ్చేస్తాన్లే"

మేనేజరు దగ్గర పర్మిషన్ తీసుకుని పార్కుకెళ్లింది. అప్పటికే శ్రీను వచ్చివున్నాడు.

"ఇక్కడికి ముప్పై కిలోమీటర్ల దూరంలో వున్న కోదండరామాలయంలో మన పెళ్లికి ఏర్పాట్లు చేశాను. రాముడంటే నీకు భక్తి కదా. అందుకే అక్కడ ఫిక్స్ చేశాను. ఆ దేవాలయం కూడా ఫేమస్‌లే. ఎల్లుండే ముహూర్తం"

"మన పెళ్లికి మీ వాళ్లేమన్నారు? అంగీకరించారా?"

"షరా మామూలే. బంగారు నాణేల సంచి చేజారిపోతోంటే ఎవరు చూస్తూ వూరుకుంటారు? లక్షల కట్నం పోయిందన్న బాధతో ఎగిరారు. నిన్నూ నన్నూ తిట్టారు. శపించారు. అయినా నేను గట్టిగా నిలబడేసరికి నీ ఇష్టం వచ్చినట్లు అఘోరించు అన్నారు. మా అమ్మ సపోర్టు మాత్రం లభించిందిలే. ఎలాగోలా మా నాన్నని ఒప్పించి పెళ్లి నాటికి తీసుకురావచ్చనుకుంటున్నాను. లెటజ్‌జీ''

"మీ వాళ్లూ లేక మా వాళ్లూ లేక...!"

"డోంట్‌బీ సిల్లీ. వాళ్లకి డబ్బు ముఖ్యం. మనకి ప్రేమలూ మనస్సులూ ముఖ్యం. అంచేతే యువత వృద్ధ తరాన్ని జానేదేవ్ అంటోంది. మనది టేకిట్ ఈజీ పాలసీ. డోంట్‌వర్రీ ముస్తాఫా అనే వయస్సు మనది''

"కానిది పెళ్లి. నూరేళ్ల బంధం. పోనీ మనిద్దరి తరపునా పెద్దదిక్కుగా రామలింగయ్యగార్ని పిలుద్దాం"

"ప్రాక్టీసులేని ముసలి ప్లీడరు అల్లు రామలింగయ్యనా?" హేళనగా నవ్వేడు.

"అలాగనొద్దు శ్రీనూ. ప్లీజ్... పాపం ముసలాయన చాలా మంచివాడు. నన్ను

కన్నకూతుర్లా చూస్తుంటాడు''

"అది నిజమే కావచ్చుగాని ఈ ముసలో ళ్లు వట్టి చాదస్తపు మొగుళ్లు. అందుకని అంటున్నాను. సరేలే అలాగే ఆహ్వాని ద్దాంలే''

"వెడ్డింగ్ కార్డ్స్ ఎప్పుడు ప్రింటు చేయి ద్దాం? మన ఫోటోలు వేయించి సరదాగా డిజైన్ చేయిద్దాం. మా బ్యాంక్ ఫైనాన్స్ చేసిన ఆఫ్‌సెట్ ప్రెస్‌లో వేయిద్దాం. కన్సెషన్ ఇస్తారు''

"**ఎల్లుండి** పెళ్లైతే ఇప్పుడు కార్డ్స్ ప్రింటు చేయిస్తావా? భలేదానివే. పెళ్లికి ముఖ్యమైన వాళ్లని పిలుద్దాం. అయినవాళ్లు రానప్పుడు ఆడంబరంగా అందర్నీ పిలిచి చేసుకోవడం నాకిష్టంలేదు. తర్వాత హెూటల్లో రిసెప్షన్ గ్రాండ్‌గా అరేంజ్ చేసి కార్డ్స్ పంచి అందర్నీ ఆహ్వానిద్దాం"

ఆమె మోములో అసంతృప్తి నీడలు కది లాయి.

"అందరి ఆడపిల్లల్లానే నువ్వూ రంగ రంగవైభోగంగా ముత్యాల పందిరిలో పెళ్లి చేసుకోవాలని ఆశించడం తప్పుకాదు. కాని అటు నీవాళ్లూ ఇటు నావాళ్లూ లేకుండా చేసుకుంటున్న పెళ్లి ఇది. దీన్నెంతో ఆడంబ రంగా అట్టహాసంగా చేసుకోవడం మర్యాదకా దు. మంచిదీకాదు. వాళ్లెలాటి వాళ్లైనా కావ చ్చుగాక. వాళ్ల గురించి నలుగురూ చెడుగా అనుకోవడం నేను భరించలేను. అది మనకి క్షేమమూకాదు''

"నేనంతదూరం ఆలోచించలేదు. నీ దూ రదృష్టి చూస్తోంటే నాకాశ్చర్యమేస్తోంది. అసలున్నువ్వు సరిగ్గా ట్రైచెయ్యలేదుగాని ఐఏయస్ కాదగిన అర్హతలన్నీ నీకున్నాయి''

"ఏమో! నువ్వొచ్చిన వేళావిశేషంవల్ల ఐఏయస్‌కి సెలక్టవుతానేమో!"

"ఓకే నీ తెలివితేటలు ఓ ప్రైవేటు కంపె నీలో మ్రగ్గిపోకూడదు. మనం సీరియస్‌గా ప్రయత్నిద్దాం. నీక్కావాల్సిన మెటీరియల్ సేకరించి నోట్సు ప్రిపేర్ చేస్తాను. నీకన్ని రకాల సౌకర్యాల్నీ అమరుస్తాను. ఛా లెంజింగా తీసుకుని సివిల్స్ రాద్దువుగాని''

"నీ సాహచర్యం, ప్రోత్సాహంవుంటే ఏమైనా సాధిస్తాను'' ధీమాగా అన్నాడు.

"స్త్రీ తలచుకుంటే పురుషుడ్ని విజయప థంలో నడిపించగలదని ఋజువుచేస్తాను''

"వెల్కం" నవ్వుతూ లేచాడు శ్రీను.

హర్షకి చాలా సంతోషంగా, చెప్పలేనంత ఆనందంగా వుంది. నిజానికామె ఆనందపు తేరుమీద తేలిపోతోంది.

"మీ అల్లు రామలింగయ్యని ఇప్పుడే కలుద్దామా?"

"ఇప్పుడైతేనే మంచిది. క్లయింట్సు కూడా వుండరు''

శ్రీను స్కూటర్ మీద ఇద్దరూ రామలింగ య్య గారింటికెళ్లారు.

అది చూసి బుగ్గలు నొక్కుకుంది కామే శ్వరి.

ఆమెచూపులు, ప్రశ్నల్ని ఖాతరు చెయ్య కుండా తిన్నగా ఆఫీసురూములోకి తీసుకె ళ్లింది హర్ష.

"మీతో చిన్న పనుండి వచ్చాం బాబాయి గారూ''

"అలాగా కూర్చోండి. ఇతను..."

"నా పేరు శ్రీనివాసండి. విజేతా హౌసింగ్ అండ్ రియల్ ఎస్టేట్స్‌లో డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నాను. హర్షా నేనూ ప్రేమించుకున్నాం. మీ ఆశీర్వాదంతో పెళ్లిచే సుకోవాలని మా సంకల్పం"

"కాని పెద్దవాళ్లు..."

"పిల్లల ప్రేమల్ని ఏ కాలంలో ఏ పెద్దలు ఆమోదించారు చెప్పండి?"

"మరైతే ఎవరూ ఒప్పుకోకుండానే మీ అంతట మీరు..."

"ఇద్దరం మేజర్లమేలెండి. ఎల్లుండి ఉదయం కోదండరామాలయంలో పెళ్లి. టా





క్నీ ఏర్పాటు చేస్తున్నాం. మీరు తప్పక వచ్చి ఆశీర్వదించాలి'' చేతులు జోడించి లేచాడు శ్రీను.

ఏవేవో అడగాలనుకున్నారాయన. కాని వాళ్లా అవకాశం ఇవ్వలేదు.

కట్టె కొట్టె తెచ్చె అన్నట్లుగా శ్రీను చెప్పడమూ హర్షకి రుచించలేదు. అయినా ఏమీ అనకుండా తనూ లేచింది. వెళ్తూ కామేశ్వరికి కూడా పెళ్లి సంగతి చెప్పింది.

ఆవిడ ఆశ్చర్యచకితురాలై చూస్తుండిపోయింది.

పెళ్లి పనులు చూడాలని వెళ్లిపోయాడు శ్రీను.

తన పోర్షన్లోకెళ్లింది హర్ష.

మరి కాస్సేపటికి "అమ్మాయ్'' అంటూ వచ్చారు రామలింగయ్యగారు.

"మీరా బాబాయిగారూ. రండి రండి''

"పెద్దవాణ్ని నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెప్పాలనొచ్చాను. నువ్వు తొందరపడుతున్నావేమో అన్పిస్తోందమ్మా''

"ఏ విషయంలో బాబాయిగారూ''

"పెళ్లి విషయంలోనేనమ్మా. పెళ్లంటే నూరేళ్ల బతుకు. నిండు జీవితం. ప్రతివ్యక్తి జీవిత గమనాన్ని నిర్దేశించేది పెళ్లేనమ్మా. సుఖం దుఃఖం, బరువు బాధ్యత, ప్రేమ మమకారం వగైరాలన్నీ పెళ్లితో ముడివడి వున్నాయితల్లీ. అతడేమిటో, అతడి కుటుంబ వివరాలేమిటో, బ్యాక్‌గ్రౌండ్ ఏమిటో, ఎలాటివాడో తెలుసుకోవాలి. తరచి చూడాలి. మీ అన్నయ్యలని కూడా పిలిచి అన్ని వివరాలూ కూలంకషంగా మాట్లాడుకోవాలి. ఆ తర్వాత ముహూర్తం సంగతి ఆలోచిస్తే బాగుంటుందమ్మా''

"శ్రీను వెళ్లి మా అన్నయ్యలని కలిసొచ్చాడు బాబాయిగారూ! వారికి మా పెళ్లి ఇష్టమేనన్నారు. చెల్లి పెళ్లి చెయ్యలేకపోయారని నలుగురూ వూస్తారని మొహం చాటేస్తున్నారు''

"పోనీ వివరాలు చెప్పమ్మా. అబ్బాయి మంచిచెడ్డలూ కుటుంబ గౌరవసాంప్రదాయాలూ విచారిస్తాను''

"ఆ అవసరం లేదు బాబాయిగారూ శ్రీను గురించి నాకు బాగా తెలుసు. నాకు పెళ్లి కాదేమోనని భయపడుతోంటే ఆపద్బాంధవుళ్లా వచ్చాడు. ఈరకంగా నా బరువు దిగిపోతున్నందుకు తోడబుట్టినవాళ్లు చంకలు కొట్టుకుంటున్నారు''

"వాళ్ల ఫోన్ నెంబర్లియ్యమ్మా నేను మాట్లాడతాను. ఎంత ఐదైనా రక్తసంబంధాన్నీ బాధ్యతల్నీ ఎలా కాదనగలరో చూస్తాను''

"మళ్లీ అవన్నీ తిరగతోడడం ఇష్టంలేదు బాబాయిగారూ. నేనేమిటో నా స్థితేమిటో మీరు గ్రహించే వుంటారు. అదంతా మరచి అతడి గురించేవో ఎంక్వైరీలు చెయ్యడం న్యాయమంటారా చెప్పండి. లక్షల కట్నం కాదని అయినవాళ్లని ఎదిరించి ప్రేమకావాలంటూ నాకోసం దేవుళ్లా వచ్చిన శ్రీనుని అనుమానించడం అమానుషం కాదంటారా బాబాయ్?"

"అతణ్ని అనుమానించడం కాదమ్మా. కీడెంచి మేలెంచమన్నారు. అందుకని మంచి చెడ్డలు తెలుసుకోవడంలో తప్పులేదు. పెళ్లిలో ఏడు తరాల చరిత్ర చూడాలన్నారు. అందుకని''

"అవన్నీ చూసే చేశారు మీ అమ్మాయి పెళ్లి. ఇప్పుడేమయ్యిందామె కాపురం బాబాయిగారూ?" ఆయన ధోరణి, విసుగూ కోపం తెప్పించగా రోషమొచ్చి వ్యంగ్యంగా అంది హర్ష.

ఆయన మరి మాట్లాడలేకపోయారు.

బాధతో కమిలిన మొహంతో జాలిగా చూశారు.

"అలా కాకూడదనేనమ్మా నా తాపత్రయం" అని గొణుక్కుంటూ వెళ్లిపోయారు.

తన క్షేమం కోరి సలహా ఇవ్వడానికి,

సాయపడ్డానికి వస్తే చురకత్తిక్కోతల్లాంటి మాటల్తో బాధపెట్టేనన్పించింది హర్షకి.

తొందరపాటుగా వ్యవహరించి మాట తూలినందుకు బాధపడింది. నొప్పించినందుకు పశ్చాత్తాపపడింది.

పిమ్మట అదంతా మర్చిపోయి పెళ్లి దుస్తుల గొడవలో పడిపోయింది.



**జా**నకీ సమేత కోదండరాముడి సాక్షిగా హర్షా, శ్రీనూ దంపతులయ్యారు.

రామలింగయ్య దంపతులూ, సరిత దంపతులూ, బ్యాంక్ మేనేజరూ, మరో ఇద్దరు స్టాఫ్, శ్రీను మిత్రుల్లో అయిదుగురూ వచ్చి వధూవరుల్ని ఆశీర్వదించారు.

టౌన్లోని త్రీస్టార్ హెూటల్లో ఏసీ సూట్ ఫస్ట్‌నైట్‌కోసం బుక్ చేశాడు శ్రీను.

పూలు, పళ్లు, బట్టలు తీసుకుని ఇద్దరూ హెూటల్‌కెళ్లారు.

మల్లెపూల బుట్ట మంచంమీద దిమ్మరించాడు. ఆమెని ఎత్తేసి గిరగిరా తిప్పేశాడు.

"కాస్త గుర్రాన్ని కట్టెయ్యండి మరి"

"ఇక కళ్లేలు వెయ్యాల్సిన పనేలేదోయ్. మనక్కావాల్సినంత ఏకాంతం, మనల్ని వేలెత్తి చూపలేని లైసెన్సూ మన స్వంతమయ్యాయి"

"ఇవాళ మన శోభనం రోజు. తెల్లచీర పాలగ్లాసు ఎలాగూలేవు. కనీసం కాస్సేపు సిగ్గుపడనివ్వండి"

"ఆడపిల్ల పెళ్లిచూపుల్లో చూపువాల్చి, పెళ్లిరోజున తలవాల్చి, శోభనపుగదిలో తనువు వాల్చుతుందిట. కాని మనదంతా రివర్స్‌కదా!" నవ్వేడు.

చిన్నబుచ్చుకుందామె.

"సారీ డియర్! సరదాగా జోక్ చేశాను"

"సీతారాముల జంట మనకాదర్శమని ప్రమాణం చేసుకుందామండీ"

"ప్రమోదాల టైంలో ప్రమాణాలేవిటోయ్. నీకో సంగతి తెలుసా? లోకంలోవున్న ఏ జంట అయినా సరే అయిదు విధాలైన దంపతుల్లో ఒకటిగా వుండితీరుతుందిట. ఆ దంపతుల్లో మీ సీతారాముల్లేరు మరి"

"అదేమిటి? ఆ దంపతులెవరు?"

"లక్ష్మీనారాయణులు, గౌరీశంకరులు, సరస్వతీబ్రహ్మలు, ఛాయాసూర్యులు, రోహిణీచంద్రులు"

"వారిలో సీతారాముల్లేకపోవడం ఏమిటి?"

"వారు కాపురం చేసింది తక్కువా, కష్టాలు పడింది ఎక్కువానూ"

ఎంతో నీరసం ఆవరించగా డీలా పడిపోయింది హర్ష.

"అందుకే పడకగదిలో పురాణాలు విప్పుకోకూడదు, పురాణాలు చెప్పుకోకూడదు తెలుసా?"

ఆమె మాట్లాడలేదు. ఏదో చేదు మింగినట్టుగా వుంది మనస్సు. అతడి ప్రవర్తనలో, మాటలో కూడా ఇదివరకటి లాలిత్యం కరువైనట్టుగా అన్పించింది.

"కాలం కరిగిపోతోందోయ్. కమాన్ క్విక్"

"నైటీ తొడుక్కుంటాను"

"ఏమీ తొడుక్కోకపోతేనే ముద్దోయ్ భా





మామణీ' అంటూ చుట్టేసి వుక్కిరిబిక్కిరి చేసేశాడు.

★ ★ ★

"నేనా పోర్షన్ ఖాళీ చేసేసి ఇక్కడికొచ్చేస్తాను. ఈ ఇల్లే కన్వీనియంట్‌గా వుంది'' అన్నాడు శ్రీను.

"స్వాగతం... రెండు అద్దెలు దండుగ అని నేనే చెబుదామనుకుంటున్నాను'' అంది హర్ష.

ఆ సాయంత్రమే సూట్‌కేస్ స్కూటర్ మీదపెట్టుకుని వచ్చేశాడు.

దాన్లో బట్టలు తప్ప మరేం లేకపోయేసరికి విస్తుబోయిందామె.

"బ్రహ్మచారి సామాన్లంటే ఇలాగే వుంటాయి'' ఆమె భావం అర్థంకాగా అన్నాడు.

"కనీసం బెడ్ కూడా లేకుండా''

"కొంటేకదా వుండటానికి! ఇంటివాళ్ల మంచం, కుర్చీ వగైరాలుంటే వాటితోనే కాలక్షేపం చేసేశానిన్నాళ్లూ ఇకనుంచి మన సంసారానిక్కావాల్సినవన్నీ త్వరత్వరగా అమర్చేసుకోవాలి. చూసిన వాళ్లంతా ఈర్ష్య పడేలా వుండాలి మన ఇల్లు''

"ముఖ్యమైనవన్నీ వున్నాయి. ఫ్రిజ్, సోఫాల్లాంటివి కొంటేచాలు''

"అన్నీ కొనేద్దాం. నిన్ను మహారాణిలా చూసుకోవడమే నా ప్రథమ మరియు ముఖ్య కర్తవ్యం"

"ఈ సిగరెట్ పెట్టె మీ జేబులోకెలా వచ్చింది?" చిలక్కొయ్యకి తగిలించిన ఫాంటులోంచి తొంగిచూస్తోన్న పెట్టెని చూపిస్తూ అడిగింది.

"నాదేనోయ్''

"మీరు సిగరెట్లు కాలుస్తారా?" అప్రతిభురాలై అడిగింది.

"అప్పుడప్పుడూ... మరీ సరదాగా వున్నప్పుడు కాలుస్తాన్లే''

"నేను నమ్మలేకపోతున్నాను'' డీలాపడి కూర్చుంటూ అంది.

"టేకిట్ ఈజీ. మగతనానికి చిహ్నం మా బ్రాండ్ సిగరెట్ కాల్చడం అని టీవీ యాడ్స్‌లో వూదరగొడుతున్నారు కదోయ్''

మురిపెంగా నవ్వేస్తూ అంది, "సరేలెండి ఇక ఇలాటివాటి జోలికి పోవద్దు''

"యస్ మేడం"

"అదిగో అలా పిలిస్తే వూరుకోను. పేరుపెట్టి పిలవండి చాలు''

"ఓకే ఓకే... ఇకనుంచి హోమ్ రూలన్నమాట!"

గట్టిగా నవ్వేసిందామె.

శృతికలిపాడు శ్రీను.

మర్నాడు నిర్మాణంలో వున్న అపార్ట్‌మెంట్స్‌కి తీసుకెళ్లాడామెని శ్రీను.

"ఇదిగో ఇదే నీ అపార్ట్‌మెంటు. ఈశాన్యపు ఫ్లాట్''

"నా అపార్ట్‌మెంటు అంటారేమిటి మనది అనండి''

"అలా అంటే అప్పిచ్చిన మీ బ్యాంకువాళ్లు గోల చేస్తారేమో''

"చేస్తే చెయ్యనీ, వాళ్లక్కావాల్సింది కాగితాలేకదా. అందులో నా పేరుంది గనుక వాళ్లింకేమనగలరు? కాని నిజానికిది మన ఇద్దరిదీనూ''

"వాస్తు బాగుందికదూ. కన్‌స్ట్రక్షన్లో కూడా తేడావుంది. నాది అని మా వాళ్లు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు''

చుట్టూ తిరిగి చూస్తూ అంది, "ప్లాన్ బావుంది. గాలీ వెలుతురూ బాగా వస్తాయి. సాయంత్రంవేళ ఈ బాల్కనీలో కుర్చీలేసుక్కూర్చుని హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు. పక్కింటి వారి వేపగాలి పీల్చొచ్చు. చాలా ఆహ్లాదంగా వుంది కదూ''

"అవును... పిల్లలు తొంగి చూస్తే పడిపోయే ప్రమాదం వుందికదా. అందుకని స్పెషల్‌గా చెప్పి పిట్టగోడ కొంచెం ఎత్తుగా కట్టిస్తు



న్నాను''

"నువ్వు తీసుకుంటున్న శ్రద్ధకి నాకెంత ఆనందంగా వుందో చెప్పలేను. నీ తెలివితేట లు అమోఘం శ్రీనూ. వచ్చే నెలలో ఐఏయస్‌కి నోటిఫికేషన్ వస్తుందిట. ఇక ఇతర వ్యాపకాలు తగ్గించుకుని ప్రిపరేషన్ మొదలుపెట్టాలి. అవసరమైతే హైదరాబా దులో కోచింగ్ కూడా తీసుకుందువుగాని''

"ఓకే... అద్సరేగాని నా మాట నమ్మి హౌసింగ్ లోను తీసుకున్నందుకు రిగ్రెట్స్ లేవుకదా''

"ఛ, అవేం మాటలు. అయామ్ ప్రౌడాఫ్ యూ. ఇంత చక్కని పోష్ లొకాలిటీలో ఇంత మంచి బిల్డింగులో మనకి అపార్ట్ మెంట్ వున్నందుకు చాలా గర్వంగా వుంది. ఇంకొన్ని నెలల్లో మన స్వంత ఇంట్లోకి మారబోతున్నామన్న వూహే మధురానుభూ తిని కలిగిస్తోంది. ఆనందంతో వుక్కిరిబి క్కిరి చేస్తోందనుకో''

"నీ కాన్ఫిడెన్స్ గెలుచుకోవడం నా అదృ ష్టం"

"మన అపార్ట్‌మెంటుని చూసిన సంబరా న్ని సెలబ్రేట్ చేసుకుందాం. హొటల్లో భోంచేసి వెళ్దాం"

"హర్షమాట నాకు వేదవాక్కు''

"ష్... ఎవరైనా వింటే భార్యా విధేయుడ నుకుంటారు''

"వాళ్లనుకునేదేమిటి నేనే చెప్పేస్తాను. తె లివైన భార్య లభించినవాడు తన గురించీ ఇంటి గురించీ మరచిపోయినా ఫర్లేదు. అన్నీ చక్కదిద్దుతుంది ఇల్లాలు. అలాటప్పుడు భార్యా విధేయుడైతే తప్పేంటి? భార్యా దా సుడంటే నష్టమేంటి?"

"తప్పైపోయింది. లెంపలేసుకుంటున్నా ను గాని పద"

హొటల్లో భోంచేసి ఇంటికి తిరిగి వచ్చే రు.

బ్రీఫ్‌కేసులోని కేపిటల్ మార్కెట్‌కి సంబంధించిన కొన్ని మాగజైన్లూ, పేపర్లూ తీసి అందులో మునిగిపోయాడు శ్రీను.

మరోపక్క సిగరెట్లు బూడిదైపోతు న్నాయి. ఆ అలవాటు మానెయ్యమని చెప్పి చెప్పి విసిగిపోయింది హర్ష.

"ఏమిటీవాళ షేర్ మార్కెట్ మీద దాడి చేశారు?"

"ఇన్వెస్ట్ చేద్దామనీ''

"ఇప్పుడా? షేర్ మార్కెట్ కుప్పకూలిపో యిందిగా''

"అవున్నిజమే. సిగరెట్లూ బీడీల రేట్లకి షేర్లు వచ్చేస్తున్నాయి. కాని అతి త్వరలో మార్కెట్ పుంజుకోబోతోంది. వచ్చే బడ్జె ట్‌లో ప్రభుత్వం చాలా ఫేవరబుల్ డెసిషన్స్ తీసుకోబోతోంది. విదేశీ సంస్థలు కూడా భారీ ఎత్తున పెట్టుబళ్లు పెడుతున్నాయి. కొద్ది నెలల్లోనే బూమ్‌వచ్చి తీరుతుంది. ఫండ మెంటల్స్ బలంగా వున్న షేర్స్‌లో పెట్టుబడి పెడితే నాలుగు నెలల్లో నాలుగొందల పె ర్సంట్ లాభం కళ్లజూడొచ్చు''

"షేర్ బిజినెస్ జూదంలాంటిది. అదంటే నాకు ఎలర్జీ''

"ఎలర్జీకాదు, ఎనర్జీ అన్పిస్తాను చూడు. నా దగ్గర ముప్ఫై వేలున్నాయి. నీ దగ్గర పాతిక ముప్ఫైవేలు సేవింగ్స్ వుంటే చూడు మంచి షేర్స్‌లో ఇన్వెస్ట్ చేస్తాను. నీ సొమ్ము కి నాదీ హామీ''

"హామీ గురించి కాదుగాని రిస్కేమో?"

"రిస్కులేకుండా బిజినెస్ వుండదు. ఎక్కువ లాభాన్ని ఆశించినప్పుడు ఎక్కువ రిస్కు తీసుకోడానికి సిద్ధపడాలి''

"ఫిక్సెడ్ డిపాజిట్లలోనూ నా ఎక్కౌంటు లోనూ కలిపి ముప్ఫై వేలదాకా వుండొచ్చు. ఒక అయిదువేలు వుంచి మిగతాది తెస్తా న్లెండి''

"దట్స్‌గుడ్. నువ్వు నన్ను ఐఏయస్ ఆఫీసర్ని చెయ్యాలనుకుంటున్నావు. నేన్ని




న్ను దేనికీ లోటులేని మహారాణిని చెయ్యాల నుకుంటున్నాను. గెలుపెవరిదో చూద్దాం"

"ఇద్దరిదీ కావాలని నా ఆశ"

★ ★ ★

"అమ్మాయ్'' అంటూ వచ్చారు రామలింగయ్యగారు.

"మీరా బాబాయిగారూ. రండి... కూర్చోండి'' ఆహ్వానించింది.

"అబ్బాయి ఏమంటున్నాడమ్మా. పాలూ నీళ్లలా కలిసిపోయారుకదా''

"దేవుని దయవల్ల చిలకా గోరింకల్లా వున్నాం బాబాయిగారూ. ఆయన చాలా తెలివైనవారు. అయ్యేయస్‌కి తయారవుతానంటున్నారు''

"చాలా సంతోషమమ్మా'' అన్నారు ఆనందభాష్పాలు రాలుస్తూ.

వద్దంటున్నా వినకుండా టీ పెట్టి తెచ్చిఇచ్చింది.

"కోపాలూ తాపాలూ పంతాలూ పట్టింపులూ మంచులాంటివమ్మా. ఎక్కువకాలం వుండవు. అయినా తెంచుకుందామంటే తెగిపోతాయా చెప్పు రక్త సంబంధాలు?"

విషయం లీలగా అర్థమైందామెకి. అన్నగార్లు ఆయనకి ఫోన్ చేసి ఏదో చెప్పి వుంటారనుకుంది.

"మేం అక్కర్లేదన్న వాళ్లని మేం మాత్రం ఎందుకు పట్టించుకోవాలి బాబాయిగారూ?"

"అలా అనుకుంటే బంధుత్వాలకి అర్థం ఏముంటుంది చెప్పు. కాదనుకున్నంతమాత్రాన కాకుండా పోదుకదా. అతడి తరపువాళ్లు తొంగి చూడలేదింతవరకూ. కనీసం మీ వాళ్లతోనైనా సఖ్యంగా వుంటే కొండంత అండగా వుంటారు''

"వాళ్ల అండ మాకేం అక్కర్లేదు. మా పెళ్లి గురించి రాయను కూడా లేదు''

"హర్షా!"

"నిజమే బాబాయిగారూ. నేను కావాలనుకుంటే వాళ్లేవస్తారు''

"చాలా పొరబాటు చేస్తున్నావమ్మా. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. జరిగిందంతా వివరించి రాయి. పెద్ద మనస్సుతో ఆలోచించి ఆశీర్వదిస్తారు''

"నేను రాయదల్చుకోలేదు''

"అమ్మాయ్!" నిస్సహాయంగా చూశారు.

"నాకింకా పెళ్లి కాలేదనుకుని ఏదో సంబంధం చూస్తున్నామంటూ పెద్దన్నయ్య ఉత్తరం రాశాడు. ఇవాళే వచ్చింది'' నవ్విందామె.

"ఇంకా ఆలస్యం చేస్తే నవ్వుల పాలవుతారు. వెంటనే రాసెయ్యమ్మా''

"అవ్వనీండి. అప్పుడుగాని వాళ్లకి తెలిసిరాదు''

వెర్రిగా చూశారు. తలగోక్కున్నారు. "ఏమిటో ఈ కాలం పిల్లలు తాము పట్టిన కుందేటికి మూడే కాళ్లంటారుకదా! ఇంకోసారి ఆలోచించి చూడమ్మా'' అంటూ లేచారు.

"ఇంక ఆ సంగతీ వాళ్ల సంగతీ ఆలోచించను బాబాయిగారూ. ఇందిర కాపురం ఏమైనా దార్లో పడేట్టుందా బాబాయిగారూ''

"ఏదీ కలిసిరావట్లేదమ్మా. కొన్నాళ్ళాగితే వేడి చల్లారుతుందికదా అని చూస్తున్నాం"

"ఇందిర ఏమంటోంది?"

"ఉద్యోగం చేస్తానంటోంది. ప్రైవేటు కాలేజీలో లెక్చరర్ పోస్టుకి ప్రయత్నిస్తున్నాం. వస్తానమ్మా. నాది చాదస్తం అనుకో మరోటనుకోగాని నా మాటల గురించి కొంచెం ఆలోచించమ్మా. రక్తం చాలా చిక్కనని మర్చిపోకు''

★ ★ ★

శ్రీనులో చాలా మార్పు కన్పిస్తోంది హర్షకి.

అతడు మొదట్లోలా సరదాగా జోవియల్



గా వుండట్లేదు. అక్కడికీ ఇక్కడికీ తిప్పటంలేదు. వారానికి నాలుగైదురోజులు కేంప్స్ అంటూ వెళ్ళిపోతున్నాడు. అతడి జీతమేమీ ఇంట్లో ఇవ్వటం లేదుగాని తన జీతంలోంచి కొంత తీసుకుని మరీ వాడేస్తున్నాడు.

ఇదివరకు మైసూర్ శాండల్ సబ్బులా

ఎప్పుడూ ఫ్రెష్‌గా వుండేవాడు. ఇప్పుడు దుస్తుల గురించీ గెడ్డం గురించీ పెద్దగా పట్టించుకోవట్లేదు. మాసిన బట్టల్తోనే తిరిగే స్తున్నాడు.

ఈమధ్య ఖర్చుకి బాగా అలవాటు పడ్డాడని అనుమానించకుండా వుండలేకపోతోంది.

అవన్నీ ముఖాముఖీ మాట్లాడదామంటే అసలా అవకాశమే ఇవ్వట్లేదు. ఇంట్లో వున్నంతసేపూ హడావిడిగానే వుంటున్నాడు.

ఆమధ్య "గుడ్లన్నీ ఒకే బుట్టలో పెట్టకూడదు. అలాగే మన సేవింగ్స్‌ని కూడా అన్నిటిమీదా వుంచాలి. హౌస్‌మీదా, షేర్స్ మీదా ఇన్వెస్ట్ చేశాం. పెరుగుదల చాలా బావుంది. ఈసారి టేకువృక్షాల పథకంమీద పెడదాం. ఆరేళ్లలో అసలూ మరో ఆరేళ్లలో లాభమూ వస్తాయి. అంతేకాదు. ఆ తర్వాతింకో ఎనిమిదేళ్లకి పెట్టుబడికి యాభైరెట్లు ప్రతిఫలం లభిస్తుంది'' అన్నాడు.



వాటి తాలూకు బ్రోచర్లు చూపించాడు. లెక్కలేసి చూపాడు.

"బాగానే వుండేట్టుందిగానీ ప్రస్తుతం మన దగ్గర డబ్బులేదుకదా'' అంది.

"మీ బ్యాంక్‌లో కన్స్యూమర్ లోన్ తీసుకో. ఫ్రిడ్జ్ తర్వాత కొనుక్కోవచ్చులే. ముందు మనకి పుట్టబోయే బిడ్డలకి మంచి భవిష్యత్తు నివ్వడానికి ప్లాన్ చెయ్యాలి. ఏవో హౌస్ హెూల్డ్ సరుకులు కొంటున్నట్టు రాసి లోన్ తీసుకో'' అన్నాడు శ్రీను.

అలాగే చేసి డబ్బు తెచ్చిచ్చింది.

తర్వాత 'బంగారునగల పథకం' అత్యద్భుతం అంటే పీయఫ్‌లోన్ తీసుకుని ఇచ్చింది.

అవన్నీ గుర్తురాగా నిట్టూర్చింది హర్ష.

"కాస్త ఎక్కువ వడ్డీ అయినా ఫర్లేదు. క్లీన్‌లోన్ పదివేలు తీసుకునిరా'' అని మరీ మరీ చెప్పెళ్ళాడు.

అందుకనే ఇంతగా ఆలోచిస్తోంది. అక్కడికీ వడ్డీ ఎక్కువని నిరుత్సాహపరచాలని చూసిందిగాని అతడు విన్లేదు. మనకి అంతకంటే ఎక్కువ రిటర్న్ వస్తున్నప్పుడు అప్పు చేసి మదుపు చెయ్యడంలో తప్పులేదు. అంటూ ఉపన్యాసం ఇచ్చాడు.

మెడలోకి నల్లపూసల తావళం చేయించుకుంటానంది.

"శుద్ధవేస్ట్. తరుగుదల ఎక్కువ. అప్రిసియేషన్ తక్కువ. పైగా సెక్యూరిటీ సమస్య. అసల్నీఅందానికి ఆభరణాల ఆసరా అనవసరం" అని త్రోసిపుచ్చేశాడు.

అన్యమనస్కంగానే క్లీన్ లోన్ అప్లికేషన్ పూర్తిచేస్తోంటే "ఏం చేస్తున్నారు'' అంటూ వచ్చింది సరిత.

అప్లికేషన్ చూసి అంది "మీ హబ్బీ కొంచెం ఖర్చుమనిషనుకుంటాను''

"ఏం అలా అంటున్నావ్?"





"స్టాఫ్ లోన్స్ వివరాలు నన్నిలా అడిగి మీచేతలా పెట్టించేస్తున్నారు!"

"నిజమా!"

"అవును. పెళ్లయ్యాక మీరు తీసుకున్న ఋణాల వివరాలన్నీ నన్నడిగి తెలుసుకున్నవే. నిన్న కూడా మీకింకేం లోన్లు రావా అనడగితే క్లీన్ లోన్ పదివేలవరకూ తీసుకోవచ్చన్నాను. ఇవాళ మీరు అప్లై చేసేస్తున్నారు. కాస్త కళ్ళెం వేస్తే మంచిదేమో ఆలోచించండి''

నిజంగానే ఆలోచనలో పడింది. అప్లికేషన్ని పూర్తి చెయ్యకుండా డ్రాయర్లో పడేసింది.

శ్రీను లోన్సు గురించి తనని సూటిగా అడక్కుండా వాళ్లనీ వీళ్లనీ అడిగి తెలుసుకోవడం ఏవిటసలు? ఎప్పుడైనా కాదు లేదు రాదు అని తను అంటేకదా ఇంకెవర్నైనా అడగాల్సింది?

అతన్లో తనకి తెలీని మరోమనిషి దాక్కుని లేడుకదా?

ఎన్నెన్నో భయాల భూతాలు మీదపడేసరికి సన్నగా కంపించింది. మొదటిసారి తన సేవింగ్స్ ఎంతో సరిగ్గా అంత సొమ్మే షేర్స్‌లో పెట్టడానికి అడిగాడని గుర్తొచ్చింది. నలుగురైదుగుర్ని తీసుకొచ్చి తన స్నేహితులనీ అప్పు ఇప్పించమనీ కోరితే మేనేజరుకి చెప్పి లోన్లు ఇప్పించిన సంగతి కూడా మనస్సులో మెదిలింది.

సరిత మాటల్ని బట్టి చూస్తోంటే తనకి ఏమేం లోన్లు వస్తాయో తెలుసుకుని వాటన్నిట్నీ తను తీసుకునేలా తెలివిగా వ్యూహం పన్నినట్టుగా అన్పిస్తోంది.

ఇదంతా ఒక పథకం ప్రకారం చేస్తున్న పని కాదుకదా?

ఇసుక తుఫాను వచ్చి అంతా పూడ్చేసి శూన్యాన్ని మిగిల్చినట్టుగా అనుభూతి కలిగింది.

నవనాడులూ కృంగిపోతోంటే తలపోటుగా వుందని చెప్పి పర్మిషన్ తీసుకుని ఇంటికెళ్ళింది హర్ష.

ఏదో గుర్తురాగా శ్రీను బట్టలూ పుస్తకాలూ, ఇతర ఫైల్సూ అన్నీ తిరగేసింది. వెదికింది. ఎక్కడా ఎలాంటి సర్టిఫికెట్లుగాని రసీదులుగాని కన్పించలేదు.

అన్నీ అతడు చూసుకుంటున్నాడుకదాని తను పట్టించుకోలేదు.

అవన్నీ నిజంగా ఇన్వెస్ట్ చేశాడా లేక...?!

గాలికి టేబుల్‌మీది పేపర్లు ఎగిరిపడ్డాయి. లేచివెళ్ళి వాటిని సర్దుతూ యథాలాపంగా చూసింది. అయ్యేయస్ పరీక్షకి అప్లికేషన్ అది. దాన్ని తెప్పించి పదిరోజులుపైనే అయ్యింది. రోజూ పోరుతున్నా అశ్రద్ధ చేస్తున్నాడు.

సర్వం కోల్పోయిందాన్లా దిగాలుపడి కూర్చుండిపోయింది.

అంతా అగమ్యగోచరంగా వుంది. అలా అని అతడ్ని మోసగాడంటూ నిందించడానికామె మనసు సిద్ధంగా లేదు. నిజానిజాలు తెలుసుకోకుండా తొందరపడవద్దని హెచ్చరిస్తోంది.

రాత్రి పొద్దుపోయేక వచ్చాడు శ్రీను. నోట్లోంచి బ్రాందీ వాసన గుప్పుమని తగిలింది.

ఆమెకి కన్నీళ్లు పొంగివచ్చాయి. ఈ దురలవాటేమిటని నిలదీయాలన్పించింది కాని నిగ్రహించుకుంది.

"చిన్న పార్టీ వుంది. అందుకని... ఫ్రండ్స్ బలవంతపెట్టారు. ఒక్కసారే. ఇంకెప్పుడూ నో...నో..."

మంచంమీద అడ్డంగా పడి నిద్రపోయాడు. ఆమె కళ్లనుండి కన్నీళ్లు ధారలు గట్టాయి.

ఉదయమే లేచి చకచకా తయారయ్యాడు శ్రీను.

"రాత్రి అసభ్యంగా ప్రవర్తించలేదుకదా'' అనడిగాడు.

మౌనంగా వుండిపోయింది.

హైసొసైటీలో తిరుగుతున్నప్పుడు ఒక్కోసారి అలాటివి తప్పవోయ్. ఎడ్యుకేటెడ్‌వి. నీకు తెలీదేవిటి. పేదవాళ్లు తాగితే తప్పు. పెద్దవాళ్లు తాగితే కల్చర్. అంతేకదూ!" అదోలా నవ్వాడు.

హర్ష మాట్లాడలేదు.

"నీకోపం వచ్చినట్టుంది. సాయంత్రం తీరిగ్గా బ్రతిమాల్తాన్లేగాని ఇప్పుడర్జంటుగా కేంపు వెళ్లాలి. డబ్బియ్యి''

"ఏ డబ్బు''

"నిన్న తీసుకున్న లోన్ తాలూకు పదివేలు''

"తీసుకోలేదు''

"ఏం?" తీవ్రంగా వుందతడి స్వరం.

"లోన్సు ఎక్కువవుతున్నాయని...''

"అంతా నీ ఇష్టమేనా. అర్జంటుగా డబ్బు కావాలని చెప్పేనా లేదా? అవతల నా పరువేం కావాలనుకున్నావ్? నేన్నిమొగుణ్ణే. ఆ సంగతి మర్చిపోకు. నేను గీచిన గీటు దాటకూడదు. నేను డబ్బు తెమ్మంటే తల తాకట్టు పెట్టి అయినాసరే తేవాల్సిందే''

"ఎందుకంత గట్టిగా అరుస్తారు? బాబాయిగారికి విన్పిస్తుంది''

"ఎవరికో విన్పిస్తుందని ఇదవుతావుగాని నా ప్రెస్టేజ్ కుళ్లు కాలువలో కలిసిపోతుందని ఇదవ్వవేంటి? నాకు అర్జంటుగా పదివేలు కావాలి. ఇప్పుడే కావాలి. ఏం చేస్తావో ఎలా తెస్తావో తే''

నివ్వెరపోయి వికృతమృగాన్ని చూసినట్టు చూసింది.

"ఏంటా చూపు? వెళ్లవే. వెళ్ళి ఎక్కడో అక్కడ్నుంచి పట్రా''

"మధ్యాహ్నం లోన్ తీసుకుని..."

"అదేం కుదర్దు. గంట ఆలస్యమైతే చాలు నామాట పోతుంది, పరువు పోతుంది. మాటకి ప్రాణం ఇచ్చే మనిషిని నేను. ఏవిటనుకున్నావో. ఆడదానివి. నీకివన్నీ అర్థం కావులే

గాని డబ్బు అర్జంటుగా కావాలి. దట్సాల్'

"బాబాయిగార్ని అడిగి చూస్తాను..." గుడ్లనీళ్లు కుక్కుకుని అతికష్టంమీదఅంది.

"అడుగుతావో బ్రతిమాల్తావో నాకనవసరం. అయ్ వాంట్ మనీ. ఐ నీడ్ అర్జెంట్లీ'

కళ్లు తుడుచుకుంటూ ప్లీడరుగారింట్లో కెళ్ళింది హర్ష.

శ్రీను అరుపులు విన్పించాయో ఏమో కామేశ్వరి అదోలా చూసింది.

చూపులు దించుకుని రామలింగయ్యగారి దగ్గరికెళ్ళింది.

"అబ్బాయి కొంచెం కోపంమీద వున్నట్టున్నాడు..."

"అవును బాబాయిగారూ..."

"ఎనీ ప్రోబ్లం?" ఆత్రంగా అడిగారు.

"అహ. ప్రోబ్లంకాదు. డబ్బు అవసరమైంది. వాళ్లమ్మగారికి ఒంట్లో బాగోలేదుట. అర్జంటుగా డబ్బు పంపాలని కూర్చున్నారు..."

"తల్లికోసం తపిస్తున్నాడంటే అభినందించాల్సిందే. ఎంత కావాలిట"

"పదివేలు... సాయంత్రానికి తెచ్చిస్తాను. లోన్ తీసుకోవాలి..."

"నీ దగ్గర సొమ్ము ఎక్కడికి పోతుందమ్మా''

డబ్బు తెచ్చిచ్చారాయన.

తండ్రిలాంటి ఆయన దగ్గర అబద్ధం చెప్పాల్సొచ్చినందుకు కించపడుతూ వచ్చి డబ్బు శ్రీనుకిచ్చింది.

థాంక్స్ చెప్పలేదు. కనీసం ఒక్కమాట కూడా అన్లేదు.

డబ్బు జేబులో కుక్కుకుని వెళ్ళిపోయాడు.

బ్రాన్పడి చూస్తుండిపోయింది హర్ష!

★ ★ ★

మేనేజరు పిలవడంతో ఆయన కేబిన్లోకెళ్లింది హర్ష.

ఆఫీసర్స్ క్లబ్ సెక్రటరీని పరిచయం చేశారు.

"మీతో ఏదో మాట్లాడాలని వచ్చారు'' అన్నాడాయన అదోలా ముఖం పెట్టుకుని.

బ్యాంకు పనిగురించి కాబోలనుకుని "చెప్పండ్సార్' అంది ఉత్సాహంగా.

"మీవారి ప్రవర్తన ఈమధ్య బావుండటంలేదు. మొన్న తాగొచ్చి నానాగొడవా చేశారు. బలవంతాన బయటికి పంపాల్సొచ్చింది. ఆయన్ని క్లబ్బులోకి రానివ్వొద్దని మిగతావాళ్లు ఒత్తిడి చేస్తున్నారు. క్లబ్బుకి ఆరువేలదాకా బాకీపడ్డారు..."

చెవిపక్కనుంచి మిస్సైల్ దూసుకుపోయినట్టు అదిరిపడింది. కంపిస్తూ పిచ్చిగా గుడ్లప్పగించి చూసింది.

మూడురోజుల క్రితం పదివేలు తీసుకుని కేంపు వెళ్ళినవాడు మొన్న రాత్రి క్లబ్బులో గొడవ చేశాడా? క్లబ్బునుంచి పంపించేస్తే ఇంటికి రాక ఎక్కడికెళ్ళినట్టు? స్నేహితులింటికా? అసలీ క్లబ్బుకి వెళ్ళే అలవాటు ఎప్పుడొచ్చింది? బాకీపడ్డాడంటే రెగ్యులర్ కస్టమరేమో!

తల గిర్రున తిరగసాగింది. కన్నీళ్లు పొంగిరాబోతోంటే పళ్ళ బిగువున నిగ్రహించుకుంది.

"ఆయన్తో మాట్లాడి సర్దుబాటు చేస్తానండి''

ఆయనెళ్లిపోయాడు.

"మీవారికిన్ని బేడ్‌హేబిట్స్ వున్నాయా? బుద్ధిమంతుడనుకున్నానే!" మేనేజర్ అన్నాడు.

"నాకూ ఇప్పుడిప్పుడే ఒక్కొక్కటీ తెలుస్తున్నాయి సార్'

"బీ కేర్‌ఫుల్. కొందరు చేతికి ఈజీగా డబ్బు చిక్కుతోంటే వ్యసనాల పాలవుతూంటారు. ముందే కంట్రోలు చేస్తే బెటర్'

"థాంక్యూ సార్'

అవాళ లంచ్ తీసుకోలేదు హర్ష. సరితా,




శిల్పా వచ్చి పిలిచారు. ఆకలిగా లేదంది. మూడీగా వున్న ఆమెనీ మరి కదిలించలేక వెళ్ళిపోయారు.

ఆ సాయంత్రానికి సన్నగా జ్వరం వచ్చిందామెకి. ఏడుస్తూ ముడుచుకుని పడుకుండిపోయింది. కంటిమీదకి కునుకురాలేదు.

తెల్లారి లేచి కాఫీ కలుపుకుని తాగింది. కాస్త శక్తి రాగా స్నానం చేసింది. కొంచెం రిలీఫ్‌గా అన్పించింది.

శ్రీను వచ్చాడు. ఆమెని చూసి సన్నగా ఈల వేశాడు. మనిషి హుషారుగా వున్నాడు. అయినా ఆమె పలకరించలేదు. తను తెచ్చిన పాకెట్ విప్పి రాధాకృష్ణుల విగ్రహం తీసి ఆమెకందిస్తూ "విష్యూ మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ దడే'' అన్నాడు.

నిర్ఘాంతబోయిందామె.

అవున్నిజంగా అవాళ తన బర్త్‌డేయే. తనే మర్చిపోయింది. కానతడెంతో ప్రేమగా...!

ఆమె కళ్లల్లో కన్నీటిపొర కదిలింది.

"థాంక్స్ శ్రీనూ. బొమ్మ చాలా బాగుంది..." అపురూపంగా చూస్తూ అంది హర్ష.

"రాధకీ కృష్ణుడికీ పెళ్లి కాలేదని మనం అనుకుంటాంగాని నార్త్‌ఇండియాలో అలా అనుకోరు. వాళ్ళకి పెళ్ళైనట్టే పూజిస్తారు. అన్యోన్యతకి మారుపేరుగా భావిస్తారు. ఆత్మ పరమాత్మల అపూర్వ కలయికలా విశ్వసిస్తారు''

మరో పేకెట్టులోని చీర తీసిచ్చాడు.

ఆకాశ నీలంరంగు చీర. తనకెంతో ఇష్టమైన రంగు. బాగా కదలిపోయిందామె. క్లబ్ సంగతీ అతడు రాగానే కడిగిపారెయ్యాలనుకున్న సంగతీ పూర్తిగా మర్చిపోయింది.

"ఇవాళ బ్యాంకుకి సెలవు పెట్టెయ్. గుడికెళ్దాం" అన్నాడు బాత్‌రూంలోకెళ్తూ.

ప్లీడరుగారి ఇంట్లోంచి ఫోన్‌చేసి సెలవు సంగతి చెప్పివచ్చింది హర్ష.

కొత్త చీరకట్టుకుంది. పాయసం చెయ్యగా "నీ చేయిపడితే చాలు ఎలాంటి పదార్థమైనా అమృతం అయిపోతుందనుకో'' అని పొగిడాడు.

చాన్నాళ్ళతర్వాత ఉత్సాహంగా వుంటడమే కాదు సరదాగా కబుర్లు చెప్పాడు. గుడికెళ్లి అర్చన చేయించారు. హోటల్లో భోంచేసి మేట్నీకెళ్ళారు.

క్లబ్ సంగతి అడగాలని రెండు మూడుసార్లు ప్రయత్నించిందిగాని ధైర్యం చెయ్యలేకపోయింది.

"నువ్వు నీ మొగుడ్ని జాగ్రత్తగా కనిపెట్టుకుని చూసుకోవాలోయ్'' అన్నాడు జోక్‌గా అన్నట్టు.

"ఏం? ఇప్పుడేవయ్యిందిట?"

"ఓ యువతి గాలం వేస్తోంది.!"

"మనల్నెవరూ విడతీయలేరు. మనమధ్యకెవరూ రాలేరు. వస్తే భస్మమైపోతారు''

"నువ్వంతటి పతివ్రతవే అనుకో. కానేం చెబుతాం. ఏ బలహీనక్షణంలోనో మీ ఆయన తొందరపడితే..." కొంటెగా కవ్విస్తూ నవ్వాడు.

"కాళ్ళూ చేతులూ విరిచేస్తాను''

"నావా ఆ యువతివా?"

"ఇద్దరివీనూ''

"హతోస్మి! జాగ్రత్తగా వుంటాన్లే''

"ఇంతకీ ఆ యువతెవరు?" అనుమానం తొలుస్తోంటే అడిగింది.

"వదిలేద్దూ..."

"చెప్పండి చెబుతా''

"మీ అల్లురామలింగయ్య కూతురు''

"ఆ అమ్మాయా? నేన్నమ్మను''

"నీ కనుమానం రాకుండా నన్ను బుట్టలో వేసుకుందామని యత్నించడమే ఆమె స్ట్రాటజీ''

"పెళ్లయ్యింది. బిడ్డ వున్నాడు. అలాంటి



ఆమె..."

"ఉప్పుకారం తింటోందికదోయ్''

అదోలా నవ్వాడు. ఒళ్ళంతా చీమలు పాకినట్టు ఫీలయ్యింది హర్ష. అతడు నిజం చెబుతున్నాడో లేక తన అటెన్షన్ని డైవర్ట్ చెయ్యడానికి అబద్ధమాడుతున్నాడో తేల్చుకోలేకపోయింది.

"నీ పుట్టినరోజు పండుగనాడు మూడు పాడు చేసుకోవద్దు. అన్నీ మరచిపోదాం భూమ్మీద మనిద్దరమే వుందామనుకుందాం. స్వేచ్ఛాజీవులమై ఆడమ్ అండ్ ఈవ్‌గా మారి విజృంభించేద్దాం రా డియర్'

ఆమెని బలంగా కౌగిలిలోకి తీసుకున్నాడు.

కొద్దిక్షణాలపాటు వూపిరాడలేదామెకి.

పుట్టినరోజునాడు రభసెందుకనుకుంది. ఆ రాత్రి కూడా అడగలేకపోయింది.

మర్నాడతడు ఆఫీసుకెళ్ళడానికి తయారవుతోంటే, "మొన్న క్లబ్ సెక్రటరీ బ్యాంకుకొచ్చాడు'' అంది.

"ఏడిశాడు. నన్నేమీ అన్లేక నీ దగ్గరికొచ్చి వాగాడా?"

"అసలు మీరు క్లబ్‌కెందుకెళ్ళడం?"

"చూడూ. మగాడికి లక్షపన్లూ సవాలక్ష సంబంధాలు వుంటాయి. అవన్నీ ఆడవాళ్లు పట్టించుకోకూడదు. అప్పుడే మీకు ఆరోగ్యం. మాకు సంతోషం. ఇంటికి శాంతి''

విలాసంగా సిగరెట్ కాలుస్తూ టకటకమని బూటు శబ్దం చేసుకుంటూ వెళ్ళిపోయాడు శ్రీను.

నిట్టూర్చడం మర్చిపోయింది హర్ష!

★ ★ ★

స్వీట్‌బాక్సుతో వచ్చింది ఇందిర.

ఆమెలో కొత్త అందాలు ఆనందాలు చిందులేస్తున్నట్టుగా అన్పించింది హర్షకి. సందేహిస్తూనే ఆహ్వానించింది.





బాక్సు మూత తీసి "స్వీట్ తీసుకోండి'' అంది.

"ఏమిటి విశేషం?"

"ఇవాళ జాబ్‌లో జాయినవుతున్నాను..."

"కాలేజీలో వచ్చిందా?"

"వచ్చింది. టీచింగ్ ప్రొఫెషన్ నాకెంతో ఇష్టం. డాక్టర్ రోజూ ఏడ్పు మొఖాలని చూస్తాడు. టీచర్ ఆనందం తుళ్ళిపడే ముఖాలని చూస్తాడు. అందుకే పెళ్ళికాకముందు నుంచీ కూడా లెక్చరర్‌గా ఉద్యోగం చెయ్యాలనుండేది. కాని నేను ఉద్యోగం చెయ్యడం ఆయనకిష్టం లేదు. అందుకని ఆ ప్రయత్నాలు చెయ్యలేదు..."

"కంగ్రాట్స్. మీ రాజీవ్యవహారం ఎంతవరకూ వచ్చింది?"

"ప్రస్తుతానికి అన్ని ప్రయత్నాలూ ఆపేశాం. కొన్నాళ్లపాటు వదిలెయ్యడమే మంచిదనుకున్నాం. ఇంకొన్నాళ్ళు చూస్తాం. కలిస్తే కలుస్తాం. లేకపోతే విడాకులకి అప్లై చేస్తాను''

"అంతదాకా ఎందుకులెండి. మూడో మనిషికి ఏదోరోజున మూడక తప్పదు''

"అది నిజమే కావచ్చు. కాని భర్త వదిలేసినందున ఇక బ్రతుకే లేదనుకుని కుళ్ళిపోవడం నాకిష్టంలేదు. భర్త లేకపోయినా బతగ్గలం. పెళ్లి కాకపోయినా బతగ్గలం. పెళ్ళీ, భర్తా పిల్లలూ బతుకులో జీవితంలో ఒక భాగం. అదే జీవితం కాదుకదా. వస్తాను..."

హుందాగా ఆత్మవిశ్వాసంతో ఆమె నడిచెళ్తోంటే గుడ్లప్పగించి చూస్తూండిపోయింది హర్ష.

పెళ్లికి ఆలస్యమయ్యిందని, పెళ్లి కాదేమోనని తను తల్లడిల్లిన రోజులు గుర్తొచ్చాయి.

ఇందిర అన్న మాటల గురించే చాలాసేపు ఆలోచిస్తూండిపోయింది. తలస్నానం చేసింది హర్ష. బాల్కనీ మెట్ల దగ్గర ఎండలో నిలబడి జుట్టు ఆరబెట్టుకుంటూ చిక్కు తీసుకొంటోంది.

ఇంతలో హఠాత్తుగా ఒకావిడ గబగబా

మెట్లెక్కి రావడం కంటబడింది. ఆవిడ్ని సరిగ్గా చూసేలోపునే హర్ష జుట్టుపట్టుకుని వంగదీసి కసిగా ఎడాపెడా పిడిగుద్దులు గుద్దేసింది.

త్రోసేస్తూ కొట్టేస్తూ, "నీకు నా మొగుడే కావాల్సొచ్చాడా పాపిష్టిదానా! ఇలా ఎందరి మొగుళ్లని వలలో వేసుకుంటావే నీచురా లా!" అని తిట్టిపోసింది.

ఏం జరుగుతోందో అర్థం కాలేదు హర్షకి. ఆమె మెదడు పనిచెయ్యడం మానేసింది.

ఆవిడేమో అంతకంతకీ రెచ్చిపోయి వీర విహారం చేసేస్తోంది.

ప్లీడరు దంపతులు పరుగునొచ్చి అడ్డుప డ్డారు. హర్షని ఆమె బారినుండి రక్షించారు. ఊహించని ఘటనకి బిత్తరపోయి చేష్టలు దక్కిచూస్తూ నిస్సత్తువగా కూలబడింది హర్ష

"వుండమ్మా వుండు. నువ్వెవరివస లు..."

రామలింగయ్యగారి మాటలు విన్పించుకో లేదామె.

"నువ్వు బాగుపడవే. నా వుసురు పోసు కుని సర్వనాశనం అయిపోతావే. పురుగులు పడిఛస్తావే. నీ శవాన్ని ఈడ్చడానికి ఒక్కళ్లు కూడా రారే..." అని శపిస్తూ గట్టిగా అరుస్తూ తిడుతూ వచ్చినంత వేగంగానూ వెళ్ళిపో యింది.

ఇరుగు పొరుగు పోగయ్యారు.

అంతా నిశ్చేష్టులై అయోమయంగా చూ స్తూండిపోయారు.

"ఆవిడెవరు?" ప్రశ్నించారు రామలింగ య్యగారు.

తెలీదంటూ తల అడ్డంగా వూపి అరచేతు ల్లో మొఖం దాచుకుని ఏడ్చేసింది హర్ష.

"ఇతగాడి మొదటి పెళ్లాం అనుకుంటా. మాయదారి మొగుళ్లూ మాయదారి బుద్ధు లూ!" అంటోంది కామేశ్వరి.

అవమానాగ్నిలో నిలువునా దహించుకు పోతూ ఇంట్లోకి పారిపోయి మంచానికడ్డంగా పడి బావురుమంది. హోరున భోరున ఏడ్చే సింది హర్ష.

వీధిలో ప్రోగైన జనం తలోరకంగా వ్యా ఖ్యానిస్తూ చెదరిపోయారు.

జరిగిన ఘోరపరాభవానికి తల కొట్టేసిన ట్టుగా వుంది హర్షకి.

జనానికి మొహం చూపించలేక బ్యాంక్‌కి వెళ్లకుండా ఇంట్లోనే వుండిపోయింది. తనలో తను దహించుకుపోతూనే వుంది.

ఏమైనా అఘాయిత్యానికి తలపడుతుందే మోనని మధ్య మధ్య రామలింగయ్య దంప తులొచ్చి తొంగిచూస్తున్నారు.

కాని ఇందిర మాత్రం అటుకేసి రాలేదు.

సాయంత్రం వచ్చాడు శ్రీను "ఇవాళ బ్యాంకుకి వెళ్ళలేదటగా. ఒంట్లో బాగోలే దా?" అనడిగాడు.

ఆమె జవాబివ్వలేదు. అతడి వంకచూళ్ళే దు. గోడవైపు తిరిగి ఏడుస్తూండిపోయింది.

ఏదో జరిగివుంటుందనుకున్నాడు. "ఏవ య్యింది హర్షా. ఎవరైనా ఏమైనా అన్నారా?"

ఆమె ఏడ్పు రెట్టింపయ్యిందిగాని బదులి వ్వలేదు.

రామలింగయ్యగారొచ్చారు.

ఇబ్బందిగా కించిత్తు అసహనంగా చూశా డు శ్రీను.

"పొద్దున్నెవరో ఒకావిడొచ్చి అమ్మాయి మీద విరుచుకుపడింది. నానా తిట్లుతిట్టి రభస చేసి వెళ్ళింది'' అంటూ జరిగిందంతా వివరించారు.

"ఆవిడెవరు?"

"తెలీలేదు''

"నా భార్యని కొట్టి హింసిస్తే ఎలా వూరు కున్నారు? పోలీసు కంప్లయింట్ ఇవ్వకపో యారా?"

"ఆవిడెవరో తెలీకుండా..."



"పిచ్చిదో, వెర్రిదో ఎవరైతే మనకేంటి? మనింటికొచ్చి అవమానించినదాన్నసలు ఎలా వెళ్ళనిచ్చారు? నాలుగు తన్నా ల్సింది!" నిప్పులు కక్కేడు శ్రీను.

బుర్రగోక్కున్నారాయన. "ఆవిడ నీ భార్యేమోనని..."

"రామలింగయ్యగారూ!"

అతడి అరుపుకి అదిరిపడి లేచికూర్చుంది హర్ష.

"ఆవిడ మాటల్ని బట్టి అలా అన్పించింది..."

"మీరలా మాట్లాట్టం భావ్యం కాదు" అంటూ వెళ్ళి హర్ష రెక్క పట్టుకొని లాక్కొచ్చాడు. ఆమె తలమీద చేయివేసి అన్నాడు. "ఇదీ నా భార్య"

"మరైతే ఆవిడ..."

"ఎవరో పిచ్చిదై వుంటుంది. హర్షని చూసి ఎవరో అనుకునుంటుంది. అదే కులస్త్రీ అయితే అలా వచ్చి గొడవ చేస్తుందా? ఒక్కత్తీ వీధిలో రభస సృష్టిస్తుందా? తన గురించేమీ చెప్పకుండా బజారుదాన్లా తిట్టుకుంటూ వెళ్తుందా?"

ఎవరూ జవాబు చెప్పలేకపోయారు. అతడి వాదనలోనూ పాయింటు వుందన్పించింది.

హర్ష మనస్సు తేలిక పడుతోంటే అడిగింది "అయితే మీకు నిజంగా ఇంకో భార్య లేదా?"

"హర్షా! నువ్వు కూడా..."

"అదికాదండీ. ఒకవేళ..."

"లేదు! లేదు! లేదు! మీరంతా ఎందుకు నన్ను అనుమానించి ఇలా చిత్రవధ చేస్తున్నారో నాకర్థంగావట్లేదు. మిమ్మల్నెలా నమ్మించాలో తెలీటంలేదు. చెప్పండి. మిమ్మల్ని నమ్మించడానికేం చెయ్యను? మరిగే నూనెలో చేతులు పెట్టనా? నా చెయ్యి కోసుకుని రక్తంతో హర్షకి అభిషేకం చెయ్యనా? చెప్పండి. ఏంచేస్తే నమ్ముతారో చెప్పండి చేసేస్తాను..."

అతడి స్వరం గద్గదికమయ్యింది. కన్నీళ్ళు చిప్పిల్లాయి.

"ఊరుకో బాబూ. నిజం నిలకడమీద తెలుస్తుందిలే. తొందరపడ్డందుకు ఏమీ అనుకోకు" అని వెళ్ళిపోయారు రామలింగయ్యగారు.

"ఎవరో పిచ్చిది ఏదో కూస్తే అనుమానిస్తావా? నా మీది ప్రేమ విశ్వాసం ఏమైపోయాయి హర్షా? ఒకరి గురించి ఒకరు దేన్నైనా వదులుకోగలగటమే ప్రేమంటారు. నీకోసం నీ ప్రేమకోసం మా కన్నవాళ్లని వదులుకుని, లక్షల కట్నం కాలదన్ని నీతోడిదే నా బ్రతుకనుకుని వస్తే ఇదేనా నువ్వు చూపే ప్రతిస్పందన? ఇదేనా నువ్విచ్చే బహుమానం?"

అతడు కన్నీళ్ళతో అమాయకంగా చూస్తూ నిష్ఠూరంగా ప్రశ్నిస్తోంటే ఆమె కర్పూరంలా కరిగిపోయింది.

అతడి ఎదమీద వాలి బావురుమంది.

★ ★ ★

శ్రీను పూర్తిగా ఇంటిపట్టునే వుంటున్నాడు.

కేంపులకి వెళ్ళటంలేదు. అతడు పనిచేస్తున్న కంపెనీవారు ప్రారంభించిన కొత్తవెంచర్ ప్లాట్స్ అమ్మడానికి పట్టుదలగా తిరుగుతున్నాడు.

రోజుకి ఒకటి రెండు ప్లాట్స్ చొప్పున బుక్‌చేస్తున్నాడు. ఆ వివరాలూ తనకి రాబోయే కమీషన్ గురించీ విజయోత్సాహంతో హర్షకి చెబుతున్నాడు.

"నువ్వేమైనా సాధించగలవు శ్రీనూ. నీ ప్రతిభ, నీ మేథాసంపత్తి ఉప్పుపాలైన జీవన దికాకూడదు. ఎలాగైనా అయ్యేయస్‌కి అప్లయ్ చెయ్యాల్సిందే. నీ ఉద్యోగం మానేసి అయినాసరే దీక్షగా చదువుదువుగాని. నిన్ను నేను చదివిస్తాను శ్రీనూ. అవసరమైతే హై




దరాబాదుగాని ఢిల్లీగానివెళ్ళి కోచింగ్ తీసుకుందువుగాని'' అంది హర్ష మళ్ళీ ఒకనాటి హర్షయై ఏకవచన ప్రయోగంచేస్తూ.

ఆమె కళ్ళల్లోకి ఆరాధనగా చూశాడు.

"నా బ్రతుకు గమనాన్ని మార్చి దారి పొడవునా వెన్నెల పూలు పరచడానికొచ్చిన దేవతా! ఏమిస్తే ఏంచేస్తే నీ రుణం తీరుతుంది'' చెమ్మగిల్లిన నయనాలతో అన్నాడు.

"నీ గుండెల్నిండా నేనే వుండాలి''

"నువ్వే వున్నావు. హనుమంతుడి గుండెలో రాముడు కొలువై వున్నట్టు నా గుండెల్లో నువ్వే నెలకొని వున్నావు హర్షా. నీకు తప్ప మరెవరికీ అక్కడ స్థానం లేదు హర్షా..."

"చాలండీ, ఈ జన్మకీవరంచాలు..."

"ఎంత పిచ్చిదానివి! ఆలోచిస్తోంటే నిన్ను చాలా బాధపెడుతున్నానేమో అన్పిస్తోంది. ఇకనుంచి నువ్వు చెప్పినట్లే వింటాను. నువ్వాశించినట్టే వుంటాను. నువ్వు గీసిన గీటుదాటను. సరేనా?"

పరమానందంతో అతడి నుదురు ముద్దాడింది.

తమకంతో ఆమెని దగ్గరకి తీసుకొంటోంటే, "చీర నలిగిపోతుందండీ. ఆఫీసుకెళ్ళాలి..." అంటూ అతడి కౌగిల్నుంచి విడివడింది అయిష్టంగానే.

"ఓకే ఓకే. డ్యూటీ ఫస్ట్ కదా. అన్నట్టు హర్షా! మన ఎపార్ట్‌మెంటుకి అగ్రిమెంటు ప్రకారం మా కంపెనీ వాళ్ళు మొజాయిక్ ఫ్లోరింగ్ చెయ్యాలి. కానది ఓల్డ్ ఫాషనయ్యిందోయ్. ఇప్పుడంతా సిరామిక్ టైల్స్ వేస్తున్నారు. షో ఎక్కువగా వుంటుంది. మెయింటెనెన్స్ తేలిక. ఎప్పుడూ అద్దంలా తళతళలాడుతూ ముచ్చటగా వుంటుంది. ఖర్చులో తేడా పెద్ద ఎక్కువగా వుండదు. డిఫరెన్స్ మనం పెట్టుకుంటే టైల్స్ వేసేస్తారు..."





"మీకేది బాగుంటుందన్పిస్తే అది వేయించండి''

"అయితే ఓ అయిదువేలు ఎడ్వాన్స్ పే చేస్తే టైల్స్‌కి ఆర్డర్ ఇస్తాడు. లేదా నాకు తెలిసిన షాపుంది. అక్కడ కొనిస్తాను. కాని మన దగ్గర ఇప్పుడంత డబ్బులేదుకదా జీతాలొచ్చేక ఇవ్వొచ్చుగానీ ఈలోగా మిగతా వాటితోబాటు తొందరపడి మొజాయిక్ చేసేస్తారేమోనని... మళ్ళీ దాన్ని పగలగొట్టి టైల్స్ అతికింపించాలంటే చాలా ఖర్చవుతుంది...".

అతడి మాటల్లోని నిజాయితీ ఆమెని ఆకట్టుకుంది. అయినా కించిత్తు అనుమానంగా చూసింది. అతన్లో పశ్చాత్తాపం సిన్సియారిటీ పుష్కలంగా కన్పించాయి.

"మొన్ననే ఓ చిట్ పాడాను. ఇవాళ చెక్కు ఇస్తానన్నారు. మధ్యాహ్నం బ్యాంకుకొస్తే ఇస్తాను''

"చూశావా, చూశావా. ఇల్లు కట్టినవేళ బిడ్డపుట్టినవేళ అన్నారు. ఆ అపార్ట్‌మెంట్ కొన్నాక మనకన్నీ చకచకా కలిసొస్తున్నాయి చూడు. పదిరోజుల్లో హౌసింగ్‌లోన్ శాంక్షన్ అయింది. మన పెళ్లయింది. ఏ స్టేజిలోనూ తడుముకోకుండా డబ్బు అందుతోంది. అపార్ట్‌మెంట్స్ త్వరత్వరగా తయారవుతున్నాయి. త్వరలోనే నువ్వు అమ్మవి కూడా అవుతావు చూడు. నాకు పిల్లలంటే ప్రాణం హర్షా. ఎప్పుడా ఎప్పుడా అని మన రక్తం మన ప్రేమ పంచుకుపుట్టే బిడ్డలకోసం ఎదురు చూస్తున్నాను. అతి త్వరలోనే నా కోరిక తీరుస్తావుకదూ?"

ఆమె అనిర్వచనీయమైన అనుభూతికి లోనై సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది. అతడికి చెప్పలేదుగాని రెండు నెలలుగా మెన్సెస్ అవలేదు. నెల తప్పిందనే సందేహం. ఇంకో పదిరోజులాగి డాక్టర్ చేత చెకప్ చేయించుకుని కన్ఫర్మ్ చేసుకున్నాక చెబుదామనుకుంది.

ఈలోగానే భవిష్యత్తు చూసొచ్చినట్లు అతడు చెబుతోంటే ఆనందోద్వేగంతో పొంగిపో

యింది. వూగిపోయింది. జవాబివ్వకుండా అతడ్నే చూస్తూండిపోయింది.

ఆమె స్థితిని గ్రహించని శ్రీను హడావిడిగా వెళ్ళిపోయాడు.

ఆమె మనస్సు మూల్గింది. అతడు తనలో చెలరేగుతోన్న భావాలని చదివి అనునయించి విషయం రాబట్టి ఆనంద నాట్యం చెయ్యకూడదా అనుకుంది. తనని ఎత్తేసి గిరగిరా త్రిప్పి పరమానందంతో పేట్రేగిపోకూడదా అనుకుంది.

మెల్లగా తేరుకుంది. గబగబా తయారై బ్యాంకుకెళ్లింది.

మధ్యాహ్నం బ్యాంకుకొచ్చి డబ్బు తీసుకెళ్ళాడు శ్రీను.

"ఫైవ్‌కల్లా ఇంట్లో వాలతాను హర్షా, నువ్వు కూడా త్వరగా తెముల్చుకొచ్చెయ్. ఇక స్పెషల్ ప్రోగ్రాం వుంది'' అన్నాడు కళ్ళు చికిలించిన నవ్వుతో.

అయిదున్నరకి ఇంటికెళ్లింది.

శ్రీను రాలేదు.

స్నానంచేసి ఫ్రెషప్ అయింది. అతడు వేసిన ప్రోగ్రాం ఏమయ్యుంటుందోనని ఆలోచించింది. ఏవో వేడి భావాలు స్ఫురించగా ఒంట్లోంచి ఆవిర్లు రాగా సిగ్గుతో ఎర్రగా కందిపోయిందామె తనువెల్లా.

"ఇంకా దాచటం మర్యాదకాదు గనుక తల్లిని కాబోతున్నానని చెప్పేస్తేనో?" అనుకుంది.

"డాక్టర్ని కన్సల్ట్ చేశాక చెబితేనే బాగుంటుందేమో. తన అనుమానం నిజమోకాదో' అనీ అనుకుంది.

శ్రీను ఏదో గొప్ప వార్తే చెప్పబోతున్నాడు. గనుక తనూ డాక్టర్ని కలిసొచ్చి కన్ఫర్మ్‌గా చెబితే?

ఓహ్! ఇవాళ పండగరోజవుతుంది. అంబరం అందిన రోజవుతుంది.

మరేం ఆలోచించకుండా "అరగంట్లో వచ్చేస్తాను'' అని స్లిప్ రాసిపెట్టి అదే వీధిలో వున్న క్లినిక్‌కెళ్లింది.

అదృష్టవశాత్తూ జనంలేరు.

డాక్టర్ ఆమె పీరియడ్స్ గురించడిగి టెస్ట్ చేసింది.

"కంగ్రాట్యులేషన్స్. మీరు తల్లి కాబోతున్నారు''

ఆనందం వెల్లువలా త్రోసుకొచ్చిందామె మొఖంలోకి.

"థాంక్యూ డాక్టర్ థాంక్యూ వెరీమచ్..."

"ఫస్ట్ ఇష్యూ కదూ. కాళ్ళు నేలమీద ఆనవు..." నవ్విందామె.

"స్త్రీ జీవితానికి సార్థకత చేకూర్చేది మాతృత్వమేకదా డాక్టర్. మన రక్తమాంసాల్ని పంచిస్తూ మరో జీవికి వూపిరిపోసి జన్మనివ్వడం స్త్రీకి భగవంతుడిచ్చిన అపురూప వరం"

"అప్పుడే మధుర భావనలు మొదలయ్యాయన్నమాట. చదువుకున్నవారికీ సెంటిమెంట్స్ అధికంగానే వుంటున్నాయి''

"సెంటిమెంట్స్ అనేవి మనస్సుకి సంబంధించినవిగాని చదువుకి సంబంధించినవికాదుకదా డాక్టర్. మనుషులకే కాదు ప్రతి ప్రాణికీ సెంటిమెంట్స్ సహజంకదా. ఒక ప్రాణికి ఇంకో ప్రాణితో అనుబంధం కలిగించేది సెంటిమెంటే కదా''

"ఓకే... అవతల నా పేషంట్సు వెయిట్ చేస్తున్నారు. వాళ్ళని త్వరగా చూసి ఆరోగ్యం చేకూర్చి పంపడం నా సెంటిమెంట్''

"థాంక్యూ డాక్టర్. మీర్రాసిన మందులూ టానిక్సూ విడవకుండా వాడతాను''

"టానిక్స్‌కన్నా సంతోషంగా ఎలాంటి ఆందోళనలూ లేకుండా వుండటం ముఖ్యం. బిడ్డ మీదెక్కువగా తల్లి మానసిక స్థితి ప్రభావమే పడుతూంటుంది''

"అయామ్ వెరీ హేపీ. మా వారు నన్ను అపురూపంగా చూసుకుంటారు. ఇహ ఈ వార్త తెలిశాక నన్ను పూలమీద తప్ప

నేలమీద నడవనివ్వరు''

"యూ ఆర్ లక్కీ''

సెలవు తీసుకుని వచ్చేసింది.

"శ్రీనూ, అతి త్వరలో నేన్నీకు మన ప్రేమఫలాన్ని అందివ్వబోతున్నాను'' అంటుందతడ్ని వాటేసుకుని.

అలా చెప్పగానే అతన్లో అతడి చేష్టల్లో వచ్చే మార్పుని ఆనందంతో చేసే నాట్యాన్ని ఆలపించే పాటల్ని అన్నీ వూహించుకుని మురిసిపోయింది.

"నన్ను తరింపచేయడానికి నాకోసం నడచివచ్చిన దేవతవి. నన్ను పరిపూర్ణ పురుషుడిగా చెక్కిన అపూర్వ శిల్పివి. నీ ప్రేమామృతం దోసిలొగ్గి త్రాగ్గలగటం నా జన్మజన్మల తపఃఫలం" అంటాడని పరిపరివిధాల వూహించుకుని తీయని వూహల్లో వూయలలూగింది.

చిన్నగా నవ్వుకుంటూ ఇంటిని సమీపించింది. తాళం వేసేవుంది. టైము చూసింది.

ఆరున్నరయ్యింది.

"ఎందుకింకా రాలేదు చెప్మా?" అనుకొంటూండగానే ఏడయ్యింది. శ్రీను రాలేదు.

ఇంట్లో కాలు నిలవలేదు. ఎందుకాలస్యమైందో కనుక్కుందామని రామలింగయ్యగారింట్లోంచి అతడి ఆఫీసుకి ఫోన్ చేసింది.

"నాలుగింటికే వెళ్ళిపోయారు..."

"నిజమా? ఇంటికి రాలేదే!"

"మీరెవరు?"

"ఆయన వైఫ్ని..."

"అసలేం జరిగిందంటే మేడమ్ పోలీసులొచ్చి శ్రీనుని తీసుకెళ్ళారు''

"పో... పోలీసులా? ఎందుకు? ఏం నేరం చేశారు?"

"వివరాలు తెలీవు..."

"మీ ఆఫీసులో ఏమైనా... చేశారా?..."

అతడు జవాబివ్వలేదు. ఫోన్ పెట్టేశాడు!

అకస్మాత్తుగా ఆకాశం కూలి తనమీద పడ్డట్టుగా కూలబడిపోయింది. కాళ్లకింద భూమి కదలిపోయినట్టు కంపించింది. కన్నీళ్ళు ధారలు కట్టాయి.

భయంకర తుఫానులో సర్వం కోల్పోయి నదానిలావున్న ఆమెని చూసి రామలింగయ్యగారు గాభరా పడ్డారు.

"ఏవయ్యిందమ్మా. ఒంట్లో బాగోలేదా?"

"అంతా అయిపోయింది బాబాయ్'' బావురుమంది.

"ఏంజరిగింది? ముందు నువ్వు ధైర్యం తెచ్చుకో చెబుతా''

"ఇంకెక్కడి ధైర్యం బాబాయ్. అంతా అయిపోయింది. ఆయన్ని పోలీసులు పట్టుకుపోయారు''

"ఎందుకు? ఏంచేసేట్ట?"

"ఏదో పెద్ద నేరమే చేసుంటారు. నా బ్రతుకు అన్యాయమైపోయింది బాబాయ్..."

ఏడ్పు విని ఇందిరా, కామేశ్వరీ పరుగునొచ్చారు.

"నట్టింట శోకాలేంటి ఏదో కొంప మునిగినట్టూ''

"నువ్వుండవే. అబ్బాయిని పోలీసులు అరెస్టుచేశారని అమ్మాయి తల్లడిల్లిపోతోంటే మధ్యన నువ్వేంటి..." భార్యని కసురుకున్నారాయన.

"చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ అన్నారు. ఇంతకీ ఏం చేసేట్ట? అతగాడ్ని చూసినప్పుడే అనుకున్నాను ఇలాటిదేదో చేసి అమ్మాయికి అన్యాయం చేస్తాడని!"

"కాస్సేపు నీ నోటికి తాళం వేస్తావూ''

"వురుమురిమి మంగలంమీద పడిందిట. అలావుంది మీ వరస. అతగాడేదో కొంపముంచే పని చేస్తే మధ్యలో నన్నంటారేవిటీ!"

"సరిసరేగాని కాస్త ఆగు..."

అతడి ఆఫీసు ప్రాంతపు పోలీస్స్టేషన్కి




ఫోన్‌చేశారు రామలింగయ్యగారు.

శ్రీనివాస్ అనే పేరుగల వారెవర్నీ అరెస్టు చెయ్యలేదన్నారు. మిగతా స్టేషన్లకి కూడా ఫోన్ చేశారుగాని అన్నిచోట్ల నుంచీ అదే సమాధానం వచ్చింది.

"అతడి పేరు శ్రీనివాసేనా లేక ఇంకే పేరైనా..."

పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయ్యింది. తన భర్తపేరు కరక్టేనా అని అడుగుతోంటే బల్లగుద్ది చెప్పలేని పరిస్థితిలో పడింది. మెదళ్ళో పుట్టుకొస్తున్న వేలాది అనుమానాలు ఆమె నమ్మకాన్ని నీరు కార్చేస్తున్నాయి!

"పేరు కరక్టే బాబాయ్. రికార్డులో ఇంకేదైనా పొడుగు పేరుందేమో తెలీదు..."

ఆయన ఆమె వంక చూశారు. తల దించుకుంది.

అతడి ఆఫీసుకి ఫోన్ చేశారు. నో రెస్పాన్స్.

"ఆఫీసు మూసేసి వుంటారు..."

"ఇప్పుడేమిటి చెయ్యడం బాబాయ్. నాకు కాళ్ళూ చేతులూ ఆడటంలేదు. మీరే ఏదో దారి చూపాలి'' చేతులు జోడించింది హర్ష.

"మరీ అంత ఆందోళనపడక్కర్లేదమ్మాయ్. ఏ ప్రశ్నించడానికో తీసుకెళ్ళి వదిలేసి వుంటారు. ఏమాత్రం సీరియస్ విషయమైనా నీకు చెప్పడూ? కనీసం తెలిసిన ప్లీడర్ని కదా నన్నైనా కన్సల్ట్ చెయ్యడూ?"

నిజమే అన్పించింది. కాస్త వూరటగా ఫీలయ్యింది.

"ఇప్పుడో ఇంకాస్సేపటికో రావొచ్చు. చూద్దాం"

తలూపి వచ్చేసి నిస్త్రాణగా మంచంమీద కూలబడింది. కన్నీళ్ళు వుబికి వచ్చాయి.

శ్రీనుని పెళ్ళి చేసుకోవడం తప్పుడు నిర్ణయమా?

పెళ్ళయ్యాక మొట్టమొదటిసారిగా తనని తాను ప్రశ్నించుకుంది.

జరిగిన ఘటనల్నీ అతడి ప్రవర్తనలోని మార్పుల్నీ విశ్లేషించుకుంది.

తను తొందరపడినట్టుగా అన్పిస్తోంటే ఎంతో బేలగా అల్పంగా ఫీలయ్యింది.

'నీ వెనుక మేంవున్నాం. నీకు అండగా వున్నాం. నీకేం ఫర్లేదు' అని ఎవరైనా భరోసా ఇస్తే బావుణ్ణన్పించింది.

అన్నగార్లు గుర్తొచ్చారు.

తన మానాన తనని వదిలేసి చేతులు దులిపేసుకున్నారని అసహ్యించుకుంది. 'తొందరపడొద్దు. దీటైన సంబంధం చూసి చేస్తాం' అని పెళ్ళికి ముందు వాళ్ళిచ్చిన హామీలు గుర్తొచ్చాయి. శ్రీనుతో తమ పెళ్ళి జరిపించనన్నారని కోపించి వాళ్ళకి పెళ్ళి కబురు కూడా తెలియజేయలేదు. తనింకా అవివాహితగా వున్నాననుకుని ఏవో సంబంధాలు చూస్తున్నామనీ తనని రమ్మనీ ఉత్తరాలు రాస్తోంటే కనీసం సమాధానం ఇవ్వకుండా వాటిని బుట్టదాఖలు చేస్తూ వచ్చింది.

వాళ్ళు తన కక్కర్లేకపోయినా తన బిడ్డలకి కావాలనీ ప్రతి కథకీ కార్యానికీ మేనమావలు ముందుండాల్సుంటుందనీ వూహించలేకపోయింది.

ఆఖరికి తండ్రిలాంటి పెద్దాయన రామలింగయ్య గారి మాటల్ని కూడా పెడచెవిని బెట్టింది.

అందర్నీ దూరంచేసుకుని ఒంటరిగా మిగిలిపోయింది. ఏ సలహాలూ సంప్రదింపులూ పట్టించుకోకుండా మూర్ఖంగా ప్రవర్తించింది!

అన్నగార్లని స్వార్థపరులని నిందించింది గాని ఆలోచించి చూస్తే శ్రీనుతోసహా అంతా స్వార్థ పరుల్లానే వున్నారు. ఆఖరికి తనుకూడా!

అర్ధరాత్రయ్యింది.



శ్రీను రాలేదు! ఎలాటి సమాచారమూ తెలీలేదు!

ఏడుస్తూ తనకర్మకి తిట్టుకుంటూ జాగరణ చేస్తూ కూర్చుంది హర్ష. ఎప్పుడైనా ఓ నిమిషంపాటు నిద్రతూలితే ఆ కొద్దిక్షణాల్లోనే భయంకరమైన పీడకలలొచ్చి మరింత భయపెట్టసాగాయి!

అతికష్టంమీద తెల్లవారింది.

ఉబ్బిన కళ్ళతో రామలింగయ్యగారి దగ్గరికెళ్ళి ఏడ్చేసింది.

"ఈ టెన్షన్ భరించలేకపోతున్నాను బాబాయ్. మీరే నన్నాదుకోవాలి. మీరు తప్ప నాక్షేమం కోరే వారెవరూ లేరు''

"ఇలాటప్పుడే ధైర్యంగా వుండాలమ్మా. జరిగిందేమిటో తెలీకుండా బెంబేలు పడడం ఎందుకు చెప్పు. మొఖం కడుక్కుని రెడీ అవ్వు. అన్ని పోలీస్‌స్టేషన్లకీ వెళ్ళి వెదుకుదాం. పోలీసులు అరెస్టు చేసినంతమాత్రాన ఏదో పెద్దనేరం చేసినట్టూ మరేదో పెద్ద శిక్ష విధించేసినట్టూ కంగారుపడాల్సిన పని లేదు. ఒకవేళ నేరం చేసినా శిక్ష విధించడానికి చాలా తతంగముంది, చాలా సమయమూ పడుతుంది. పోలీసుల ఆరోపణలేమైనా మనమూ తగినవిధంగా ఎదుర్కొంటాం కదా''

"శ్రీను ఎంతో మంచిగా అందరికీ తలలో నాలుకలా వుండే శ్రీను- అరెస్టు చేసేంత నేరం చేశాడంటే మీరు నమ్ముతున్నారా బాబాయ్'' తన గుండెకి ధైర్యం చెప్పుకో డాని కడిగింది.

"మన నమ్మకాలు వేరు. వాస్తవాలు వేరు. పరిస్థితులు మనుషులచేత ఏమైనా చేయిస్తాయి. ఎందుకైనా ప్రేరేపిస్తాయి. బలహీనమనస్కులైతే ఉద్రేకపరులైతే మరింత తేలిగ్గా వాటికి లోబడి పోతూంటారు. ఆనక విధినో, దేవుడ్నో, ఇతరుల్నో నిందిస్తూంటారు..." అని ఓ క్షణం ఆగి తిరిగి అన్నారు. "అసలు నిజంగా జరిగిందో లేదో జరిగితే దాని స్వరూపస్వభావాలేమిటో తెలుసుకోకుండా ఏదేదో వూహించుకోవడం అనవసరం"

"అలాగే బాబాయ్. ఈ పోలీసు గొడవలూ కోర్టు వ్యవహారాలూ నాకేమీ తెలీవు. మీరే మాకు పెద్ద దిక్కు. మీరే సాయపడాలి. పాల ముంచినా నీటముంచినా మీదే భారం!"

"కూతుర్లాంటిదానివి. నువ్వింతగా ప్రాధేయపడాలా చెప్పు? నేను చేయగలిగిందంతా చేస్తాను. సరేనా?"

తలూపి కళ్ళు తుడుచుకుంది.

ఇద్దరూ అన్ని పోలీస్‌స్టేషన్లకీ తిరిగారు. అఫీషియల్‌గా అనఫీషియల్‌గా వాకబు చేశారు. ఎలావోలా వివరాలు తెలుసుకోవాలని విశ్వప్రయత్నాలు చేశారు.

ఆఖరికెలా అయితేనేం రామలింగయ్యగారికి తెలిసిన హెడ్ కానిస్టేబులుద్వారా వివరాలు తెలుసుకున్నారు.

శ్రీనుకి అంతకుముందే పెళ్ళయ్యిందిట. అతడి మావగారు ఛోటానాయకుడట. అతడు తన పలుకుబడి వుపయోగించి శ్రీనుని అనధికారికంగా అరెస్టు చేయించాట్ట. రాత్రి చిత్రహింసలు పాల్జేశార్ట. దాంతో భార్యతో బుద్ధిగా కాపురంచేస్తానని కాగితాలు రాసిచ్చి మావగార్తో కలిసి వెళ్ళిపోయాట్ట.

ఆ సంగతులు వింటూనే స్పృహ తప్పి పడిపోయింది హర్ష!

★ ★ ★

హర్షకి స్పృహ వచ్చేసరికి ఆసుపత్రి బెడ్‌మీద వుంది.

పక్కనే కుర్చీలో రామలింగయ్యగారు వేదనామూర్తిలా కూర్చునున్నారు. కామేశ్వరి బత్తాయిరసం తీస్తోంది.

శ్రీను మంచివాడుగా నటించి నిలువునా మోసం చేశాడని గుర్తొచ్చేసరికి దుఃఖం ఆవేశం కసీ ముప్పేటగా పొంగివచ్చాయి. ఏమీ చేయలేని నిస్సహాయురాలై ఏడ్చేసింది.





"హమ్మయ్య. తెలివొచ్చింది. ఒంట్లో ఎలాగుందమ్మాయ్'' ఆప్యాయంగా అడిగింది కామేశ్వరి.

తరచూ వాడి మాటలు సూటిగా విసిరే ఆవిడ అలా ఆప్యాయత రంగరించి అడిగే సరికి హర్ష దుఃఖం రెట్టింపయ్యింది.

"దారుణంగా మోసపోయాను పిన్నీ''

"మోసగాళ్ళెప్పుడూ నమ్మినవాళ్ళనే మోసగిస్తారు. గొంతుకోసే వాళ్ళెప్పుడూ తడిగుడ్డతోనే కోస్తారు. అందుకే మన జాగ్రత్తలో మనం వుండాలి. ఎవరి వుచ్చులోనూ పడకుండా జాగ్రత్తపడాలి. తెలివితేటల్తో బతుకు చక్కదిద్దుకోవాలి''

"ఇప్పుడవన్నీ ఎందుకే' రామలింగయ్యగారన్నారు.

"ఇవన్నీ తల్లి చెప్పాల్సిన మాటలండీ. ఆవిడకి నూకలు చెల్లాయి మరి. నేనైనా చెప్పొద్దూ?"

హర్ష కళ్ళల్లో సన్నని కన్నీటిపొర కదిలింది. కన్నీటి తెరలోంచి ఆర్ద్రంగా చూసింది.

"ఇంటిముందు ముగ్గు ఎంత శ్రద్ధగా కళాత్మకంగా వేస్తామో బతుకూ భవిష్యత్తూ కూడా అలాగే తీర్చిదిద్దుకోవాలి. అందంగా మలచుకోవాలి. ఎక్కడే చిన్న లోపం జరిగినా అంతా రసాభాసయ్యే ప్రమాదముంది తల్లీ. అందుకే ఆడదానిగా పుట్టేకన్నా అడవిలో మానై పుట్టడం మంచిదన్నారు. నా గొడకేంగాని ఇంద ఈ రసం తాగు కాస్త శక్తిగా వుంటుంది. అసలే ఒట్టిమనిషివి కూడా కాదు''

"అంటే..."

"డాక్టరమ్మ చెప్పింది. నువ్వు తల్లివికాబోతున్నావు. ఎలాటి వ్యధలకీ వుద్రేకాలకీ తావివ్వకూడదు''

"నేనెంత దురదృష్టవంతురాలిని పిన్నీ. ఇటువంటి అయోమయసమయంలో మరో సమస్య నా కడుపున పడింది చూడు!"

"ఈ సృష్టి తీరే అంత. ఆడది భూదేవిలా అన్ని ఫలాలూ అందించాలి. అన్ని బరువులూ ఓర్పుగా మోయాలి. మగాడికేం దులుపుకెళ్ళిపోతాడు. శకుంతల కాలం నుంచీ జరుగుతోందదేనమ్మా. ఆడదేమో ప్రాణాన్ని పంచివ్వడమేకాదు బతుకుని ఫణంగా పెట్టి బిడ్డని పెంచుతుంది. అది మగాడైన బ్రహ్మరాసిన మన తలరాత! కష్టాలు మనవి. నొప్పులు మనవి. బిడ్డమీది హక్కులు మాత్రం మగాళ్ళవి. ఆడదానికెంత అన్యాయం జరిగిపోతోందో చూడు!"

"ఇక సరిపెట్టుమరి. అమ్మాయిని కాస్త తేరుకోనీ'' అని భార్యకి చెప్పి "లేనిపోని ఆలోచనలు పెట్టుకోకుండా రెస్టు తీసుకో అమ్మాయ్'' అన్నారు హర్షతో రామలింగయ్యగారు.

"అవునమ్మాయ్. ఎలా జరగాలని రాసుంటే అలా జరుగుతుంది. మనం నిమిత్తమాత్రులం" అంది కామేశ్వరి ఓదార్పుగా.

"మీ అన్నయ్యల ఫోన్ నెంబర్లు ఇస్తే విషయం చెప్పి రమ్మంటాను''

విరాగినిలా నవ్వింది.

"వాళ్ళొచ్చి చేసేదేమీ వుండదు బాబాయ్. మమ్మల్ని కాదని కనీసం పెళ్ళి గురించి చెప్పనైనా చెప్పకుండా పెళ్ళి చేసుకున్నావు. అనుభవించు అని శపిస్తారు. అసలు వాళ్ళు రానేరారు బాబాయ్. నేనేమైపోయినా వాళ్ళకి పట్టదు. వాళ్ళ దృష్టిలో నేను ఎప్పుడో అమ్మా, నాన్నల్తో బాటే చనిపోయాను!"

"పిచ్చిదానా. ఆనందంలో ఐశ్వర్యంలో గుర్తురాకపోయినా కష్టంవచ్చినప్పుడు ఎలాటివాళ్ళైనా పరుగెత్తుకొస్తారమ్మా. రక్త సంబంధమంటే అదే తల్లీ''



"మీకు నమ్మకముంటే ఫోన్ చెయ్యండి'' అంటూ ఫోన్ నెంబర్లు ఇచ్చింది.

ఆ మధ్యాహ్నమే డిశ్చార్జయి ఇంటికొచ్చేసింది హర్ష.

మర్నాడు బ్యాంకుకెళ్ళగా అంతా సానుభూతిగా చూశారు. వారికేయే విషయాలు తెలిశాయోగాని 'చ్చొచ్చొ' అన్నారు. వంకర నవ్వులు నవ్విన వాళ్ళూ, చాటున వ్యంగ్యాస్త్రాలు విసిరిన వాళ్ళూ లేకపోలేదు.

గుండెదిటవు చేసుకుంది. ముమ్ముందు మరింత విషమస్థితిని ఎదుర్కొనవలసి వస్తుంది గనుక గుండె రాయి చేసుకోవాలనుకుంది.

శ్రీనుతో పరిచయాన్ని ఓ పీడకలలా మర్చిపోవాలని నిర్ణయించుకుంది. పుట్టబోయే బిడ్డ చుట్టూ భవిష్యత్తు అల్లుకోవాలని చూస్తోంది. ప్రయత్నిస్తోంది.

"ఇలా జరుగుతుందనుకోలేదు. అతడింత మోసగాడనుకోలేదు'' అంది సరిత సానుభూతిగా చూస్తూ.

"విధి రాతనెవరూ తప్పించలేరు. పెద్దవాళ్ళొచ్చి మాట్లాడితే మంచిదనీ తమ అనుభవంతో ఆచితూచి అంచనా వేస్తారనీ అన్నావు. పెళ్ళంటే ఏడు తరాల మంచి చెడ్డలు చూడాలనీ అన్నావు. అదంతా ట్రాష్ అని తోసిపారేశాను. నలుగురొచ్చి తమతమ అనుభవాలతో విజ్ఞతతో నాలుగు రకాలుగా విశ్లేషించి పెళ్ళి కుదర్చడంలో ఎంత ముందుచూపు, ఎన్ని జాగ్రత్తలున్నాయో ఇప్పుడర్థమవుతోంది. చేతులు కాలేక తెలిసింది నిప్పులు కాల్తాయని!"

ఆమె మరి మాట్లాడలేకపోయింది. నిట్టూర్చి వెళ్ళిపోయింది.

మూడోరోజున హైదరాబాద్‌నుంచి హర్ష పెద్దన్నయ్య పార్వతీశం వచ్చాడు.

జరిగిందంతా తెలుసుకుని ఆశ్చర్యబోయాడు.

"పెళ్లి చేసుకుంటున్నట్టుగానీ, చేసుకున్నట్టుగానీ అసలు మాకెందుకు చెప్పలేదు?" అని కోప్పడ్డాడు.

"శ్రీను చెప్పలేదా?" నీరసంగా అంది.

"ఏ శ్రీను?"

హర్షా, రామలింగయ్యగారూ ముఖముఖాలు చూసుకున్నారు. హర్ష వెళ్ళి శ్రీను ఫొటో తెచ్చి చూపించింది.

"ఇతడొచ్చి నిన్ను కలుసుకుని అన్ని వివరాలూ మాట్లాడలేదా?"

"వచ్చాడు... నీకేదో పెళ్ళి సంబంధం వుందన్నాడు. కట్నం ఎంతిస్తారని అడిగాడు. ఆఫీసర్‌గా ఉద్యోగం చేస్తోంది కదా అన్నాను. అయినా గాని మంచి సంబంధం అయితే పెళ్ళి ఖర్చులకీ, లాంఛనాలకీ కలిపి యాభై వేలదాకా ఇస్తామన్నాను. ఓ సంబంధం వుందనీ వరుడి తరపు వాళ్లతో మాట్లాడతాననీ వాళ్లకిష్టమైతే మళ్ళీ కాంటాక్ట్ చేస్తాననీ చెప్పి వెళ్లిపోయాడు. మళ్ళీ కబురూ లేదు కాకరకాయా లేదు!"

"ఇంకేం చెప్పలేదా?" నొక్కి ప్రశ్నించింది హర్ష.

"వూహూ... గిరీశం దగ్గరికూ్కడా ఎవరో వెళ్ళేర్ట..."

"అక్కడికీ ఇతనే వెళ్ళేడు" రామలింగయ్యగారన్నారు.

"ఇతనేనా? అక్కడింకోలా చెప్పేట్ట!"

"ఏమని చెప్పేడు?"

ఇబ్బందిగా కదిలి అన్నాడు "మీ చెల్లెలి ప్రవర్తన బావోలేదు. కులస్తులంతా కలిసి హెచ్చరించమని తనని పంపేరు అన్నాట్ట. ఎవరో కులం తక్కువవాడ్ని పెళ్ళాడేస్తే అందరికీ తల వంపులని హెచ్చరించాట్ట. వెంటనే తమ్ముడు నాకు ఫోన్‌చేస్తే కంగారుపడొద్దనీ ఎవరో కిట్టని వాళ్ళ మాటలయ్యుంటాయనీ చెప్పేను. త్వరగా పెళ్ళి చేస్తే మంచిదని ఒకటి రెండు సంబంధాలు చూశాం. నిన్ను రమ్మని రాసినా నువ్వు రాలేదు. మేమే వీలుచూసుకునొచ్చి నీ అభిప్రాయాలు తెలుసుకుందామనుకుంటున్నాం. ఇంతలో ఈ ఘోరం గురించి తెలిసింది"

"చాలా చక్కగా నాటకమాడాడన్నమాట" అని వ్యాఖ్యానించారు రామలింగయ్యగారు.

"ఇక్కడికొచ్చి ఏమని చెప్పేడు?"

"వీళ్ళ ప్రేమ పెళ్ళి మీకు ఇష్టమేగాని కట్నం ఇచ్చే ఉద్దేశ్యంగాని పెళ్ళి ఖర్చు భరించి పెళ్ళి చేసే ఆలోచనగాని మీకు లేదన్నాడు. మీరసలు ఆమె బాగోగులు పట్టించుకునేట్టే లేరన్నాడు"

"రామరామ! ఎవడో దారినపోయే దానయ్యలిలా చెబితే మాత్రం నువ్వేలా నమ్మేశావే? తోడబుట్టిన వాళ్ళం. చిన్నప్పట్నుంచి కలసి పెరిగినవాళ్ళం. మమ్మల్నంత దారుణంగా ఎలా అపార్థం చేసుకున్నావే?"

"తలమీద శని తిష్టవేశాడు. గుడ్డిగా నమ్మేశాను. అతడి మాటల మాయలోపడి కనీసం పెళ్ళికి రమ్మని కూడా రాయలేకపోయాను. ఆ తర్వాత మీరేవో సంబంధాలు




చూశాం, రమ్మని రాసినా నిజం తెలియబర చలేకపోయాను. ఏం చేస్తాను. అంతా నా ప్రారబ్ధం, అనుభవించాల్సిందే!" బాధగా అంది హర్ష.

"ఇంత దగా, మోసం చేసిన వాడ్ని తేలిగ్గా వదల్ను. కాలో, చెయ్యో తీయించేస్తాను. కేసుపెట్టి ఉద్యోగం వూడదీయిస్తాను'' ఆవేశపడ్డాడు పార్వతీశం.

"లీగల్‌గా మనమేమీ చెయ్యలేం. జరిగిందేదో జరిగిపోయింది. ఇంతటితోనైనా పీడ వదిలినందుకు సంతోషిస్తూ చేతులు కడిగేసుకోవడం మంచిది. ఇహ ఇప్పుడు జరగాల్సిందాని గురించాలోచించడం విజ్ఞత అన్పించుకుంటుంది''

రామలింగయ్యగారి మాటలకి చెల్లెలితో అన్నాడు పార్వతీశం. "ఇక ఇక్కడుండొద్దు. హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫర్ పెట్టేసుకో. మీ రీజినల్ మేనేజర్ని కూడా కలిసి రిక్వెస్ట్ చేస్తాను. ఇతగాడ్నించి ఎంత దూరం వెళ్ళగలిగితే అంత మంచిది. అలాటి బద్మాష్‌లు తిన్నగా కాపురం చేసుకోనీకుండా వేధించుకు తింటారు కూడా. దూరంగా వచ్చేస్తే స్థానబలం వుండదు గనుక ఏమీ చెయ్యలేరు''

అంగీకారసూచకంగా తలూపిందామె.

"రేపు నాతో వచ్చేసేవంటే అక్కడి హాస్పిటల్లో చూపించి ఎబార్షన్ చేయించేద్దాం"

తుళ్ళి పడిందామె. కళ్ళల్లోకి చివ్వున నీళ్ళు చిమ్మాయి. అతడివంక చూళ్ళేక తలదించుకుంది. కన్నీటిబొట్లు టపటప రాలిపడ్డాయి.

"చూస్తూచూస్తూ ఇప్పుడిప్పుడే వూపిరి పోసుకుంటున్న బుల్లి ప్రాణి గొంతు పిసికిచంపెయ్యడం..."

"అలాగని ఆ మోసగాడి వంశాంకురాన్ని మోస్తావా? వెధవ సెంటిమెంట్సుతో జీవితాన్ని పాడుజేసుకోకు. జరిగింది సరిదిద్దుకుని దార్లో పడటమే కష్టం. ఇక బిడ్డలంకె కూడా వుంటే పెళ్ళి చేసుకోడానికెవరూ ముందుకు రారు!"

"నేను మళ్ళీ పెళ్ళి చేసుకోను. బిడ్డని పెంచుతూ ఇలాగే వుండిపోతాను''

"ఆ మొండితనమే నిన్నీస్థితికి లాక్కొచ్చింది. నీకై నువ్వు తీసుకున్న నిర్ణయ ఫలితం ఎలావుందో చూశావుగా. మళ్ళీ తొందరపడతావెందుకు? ఇవాళున్నదే జీవితంకాదు. ఇంకా చాలా వుంది. చాలా చూడాల్సి వుంది. అన్నాళ్ళు ఒంటిగా వుండలేవు. నువ్వు వుంటానన్నా ఈ సమాజం సుఖంగా వుండనివ్వదు. ఒంటరి ఆడదాన్ని కాకుల్లా పొడుచుకుతింటుంది. మా మాట విను. చక్కని భవిష్యత్తుని చేజేతులా పాడుజేసుకోకు. జరిగిందంతా ఓ పీడకలనుకుని మర్చిపో. కొత్తచోట కొత్త జీవితం ప్రారంభిద్దువుగాని'' అన్నాడు పార్వతీశం.

రామలింగయ్యగారు కూడా వత్తాసుపలికారు. "అవునమ్మా... మీ అన్నయ్య చెప్పింది అన్ని విధాలా బావుంది. జరిగిన కాస్తనీ భూతద్దంలో చూసి బెంబేలు పడి బతుకు పాడుజేసుకోవద్దు. నీ క్షేమం నీ సుఖం కోరి ఇంతగా చెబుతున్నాం. విను తల్లీ. హైదరాబాద్ వెళ్ళో లేక ఇక్కడేనో అబార్షన్ చేయించుకో. గత పాపపు ఆనవాలు లేకండా తుడిచేసుకో''

మరి కాస్సేపు అన్నీ వివరించి విశదీకరించారిద్దరూ. ఒకరకంగా చెవినిల్లు కట్టుకుని పోరారు.

కడకి వాళ్ళు చెప్పినట్టు నడచుకోడానికి అంగీకరించింది హర్ష. తృప్తిగా నిట్టూర్చారిద్దరూ.



రాత్రి పదిగంటల ప్రాంతం.

కాలింగ్ బెల్ మోగింది. ఎవరై వుంటారో అర్థంకాలేదు హర్షకి. మళ్ళీ మళ్ళీ మోగింది.

రామలింగయ్యగారికి ఏ బీపీయో, హార్ట్‌ఎటాక్‌లాటిదో వచ్చిందేమోనని భయమే

సింది. గబుక్కున తలుపు తీసింది.

శ్రీను లోపలికొచ్చాడు. బ్రాన్పడి పిచ్చిగా చూసింది.

తిన్నగా వెళ్ళి సోఫాలో తప్పుచేసినవాళ్ళా తలొంచుకుని కూర్చున్నాడు. మాసిన దుస్తులు, పెరిగిన గెడ్డం, చిక్కిన ఒళ్ళు, బికారిలా వున్నాడు.

ఆమెలో కోపం, అసహ్యం లావాలా ఎగదన్ని వచ్చాయి.

"ఇంకేం దోచుకుందామని వచ్చావు? మనిషి పుట్టుక పుట్టినందుకు సిగ్గూ శరమూ వుండాలి. దేవుడిముందు మోసపు పెళ్ళి చేసుకున్నందుకు కుళ్ళికుళ్ళి చావాలి. నువ్వు నిజంగా గుండెలు తీసిన బంటువి. పచ్చి మోసగాడివి. నిన్నేం చేసినా పాపంలేదు. నీలాటివాణ్ణి నిలువునా చీరి కారం దట్టించాలి. ఎంత దారుణంగా మోసగించావు! మెత్తని ప్రేమ కబుర్లు చెప్పి ఘోరంగా వంచించిన గోముఖ వ్యాఘ్రానివి. పయోముఖ విషకుంభానివి. మళ్ళీ ఏ ముఖం పెట్టుకుని వచ్చావ్? ఏ కొత్త నాటకం ఆడదామని వచ్చావ్?"

ఆగి రొప్పసాగింది. కాని అతన్లో అణుమాత్రపు కదలిక కూడా రాలేదు!

"ఇంకా అలా దిష్టిబొమ్మలా కూర్చున్నావేం? వెళ్ళవతలికి. నీ ముఖం చూస్తే చాలు పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయి. నువ్వన్నా నీ నీడన్నా నాకు పరమ అసహ్యం. చీమూ, నెత్తురూ, సిగ్గూ, లజ్జా ఉంటే మళ్ళీ జన్మలో నీ ముఖం నాకు చూపించకు. వెళ్ళవతలికి. నిన్ను చూస్తోంటే నా ఒళ్ళు దహించుకుపోతోంది. ఇంకాస్సేపుంటే నిన్నేం చేస్తానో నాకే తెలీదు. ఫో అవతలికి!"

ఆమె తిట్టింది. కసిరింది. అసహ్యించుకుంది. ఛీత్కరించింది. ఫొమ్మని తర్జని చూపించింది. అయినా అతడు కదల్లేదు. చలనరహితంగా వుండిపోయాడు. ఆమె కోపావేశం తగ్గేవరకూ తల కూడా ఎత్తలేదు!

పిమ్మట తగ్గు స్వరంతో అన్నాడు.

"నీ ప్రతిమాటా అక్షరసత్యం హర్షా. నేన్నీ తిట్లకి అర్హుడ్నే. నీ స్థానంలో నేనున్నా అలాగే నిందించేవాడ్ని. నిజమే. నేను పాపినే. కాని ఈ పాపం ఎందుకు చేశాను? ఈ మోసం ఎందుకు చేశాను? నేనూ మనిషినేకాబట్టి. నాకూ మనస్సుంది కాబట్టి. నాకూ సుఖ సంతోషాలని జుర్రుకోవాలన్న బలమైన కోరిక వుంది కాబట్టి!"

"సమర్థించుకుంటున్నావా?"

"కాదు నివేదించుకుంటున్నాను. నా గుండె చీల్చి నీ ముందు పరచాలనుకుంటున్నాను''

"మా అన్నయ్యలకి చెప్పిన కథలు చాలు. నాకు విన్పించిన కథలు చాలు. ఇంకా కొత్త కథలు వినే ఓపిక నాకు లేదుగాని దయచెయ్యి. వెంటనే వెళ్ళకపోతే బాబాయి గార్ని పిలవాల్సొస్తుంది!" కఠినంగా అంది.

అతడు నివ్వెరబోయి చూశాడు. ఆమె స్వరతీవ్రతకో లేక ఆమె చెప్పిన విషయానికో మరి!

"ఒప్పుకుంటున్నాను. మీ అన్నయ్యలకి పచ్చి అబద్ధాలు చెప్పేను. వారి మాటల్ని వక్రీకరించి నీకు చెప్పేను. ఎందుకు? నీకోసం. నీ ప్రేమకోసం. ఎలాగైనా నిన్ను నాదాన్ని చేసుకోవాలనే స్వార్థంకోసం. వాళ్ళు నిన్ను రెండో పెళ్ళివాడికివ్వడానికే ఇష్టపడలేదు. ఇక నా కెలా ఇస్తారు? అందుకే వారి అభిప్రాయం తెలిసేసరికి ప్లేటు ఫిరాయించాను. వారినుంచెలాంటి ఆటంకమూ రాకుండా జాగ్రత్తపడ్డాను. మన గురించెవరైనా ఆకాశరామన్న ఉత్తరం రాసినా వారికి నిజం తెలీకూడదని వదంతులున్నాయంటూ చెప్పి తప్పుదారి పట్టించాను''

"ఈ తెలివితేటల ప్రదర్శనంతా నాకోసమేనంటావ్. నామీది ప్రేమ చేతేనంటావ్. నన్ను నమ్మమంటావ్. నేన్నీకళ్ళకి వెర్రిగొర్రెలా కన్పిస్తున్నానా?"




"నువ్వు నమ్మినా నమ్మకపోయినా నిన్ను నా మనస్సునిండా ప్రేమించానన్నది పచ్చి నిజం. నా గొంతులో వూపిరున్నంతవరకూ నిన్ను ప్రేమిస్తూనే వుంటాను హర్షా!"

"నీ ప్రేమకోసం ఇక్కడెవరూ అంగలార్చడం లేదుగాని దయచెయ్యి. నీకల్లబొల్లి కబుర్లు నమ్మే ఆడవాళ్ళుండకపోరు. వెళ్ళి వాళ్ళకి విన్పించు''

"లేదు హర్షా. నువ్వు వినాల్సిందే. నా కథ నాలో చెలరేగుతోన్న సంఘర్షణ నువ్వు విని తీరాల్సిందే. నువ్వు వింటే తప్ప నా ఆవేదనాగ్ని చల్లారదు. నాకు మనశ్శాంతి లభించదు''

"ఇక కబుర్లనవసరం. జరిగింది చాలు. నా మనస్సు విరిగిపోయింది. మరి అతకదు. ఇక నన్ను నా మానాన బతకనియ్యి. నీకు వేనవేల నమస్కారాలు!"

"అంత పరుషంగా మాట్లాడకు హర్షా భరించలేను. దయచేసి నన్ను మాట్లాడనీ. నా కథ చెప్పనీ. నా గుండె వ్యధ చల్లార్చుకోనీ. అప్పటికీ నేను తప్పుచేశానని తీరని ద్రోహం చేశానని నీకన్పిస్తే నువ్వు భావిస్తే నీ జీవితంనుంచే కాదు ఈ భూమ్మీదనుంచే మౌనంగా నిష్క్రమిస్తాను''

వులిక్కిపడి చూసింది. వెర్రిగా చూసింది.

"నా భార్య జానకి నా మేనమావకూతురే. చిన్నప్పట్నుంచీ కూడా కొంచెం పిచ్చి వుంది. పెళ్ళైతే పిచ్చి కుదురుతుందన్నారు. నాకు వూహ తెలియనప్పుడే మా నాన్న చనిపోతే మా అమ్మనీ, నన్నూ ఆదుకున్నది మావయ్యే. ఆయన రుణం తీర్చుకోడంకోసం పిచ్చిదాని మెళ్ళో తాళికట్టాను. నాదురదృష్టంకొద్దీ పిచ్చి ముదిరింది కాని తగ్గలేదు. పిల్లలు పుడితే వాళ్ళకీ పిచ్చిరావచ్చన్నారు..."

ఆగి ఆమెవంక చూశాడు. సానుభూతిగా చూస్తోంది. తిరిగి చెప్పసాగాడు.

"చిన్నప్పట్నుంచీ కూడా నాకు పిల్లలంటే ఎంతో ఇష్టం. నిజానికి పెళ్ళైన మరుక్షణంనుంచీ పిల్లలకోసం తపిస్తున్నాను. అయినప్పటికీ డాక్టర్ల సలహాప్రకారం నా తపనని, ఆరాటాన్ని నాలోనే సమాధిచేసుకున్నాను. జానకికి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించాను. కనీసం జానకి మామూలు మనిషైతే చాలని ఎంతో ప్రయత్నించాను. ఎన్నో రకాల వైద్యం చేయించాను. సేవచేశాను. కానామె మారలేదు. ఎందుకు నవ్వుతోందో, ఎందుకు ఏడుస్తోందో తెలీని పిచ్చిమాలోకం అది. ప్రేమ, అనురాగం, చల్లని మాట, చక్కని పాట, సరస సంభాషణ ఏమీ తెలీని జడపదార్థం. ముప్పై ఏళ్ళకే వైరాగ్య భావనతో నలిగిపోతూండగా నువ్వు కన్పించావు''

ఊపిరి పీల్చుకోడానికన్నట్టు ఓ క్షణం ఆగి చూశాడు. ఆమె శ్రద్ధగా వింటోంది. సంభాషణ కొనసాగించాడు.

"ఎడారిలో దప్పికతో అలమటించిపోతున్న వాడికి ఒయాసిస్సులా కన్పించావు. ఎండి బీటలు వారిన నా గుండెమీద చల్లని పన్నీటి జల్లులా కురిసింది నీ పరిచయ భాగ్యం. నేను కోరుకున్న లక్షణాలన్నీ నీలో మూర్తీభవించివున్నాయి. నా వూహా మూర్తికి రూపంవస్తే అచ్చం నీలాగే వుంటుంది హర్షా. అందుకే నీకోసం నీ ప్రేమకోసం నీ చల్లని ఒడిలో సేదదీరడంకోసం నీద్వారా పిల్లల్ని కని తద్వారా వంశం నిలపడంకోసం తహతహలాడాను, తపనపడ్డాను. నువ్వు లేకుండా నీ ప్రేమ దక్కకుండా బతకలేనన్పించింది. నీమీది ప్రేమ నన్ను పిచ్చివాడ్ని చేసింది, ఉన్మత్తుడ్ని చేసింది. నువ్వే నా సర్వస్వమన్న స్వార్థంతో నీకూ నీ వాళ్ళకీ అందరికీ అబద్ధం చెప్పేను. జానకి పిచ్చిదని రుజువుచేసే సాక్ష్యాల్ని కోర్టుకి సమర్పించి విడాకులకి అప్లైచేశాను. నీకు నా భార్యగా లీగల్‌గా అన్ని హక్కులూ కల్పించాలని తాపత్రయపడ్డాను. ఇంతలో కథ అడ్డం తిరిగింది!"

"ఎవరో నీకాళ్ళకి బంధంవేశారంటావు! అంతేనా?!"

"కాసిని మంచినీళ్ళిస్తావా?"

అసహనంగా చూసి లేచి వెళ్ళి తెచ్చిచ్చింది. గ్లాసుడు నీళ్ళూ ఒక్కగుక్కలో తాగేశాడు.

"విడాకులకి అప్లై చేసిన సంగతి మా మావగారికి తెలిసింది. తన రాజకీయ పరపతినీ, పలుకుబడినీ ఉపయోగించాడు. నన్ను పోలీసు స్టేషన్కి లాక్కెళ్ళారు. గొడ్డుని బాదినట్టు బాదారు. నిన్ను వదిలెయ్యమన్నారు. ఒప్పుకోలేదు. నువ్వు నా ప్రాణం అన్నాను. చిత్రహింసలు పెట్టినా సరే భరించాన్తప్ప వారి షరతులకి అంగీకరించలేదు. దాంతో వాళ్ళు మరో ఎత్తు ఎత్తారు. నిన్ను స్టేషన్కి లాక్కొస్తామన్నారు. నా కళ్ళెదుట అత్యాచారం చేస్తామన్నారు. నీ బతుకు కుక్కలు చింపిన విస్తరి చేస్తామన్నారు. మరి భరించలేక కొలాప్స్ అయ్యాను. వారి అన్ని షరతులకీ తలొగ్గాను. పెట్టమన్న కాగితాలన్నిటి మీదా సంతకం పెట్టాను. ఇప్పుడు చెప్పు హర్షా, నా ప్రేమ మోసమంటావా? నా ప్రేమ అబద్ధం కాదు హర్షా. నీ ప్రేమని దోసిళ్ళ కొద్దీ త్రాగుతూ తరిస్తున్న అనుభూతి పొందటమూ అబద్ధంకాదు. నీ ద్వారా పితృప్రేమని చవిచూడాలనీ పున్నామనరకం నుంచి తప్పించబడాలనీ ఆరాటపడటమూ అబద్ధం కాదు''

తుళ్ళి పడిందామె.

అబార్షన్ చేయించుకోడానికి డాక్టర్ని కన్సల్ట్ చెయ్యగా ఆవిడ ఇంజెక్షన్ చేసింది. ఎర్లీ స్టేజి గనుక రెండు మూడు రోజుల్లో అబార్షన్ అయిపోవచ్చంది. లేకపోతే ఆపరేషన్ చేయాల్సుంటుందంది. కాని వారం గడిచినా గర్భస్రావం కాలేదు. అందుకే ఆ మర్నాడు అబార్షన్ ఆపరేషన్కి ఏర్పాట్లు చేసుకుంది.

అదంతా ఎంతో చిత్రంగా అన్పిస్తోంటే గుడ్లప్పగించి చూస్తుండిపోయింది.

"మాట్లాడవేం హర్షా. నీకు నా మాటల మీద నమ్మకం కలగటంలేదు కదూ? నామీదా నా ప్రేమ మీద విశ్వాసం కుదరటం లేదుకదూ? ఓ గాడ్! నిన్నింకెలా నమ్మించగలను హర్షా!"

"నన్నేమీ నమ్మించాల్సిన అవసరంలేదు. వృధా ప్రయాసపడొద్దు వెళ్ళిపో. నీ దారి నీదే నా దారి నాదే. మన మధ్య జరిగిందో పీడకల. దట్సాల్'

"కాదు కాదు నేన్నిన్ను మనసారా ప్రేమించాను. నువ్వు నాక్కావాలి హర్షా. నువ్వు లేకుండా నేను బతకలేను!"

"అయితే చచ్చిపో పీడ విరగడైపోతుంది''

"నేను లేకుండా నువ్వు సుఖంగా సంతోషంగా వుండగలవా హర్షా? నీ గుండెలమీద చేయివేసుకుని చెప్పు" కన్నీళ్ళు పెట్టుకుని జాలిగా అడిగాడు.

"ఓ నిర్భయంగా చెబుతున్నాను. నిస్సందేహంగా చెబుతున్నాను. నువ్వులేకపోయినా నేను మహారాణిలా బతగ్గలను. అసలు నువ్వన్నా నీ నీడన్నా నా కసహ్యం. ఏడ్చే నీలాటి మగాడంటే పరమరోత. రేపు నీ తాలూకు ఆనవాళ్ళనన్నిటినీ తుడిచెయ్యబోతున్నాను. కొత్త జీవితాన్ని ప్రారంభించబోతున్నాను. నువ్వెలా పోయినా నా కనవసరం. వెళ్ళిపో. తక్షణం నా ఇంట్లోంచి వెళ్ళిపో చాలు. నీకు వేనవేల దండాలు!"

"ఓకే. నీ ప్రేమ లేకుండా బతికేకన్నా చావడమే మేలు. నువ్వు నా ప్రేమని విశ్వసించనప్పుడు మరణాన్ని కావిలించుకోవడమే ఉత్తమం. నీతో కలసి బతకలేనప్పుడు కనీసం నీ కళ్ళముందు చచ్చిపోయి ఆత్మతృప్తి పొందుతాను. అప్పుడైనా నాది సత్యప్రేమ అని గుర్తిస్తే అదే చాలు. శలవు మైడియర్ హర్షా శలవ్'

ఏం జరుగుతోందో ఆమె గ్రహించే లోపల అతడు వంటింట్లోకి చొరబడి కిరసనాయిలు




డబ్బా మూత తీసి తలమీదా, ఒంటిమీదా ఒంచేసుకున్నాడు. అగ్గిపుల్ల గీచి చొక్కా అంటించుకోబోతోంటే హర్ష మరి నిలవలేక పోయింది.

"నో" అంటూ అరుస్తూ వెళ్ళి అడ్డుపడింది.

"ప్లీజ్ హర్షా. వదిలెయ్. నన్ను చచ్చిపోనియ్. నీమీదకేమీ రాకుండా ఉత్తరం రాసిపెడతాన్లే. నన్నొదిలెయ్. నా కర్మకి నన్నొదిలెయ్ ప్లీజ్"

"లేదు... నువ్వు చచ్చిపోడానికి వీల్లేదు"

"నాలాటి వాడు బతక్కూడదు. ప్రేమ ప్రేమ అని దేవుళ్ళాడాను. అది ప్రేమకాదు మోసమని ప్రేమించిన వారే ద్వేషిస్తోంటే ఇంకెలా బతకను? నన్నొదులు హర్షా. హాయిగా సంతోషంగా చనిపోనీ. నీ సమక్షంలో నిన్ను చూస్తూ ప్రాణాలొదల్నీ. నా ఆయుష్షు కూడా పోసుకుని నువ్వు సుఖంగా వుంటే అంతే చాలు!"

"వద్దొద్దు..." బలవంతంగా అగ్గిపెట్టె లాక్కుని బయటికి విసిరేసింది.

అమాంతం ఆమె కాళ్ళమీదపడి చుట్టేశాడు శ్రీను.

"నన్ను క్షమించు హర్షా. నువ్వు లేకుండా బతకలేను. పిచ్చి వాడ్నై పోతాను హర్షా. ప్లీజ్"

"వదులు..."

"వదల్ను. నువ్వు క్షమించకపోతే నీ పాదాల దగ్గర తలబద్దలు గొట్టుకుని ఛస్తాను"

నిజంగానే నుదుటిని నేలకేసి కొట్టుకొంటోంటే ఆపేసింది.

"హర్షా!" బేలగా చూశాడు. కన్నీటితో అర్థింపుగా చూశాడు.

గుండె దిటవు చేసుకుని ఒక నిశ్చయానికొచ్చింది.

"నిన్ను క్షమిస్తున్నాను శ్రీనూ. నీకోసం కాదు. నా కడుపులో పెరుగుతోన్న మన ప్రేమ ఫలం గురించి"

"ఏమిటి? మళ్ళీ చెప్పు. నేను విన్నది నిజమేనా? నేను తండ్రిని కాబోతున్నానా? చెప్పు హర్షా చెప్పు.." వెర్రి సంబరంతో ఆమె భుజాలు పట్టుకుని కుదిపేశాడు.

అవునన్నట్టు తలాడించింది.

"ఓహ్! నువ్వెంత అమృత మూర్తివి హర్షా. నాకు ప్రేమ నిచ్చావు. సుఖం ఇచ్చావు. తృప్తినిచ్చావు. ఇప్పుడు బిడ్డ నివ్వబోతున్నావు. నన్ను తండ్రిని చెయ్యబోతున్నావు. నా వంశాన్ని నిలపబోతున్నావు. నాకు తల కొరివిపెట్టి పుణ్యలోకాలకి మార్గం సుగమంచేసే పుత్రరత్నాన్ని ప్రసాదించబోతున్నావు. నువ్వు నిజంగా నా పాలిట దేవతవి. అపురూప వరానివి. అపరంజి బొమ్మవి"

మోకాళ్ళమీద కూర్చుని ఆమె నడుంచుట్టూ చేతులు వేసి ఆమె ఒడిలో తలదాచుకుంటూ అన్నాడు, అంటూ కన్నీరు పెట్టుకున్నాడు.

అతడి తల నిమిరి లేపి గుండెలకి హత్తుకుంది హర్ష!

★ ★ ★

"అమ్మాయ్ హర్షా హర్షా..." మెట్ల దగ్గర నిలబడి పిలిచింది. కామేశ్వరి.

లోపల్నుంచొచ్చిన హర్షని చూసి ఆశ్చర్యబోయింది. "ఇంకా తయారవ్వలేదేమిటీ. తొమ్మిదింటికల్లా ఆసుపత్రి కెళదామన్నావుగా"

"మరేమో పిన్నిగారూ... అసలేవయ్యిందంటే... ప్రస్తుతానికి అబార్షన్ నిర్ణయాన్ని వాయిదా వేసుకున్నాను"

ఆవిడ తెల్లబోయింది.

"నిన్న చేయించేసుకుంటానని డాక్టరమ్మతో మాట్లాడావు. నన్ను సాయం కూడా రమ్మన్నావు. ఇవాళేమో వద్దంటున్నావు.



రాత్రి రాత్రి నీ అభిప్రాయం ఎలా మారిపోయిందీ? నువ్వేమనుకుంటున్నావోగాని ఎంత త్వరగా గర్భం తీయించుకుంటే అంత మంచిది. ఆలస్యం చేస్తే పెద్ద ప్రాణానికే ముప్పు రావొచ్చు''

"ఇక హాస్పటల్ కెళ్ళాల్సిన అవసరంలేదులే పిన్నీ. ఆ ప్రయత్నం విరమించేశాను''

ఆవిడ చిత్రంగా చూసింది. "ఏం పిల్లలో ఏమో! ఓ పట్టాన అర్థంకారు కదా. నీకెలా తోస్తే అలాగే కానియ్యమ్మా. మోసేదానివి నువ్వు గాని నేను కాదుకదా!" అంటూ వెళ్ళిపోయింది.

కాస్సేపక్కడే అన్యమనస్కంగా నిలబడి లోపలికెళ్ళింది హర్ష.

శ్రీను ఆమెని చుట్టేశాడు. ముద్దుల్తో ముంచెత్తాడు. పొగడ్తలతో అభిషేకం చేశాడు.

ఆరోగ్యం బాగుండలేదన్చెప్పి వారం రోజులపాటు సిక్ లీవు పెట్టేసింది హర్ష.

అన్నాళ్ళూ శ్రీను ఇంట్లోనే మూడో కంటికి కన్పించకుండా వుండిపోయాడు. బజారు కెళ్ళినప్పుడు ఇతరులకి అనుమానం రాకుండా బయట తాళం వేసి వెళ్ళేది.

పెళ్లైన కొత్తల్లోలా మారిపోయాడు శ్రీను. ఆమెని అపురూపంగా చూసుకుంటున్నాడు. ప్రాణప్రదంగా చూస్తున్నాడు. కాలు కిందపెడితే కందిపోతుందన్నట్టు కంగారుపడ్డాడు. క్షణం విడవకుండా వెన్నంటి వుంటున్నాడు. వంటా వార్పులో సాయం వస్తున్నాడు. కొత్త రుచుల్ని చవి చూపిస్తున్నాడు.

'ఓహ్! గృహమే కదా స్వర్గసీమ!' అనుకుంది హర్ష.

'ఎవరెలా పోతేనేం ప్రపంచం ఏమైతేనేం మేమిద్దరం ఒకటి. మాది అమర ప్రేమ' అనుకుని మురిసిపోయింది.

శ్రీను గతం అనే కుబుసాన్ని విడిచేసి పరిశుద్ధుడైపోయినట్టుగా భావించి అక్కున చేర్చుకుంది. ఈ బంధం, ఈ అనుభూతులు శాశ్వతం అనుకుని ఆనందడోలికల్లో వూగింది. ఆకాశతీరాన విహరించింది.

రామలింగయ్యగారు తనని చాలాచాలా ప్రశ్నించాలనుకుంటున్నారని ఆమె గ్రహించకపోలేదు. కాని ఆయనకాఅవకాశం ఇవ్వకుండా ఆయన్నీ ఆయన కుటుంబసభ్యుల్నీ కావాలనే తప్పించుకుని తిరుగుతోంది. ఏదో హడావిడిలో వున్నట్టు నటిస్తోంది.

అంతే కాదు. కళ్ళు మూసుకుని పాలు తాగే పిల్లిలా శ్రీను తనింట్లో వున్న సంగతి ఎవరికీ తెలీదన్న భ్రమలో వుందామె!

★ ★ ★

కొత్త టీవీఎస్‌కి కామేశ్వరి నిమ్మకాయలు కడుతోంటే చూసింది. హర్ష.

"అదెవరికి పిన్నిగారూ'' అనడిగింది.

"మా ఇందిరకే. కాలేజీకి వెళ్ళి రావటానికి వీలుగా వుంటుందని వాళ్ళనాన్నగారు కొన్నారు''

"రంగు బావుంది..."

మాటల్లోనే లోపల్నుంచొచ్చింది ఇందిర.

ఆమె కొత్త చివుళ్ళు తొడిగిన మొక్కలా నవనవలాడుతూ వుత్సాహంగా వుంది. తన కాళ్ళమీద తను నిలబడ్డానన్న తృప్తివల్లనో ఏమో ఆమెలో ఆత్మ విశ్వాసం, ధీమా తొణికిసలాడుతున్నాయి.

"బావున్నారా'' అడిగింది ఇందిర.

పొడిగా నవ్వి తలాడించింది హర్ష. ఆమె ముందు తేలిపోతున్నట్టుగా అన్పించింది. ఎంతో ఇన్ఫీరియర్‌గా ఫీలయ్యింది.





"ఒక మగాడు నిర్లక్ష్యం చేసినంత మాత్రాన అంతా అయిపోయిందని ఏడుస్తూ ఇంట్లో కూర్చోవడం అవివేకం కదా. పైగా మా అమ్మాయిది ఏదైనా సరే సాధించే తత్వం. చదువుల్లో, ఆటల్లో, అన్నిటా ఫస్టే వచ్చేది. అల్లుడు సరైన వాడైవుంటే చాలా ఎదిగిపోయేదమ్మా. ఏమో ఇప్పుడైనా సాధిస్తుందేమో ఇందిర అని పేరు పెట్టాను కదా'' అన్నారు రామలింగయ్యగారు.

ఇబ్బందిగా కదుల్తూ అటూ ఇటూ చూసింది హర్ష. ఆయన మాటలకి భుజాలు తడుముకోకుండా వుండలేకపోయింది.

"మొగుడు తన్నితగలేస్తే ఏడుస్తూ వచ్చింది. ఏదో ఉద్యోగం చేస్తున్నంతమాత్రాన గొప్పదైపోయినట్టు కబుర్లు! ఈ బడాయి ఎన్నాళ్ళో నేను చూడకపోను'' అనుకుంది.

ఆమె చూపులు గోపీమీద పడ్డాయి.

ఇదివరకు అప్పుడప్పుడూ తన పోర్షన్లో కొచ్చేవాడు. వాడికోసం చాక్లెట్లు తెచ్చి వుంచేది కూడా. కానీమధ్య రావట్లేదు. తన వంక అదోలా చూస్తున్నాడు. దూరంనుంచే వెళ్లిపోతున్నాడు. తన గురించి ఆ పసివాడికేం తెలిసిందో మరేమనుకుంటున్నాడో ఏమో!

చిన్నగా నిట్టూర్చింది.

టాటా చెప్పి ఇందిర కొత్త బండిమీద కాలేజీ కెళ్ళిపోయింది.

"రెండు నిమిషాలు మాట్లాడాలి. రా అమ్మాయ్. ఎలాగూ సెలవులోనే వున్నట్టున్నావుకదా..." ఆఫీసు రూములోకి దారితీస్తూ అన్నారు రామలింగయ్యగారు.

అనుసరించక తప్పలేదామెకి.

"మళ్లీ తొందరపడుతున్నావనిపిస్తోందమ్మాయ్'' ఫోన్ వేపొచ్చి కూర్చుంటూ అన్నారు.

"లేదు బాబాయ్. శ్రీనుని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. అతడు లేకుండా బతకలేనని ఈ నాల్రోజుల్లోనే అర్థమైపోయింది. అతడూ నన్ను గాఢంగా ప్రేమిస్తున్నాడు. నా కోసం ప్రాణాల్నివ్వడానిక్కూడా సిద్ధపడ్డాడు తెలుసా?"

"కాని అక్రమ సంబంధం ఎప్పటికీ అక్రమమే. అనైతికమే. దాని ప్రభావం నీమీదా నీ సంతానం మీదా వుండితీరుతుంది''

"వుండనీండి. ఫేస్ చెయ్యడానికి నేను సిద్ధం. ఫేస్ చెయ్యలేని పరిస్థితొస్తే గుక్కెడు విషం తాగి ఛస్తాంగాని మేం విడిపోం. పెద్దవారు. మీకు చెప్పేంతదానిని కాదు. ఈ సమాజపు బూజు పట్టిన విలువల కళ్ళద్దాల్లోంచి గాకుండా వివేకంతో, విజ్ఞతతో చూడండి. ఆలోచించి చెప్పండి. జరిగిందాన్లో శ్రీను తప్పేంలేదు..."

"అని నువ్వు సర్టిఫై చేస్తున్నావన్నమాట. బావుంది''

"వాస్తవమేమిటో తెలిస్తే మీరూ అదే మాటంటారు. శ్రీను పెళ్ళాం ఓ పిచ్చిది. బలవంతాన అంటగట్టబడిన గొడ్రాలు. నవ్వూ పువ్వూ తెలీని జడపదార్థం. అలాటి ఆడదానితో ఎవరైనా ఎలా కాపురం చెయ్యగలరు? చూస్తూ చూస్తూ బతుకుని నరకంగా ఎలా మార్చుకోగలరు? అతడి స్థానంలో మీ అబ్బాయి వుంటే ఇలాగే వ్యతిరేకించేవారా చెప్పండి? మీ అల్లుడు మీ అమ్మాయిని వదిలేశాడన్న వుక్రోషంతో మాట్లాడకండి. అతడి కారణాలేమిటో మనకి తెలీవుకదా''

బాధగా చూశారు. పొడిగా నవ్వారు.

"చాలా ఎదిగిపోయావమ్మా. కాని చూడమ్మాయ్. నువ్వు మాకేమీ కావు. నువ్వేమైనా మాకు ఫర్లేదు. అయినా నువ్వు బాగుండాలని, నీ బతుకు బాగుండాలని మేం తాపత్రయపడుతున్నాం. ఎందుకో నువ్వే ఆలోచించు. చిన్నపిల్లలు ఎవరి పిల్లలైనా సరే నిప్పుని ముట్టుకోబోతోంటే వారిస్తాం. హెచ్చరిస్తాం. ఎందుకో ఆలోచించు. సర్వేజనా సుఖినోభవంతు అంటారు. ఎందుకో నువ్వే

ఆలోచించు. పిచ్చిదానా! నువ్వు కొరివితో తలగోక్కుంటానంటే చూస్తూ వూరుకోడానికి మేం రాక్షసులంకాదమ్మా. సాటి మనిషిమీద ప్రేమాభిమానాలున్న మనుషులం..."

"నేను ముందే చెప్పేనుగా బాబాయ్. మీ దృష్టిలో తప్పుగా క్షమించరాని నేరంగా అనిపించొచ్చు. కాని మాకిదే బావుంది. మాకీ అనుబంధమే కావాలి. ఎవరేమనుకున్నా ఎవరెలా పోయినా మా కనవసరం. వుయ్ డోంట్‌కేర్. మా చిన్ని స్వర్గం పదిలంగా వుంటే మాకంతే చాలు''

"సరే. నీ ప్రకారమే ఆలోచిద్దాం. పరాయి స్త్రీ అయిన సీతని ఎత్తుకొచ్చి రావణుడు లంకలో దాచాడు. అయినా రావణుడు సుఖంగా వున్నాడా? లంక పదిలంగా వుందా?"

"అది రామాయణం. అదో అభూత కల్పన!"

నవ్వేరాయన. "ఒకప్పుడు రామాయణాన్ని మించిన గాథ లేదన్నావు. రాముడంటే అపరిమితమైన భక్తిప్రపత్తులున్నాయన్నావు. రాముడు ధర్మవ్రతుడన్నావు. పుణ్యశ్లోకుడన్నావు. సీతారాములు ప్రతి దంపతులకీ ఆదర్శమన్నావు. అదంతా మర్చిపోయావా తల్లీ''

"మర్చిపోలేదు. అప్పటి నా ఆలోచనలు చాలా కురచవి. కుంచించుకుపోయినవి. ఇప్పుడు చాలా విశాలమయ్యాయి. మనం సమాజంకోసమో సమాజం చేత మెప్పు పొందటానికో బతకటంలేదు. మనం మనకోసమే బతుకుతున్నాం. ఆ సంగతి నాకిప్పుడే తెలిసొచ్చింది''

"నీకు తెలిసిందే నీతి కాదు, రీతి కాదు. సమాజంనుండి వేరుపడి నువ్వేకాదు ఎవరూ సుఖంగా బతకలేదు''

"అయితే ఏమిటంటారు? శ్రీనుని చేరదీయడం తప్పంటారు. అంతేనా?"

"అంతే కాదమ్మాయ్ ఇంకా చాలా వుంది. నువ్వు నీవాడు కాని పరాయిపురుషుడ్ని అంటే రాముడ్ని కిడ్నాప్ చేశావు. అంటే రావణి రాముడ్నెత్తుకొచ్చిందన్నమాట. అంటే ఇది సీతాయణం అన్నమాట. రావణుళ్లానే నువ్వూ క్షేమంగా వుండలేవు. నీవాళ్ళూ సుఖంగా వుండలేరు. సమాజాంగీకారంగాని, న్యాయస్థానపుదన్నుగాని, అయిన వారి సానుభూతిగాని ఏమీ నీకు లేవు-వుండవు. అవన్నీ నీకు దక్కాలంటే అతడు చట్టబద్ధంగా మొదటి భార్యనుండి విడాకులు తీసుకోవాలి. లేదా ఆమె దగ్గర్నుంచి సమ్మతిపత్రం తీసుకోవాలి. అప్పుడే మీ పెళ్లి చెల్లుతుంది. అంతవరకూ మీది పెళ్లికాదు పచ్చి వ్యభిచారం!"

చివ్వున తలెత్తింది.

ముక్కుపుటాలదుర్తోంటే రోషంగా చూసింది.

"ఆ రామాయణంలో సీత రావణుడ్ని అల్లంత దూరాన వుంచింది. కానీ సీతాయణంలో రాముడు రావణిని ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నాడు. ఆ సీతకీ నా శ్రీనుకీ పోలికే లేదు. ఆ సంగతి మీరు గుర్తించాల్సింది. ఇంకో సంగతి. మీరేకాదు ఈ ప్రపంచమంతా ఏకమై ఒంటికాలిమీద లేచొచ్చినా మమ్మల్నేమీ చెయ్యలేదు. మా తలమీది వెంట్రుక కూడా పీకలేరు. మీ ఇన్ఫర్మేషన్ కోసం మరో వార్త. భార్య పిచ్చిదని రుజువుచేసే పత్రాల్ని కోర్టులో దాఖలు చేసి విడాకులకి శ్రీను ఎప్పుడో అప్లై చేశాడు. దటీజ్ మై శ్రీను''

ఆమె తలెగరేసి గర్వంగా హుందాగా నడిచెళ్లిపోయింది.

ఆమెలో కొత్త మనిషి కన్పిస్తోంటే జాలిగా చూస్తూండిపోయారాయన!

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ సర్' బ్యాంకు మేనేజర్ని విష్ చేసింది హర్ష.

"మార్నింగ్. ఏవిటిన్నాళ్లు లీవు పెట్టేశారు?"





"హెల్త్ బాగోలేదు సార్. సిక్‌లీవ్..."

"బజార్లో చాలాసార్లు కన్పించార్ట..."

"అదీ..." నీళ్లు నమిలింది.

"మీరు సిన్సియర్ ఆఫీసరని చెబితే కాబో లని నా బ్రాంచికి అసిస్టెంట్ మేనేజరుగా చెయ్యడానికి ఒప్పుకున్నాను. కాని నేను తప్పుడు అభిప్రాయానికి లోనయ్యాననిప్స్తోంది. మీ లీవు రికార్డు పరమఛండాలంగా వుంది తెలుసా? ఎప్పుడొస్తారో, ఎప్పుడు లీవు పెడతారో తెలీదు. అసలు వున్న లీవులన్నీ ఉపయోగించెయ్యడానికే నా బ్రాంచి కొచ్చారా?"

"అది కాద్సార్. మరేమో..." ఆపైన ఏం చెప్పాలో తెలీక గమ్మునుండిపోయింది.

"అయాం వెరీ సారీ. ఇలాటి పరిస్థితిని టాలరేట్ చెయ్యలేను. లోన్సు వర్కంతా పెండింగులో పడిపోయింది. యన్పీఏ రికవరీ జీరోస్థాయి కొచ్చేసింది. నోనో ఐ కాన్ట్ బేరిట్. మీరు మీ పద్ధతి మార్చుకోకపోతే మిమ్మల్ని మరోచోటికి ట్రాన్స్‌ఫర్ చేసెయ్యమని కోరాల్సొస్తుంది. మైండిట్"

ముఖాన గంటుపెట్టుకుని తన సీట్లోకెళ్ళి కూర్చుంది.

"తనెన్నడూ పనిని అశ్రద్ధ చేసెరగదు. మంచి వర్కర్ అన్పించుకుంది. తను పనిచేసిన ప్రతిచోటా కూడా పొద్దుటే లేచి రుణవసూళ్లకోసం పరిసర గ్రామాలకీ లేబర్ కాలనీలకి కూడా వెళ్తోంది. మొండిబాకీల వసూళ్ల కోసం ఎన్నెన్నిసార్లు తిరిగిందీ ఆయనకి మాత్రం తెలీదూ!

అలాటిదాన్ని పట్టుకుని పనిదొంగలా చూస్తాడా? అత్యవసరమైన లీవు పెడితే నానా మాటలంటాడా?

ఛీ! నడిచే ఎద్దునే పొడుస్తారు. పనిచేసేవారికి విలువ లేదసలు. కాలం కాకారాయుళ్లదే అయిపోయింది. బోల్డు పనిచేస్తున్నట్టు నటించే వాళ్ళకే గౌరవం. ఇలాంటిచోట ఒళ్లొంచి పనిచేయడం అనవసరం. మిగతా వాళ్ళలా తనూ కబుర్లతో కాలక్షేపం చేసెయ్యాలి. చక్రం తిరగాలిగాని బండి ముందు కెళ్లనట్లుండాలి. అప్పుడే ఇతగాడి తిక్క కుదుర్తుంది''

హర్ష మనస్సు కుతకుత వుడికిపోతోంది.

కరెస్పాండెన్స్ చూస్తోందన్నమాటేగాని అందులోని విషయాలేమీ ఆమె బుర్ర కెక్కడంలేదు.

ఈమధ్య సహోద్యోగులు కూడా ఆమెతో ముభావంగా వుంటున్నారు. శిల్ప అయితే ఆమెతో కలిసి లంచ్ కూడా చెయ్యట్లేదు. ఆమెతో రాసుకుని తిరిగితే తనకెక్కడ తాటాకులు కడతారోనని భయపడుతోందేమో. లేక ఆమె భర్త ఏమైనా ఆంక్షలు విధించాడో మరి! సరిత ఇదివరకట్లానే మాట్లాడుతోందిగాని కొంచెం దూరం దూరంగా మసుల్తోంది.

ఆమె చాటున నవ్వుకోవడం వ్యంగ్యాస్త్రాలు విసుర్తూండటం ఆమె చెవిదాకా రాకపోలేదు. కానవేమీ పట్టించుకునే స్థితిలో లేదు హర్ష. శ్రీను తప్ప మరో లోకం లేదామెకి! మరో లోకం వుండకూడదన్నది ఆమె కోరిక.

మేనేజరు చివాట్లేసిన సంగతి బ్యాంకులో వాళ్ళంతా గమనించే వుంటారు. అయినా ఎవరూ వచ్చి తనకి సపోర్టుగా మాట్లాడనందుకు నొచ్చుకుంటూ అందర్నీ తిట్టుకుంటూ రాక్షసి బొగ్గులా రగుల్తోంది.

పోస్ట్‌మేన్ వచ్చి ఒక రిజిస్టర్డ్ లెటర్ ఇచ్చాడు.

చిట్‌ఫండ్ కంపెనీ వారిచ్చిన నోటీసది. శ్రీను వాయిదాలు చెల్లించడంలేదనీ అంచేత మీరు చెల్లించాలనీ లేనిచో కోర్టు ద్వారా వసూలు చేసుకోవాల్సొస్తుందనీ హెచ్చరించారు.

అప్పుడెప్పుడో శ్రీను 'చీటీ పాడాను జామీను సంతకం పెట్టు' అనడిగితే పెట్టింది. దాని బాపతు నోటీసది.

"ఏవో కొన్ని వాయిదాలు కట్టనందుకే అందరికీ నోటీసు లివ్వాలా? పైగా కోర్టు

బెదిరింపొకటి. కట్టకుండా ఉద్యోగులు ఎక్కడికి పారిపోతారనో!" విసుక్కుంది.

'ఛీ వెధవ మనుషులు! ఒక్కళ్ళూ తమ పరిస్థితి అర్థం చేసుకోరుకదా' అని మండిపడింది.

ఆ 'గొడవ'లో పడి కొట్టుకుంటున్నందున శ్రీను అశ్రద్ధ చేసినట్టున్నాడు. లేకపోతే నెలనెలా చిట్ కట్టేసేవాడే పాపం, ఇంటికెళ్ళగానే గుర్తు చెయ్యాలనుకుంది. వీలైతే మొత్తం అంతా చెల్లించిపారెయ్యమని చెప్పాలనుకుంది ఉక్రోషంగా.

మరో గంటకి మేనేజరునుంచి పిలుపొచ్చింది. మళ్ళీ ఏ తప్పు దొర్లిందని అక్షింతలేస్తాడోనని భయపడ్తూ వెళ్ళింది. 'పొద్దుట లేవగానే ఎవరి మొఖం చూశానో. ఇవాళన్నీ ఎదురుదెబ్బలే తగుల్తున్నాయి' అనుకుంది. ఆ వెంటనే శ్రీను మొఖం చూసేనని గుర్తొరాగా చిన్నగా నవ్వుకుంది.

మేనేజరు ఎదుట ఒక నల్లని పెద్దమనిషి కూర్చునున్నారు. ఆమె కేబిన్లోకెళ్ళగానే ఈవిడేనంటూ కళ్ళతో సైగ చేశాడు మేనేజరు.

ఆయన హర్షని ఎగాదిగా చూశాడు. నఖశిఖపర్యంతం పరీక్షించారు. ఆయన వెనుక నిలబడ్డ మరో నలుగురు కూడా ఆమెని తినేసేలా చూశారు.

వాళ్ళెవరో తననెందుకలా ద్వేషిస్తూ చూస్తున్నారో అర్థంగాక బిత్తరపోయింది హర్ష.

ఆయనకి దగ్గర దగ్గర యాభై ఏళ్ళుంటాయి. ఖద్దరు లాల్చీ పంచె, గోల్డ్ఫ్రేమ్ కళ్ళద్దాలూ ధరించివున్నారు. మనిషి ఎత్తుగా బలంగా విలన్ వేషానికి సరిపోయేవారిలా వున్నారు.

ఆయన్నీ ఆయన పద్ధతినీ అనుచరగణాన్నీ చూసి పొలిటీషియన్ కాబోలనుకుంది. ఆయనకి తనతో ఏంపనో అర్థం కాలేదు.

"ఆ వగలాడివి నువ్వేనన్నమాట. రోజూ నీ పక్కలోకి ఎవడో ఒక మగాడు కావాలన్నమాట. అందుకని బరితెగించి వూరిమీద పడ్డావన్నమాట!"

అతడి అసహ్యపు మాటలకి చివ్వున తలెత్తింది. రోషంతో బుసలుకొడ్తూ చూసింది హర్ష.

మేనేజరు కూడా ఏదో చెప్పబోయాడు గాని ఆయన విన్పించుకోలేదు. ఒకరికి చెప్పడమేగానీ ఒకరి మాట వినే బాపతులా లేడాయన.

"ఏం చూసుకునే నీ మిడిసిపాటూ! ఎర్రగా బుర్రగా వున్నావనుకుంటున్నావా? నువ్వేంటి వయసొచ్చిన పందిపిల్ల కూడా అందంగానే వుంటుందే. మదపిచ్చి పడితే ఏ తలమాసినోడ్నో కట్టుకోవాలి. అంతేగాని బాధ్యత గల వుజ్జోగం చేస్తూ కూడా పెళ్ళైన వాడి వెంట పడతావా? అంత కొవ్వెక్కిందిటే నీకు? అసల్నీకు చీమూ నెత్తురూ మానం మర్యాదా లేవా? నీ ఒంట్లో ప్రవహిస్తోంది నెత్తురా నీరా? కడుపుకి అన్నం తింటున్నావా? గడ్డి తింటున్నావా? పచ్చని నా కూతురి కాపురంలో రాక్షసిలా ప్రవేశించి రాక్షసిబొగ్గులు కుమ్మరిస్తావుటే పాపిష్ఠిదానా! నువ్వు ఆడపుట్టుక పుట్టలేదా? మానాభిమానాల్లేవా? నువ్వసలు ఒక అమ్మకీ ఒక అయ్యకీ పుట్టిందానివేనా?..."

కుర్చీలోంచి నిలబడి చేతులూపుతూ అంతకంతకీ స్వరం పెంచి అరవసాగారాయన.

స్టాఫ్ కస్టమర్స్ అంతా వింతగా ఆసక్తిగా కేబిన్ వంక చూస్తున్నారు.

హర్ష మొఖంలో కత్తివేటుకి నెత్తురు చుక్క లేదు. కాళ్ళు వణుకుతోంటే ధైర్యం జారిపోతోంటే నవనాడులూ కృంగిపోతోంటే శిలలా బిగుసుకుపోయింది.

ఆయన శ్రీను మావగారని అర్థమయ్యేసరికి గొంతు పిడచకట్టుకుపోయింది. తననేం చేస్తాడోనన్న భయం కుదిపెయ్యసాగింది. మరోపక్క సహోద్యోగులంతా తననే చూస్తున్నారన్న స్పృహ ఆమె తలని భూమిలోకి గుంజేస్తోంది.




ఆయన పిడుగుల వర్షం కురిపిస్తూనే వున్నారు. నిలువునా అవమానభారంతో దహించుకుపోతూ నిలబడే ఓపిక కూడా లేక కుర్చీలో కూలబడింది.

ఆయన మేనేజర్ కేబిన్లోంచి బ్యాంకింగ్ హాల్లోకెళ్లారు.

ఆయన రాజకీయ నాయకుడు. ప్రతి విషయానికీ జనంలోకెళ్లడం, గొంతెత్తి అరవడం, ఇతరుల్ని ఆడిపోసుకోవడం, రోడ్లమీదా పేపర్లలోనూ అల్లరి చెయ్యడం, అందరి దృష్టీ తనవైపు తిప్పుకోడానికి ప్రయత్నించడం ఆయన నైజం. సానుభూతి మూటగట్టు కోవడమే అతడి అంతిమలక్ష్యం.

"విన్నారుటయ్యా ఈవిడగారి కామకలాపాలు. బుద్ధిగా కాపురం చేసుకుంటున్న నా అల్లుడిమీద వలవేసి ముగ్గులోకి దించింది. పెళ్లైన పరాయి మగాడ్ని తీసుకెళ్లి ఇంట్లో వుంచుకుంది. హవ్వ! ఎంతకి బరితెగించిందో చూడండి. ఎంత ఘోరమో చూడండి. ఇలాటివాళ్లని ఇలాగే వదిలేస్తే సమాజానికి భ్రష్టు పట్టించేస్తారు. వివాహ వ్యవస్థని కుప్పకూల్చేస్తారు. నైతిక విలువల్నీ, సంప్రదాయాన్నీ నిలువు లోతుగొయ్యి తవ్వి పాతిపెట్టేస్తారు. ఆఫీసరుగా ఉజ్జోగం వెలగబెడ్తూ కూడా బజారుదాన్లా ఎలా దిగజారిపోయిందో చూడండి. కొవ్వు పెరిగితే పెళ్లి చేసుకోవాలిగాని ఇలా పరాయి మగాడి వెంట పడితే ఎలాగయ్యా. మీరైనా బుద్ధి చెప్పొద్దూ?"

ఆయన నోటికొచ్చినట్లల్లా పేలుతూ దులిపేస్తోంటే నిశ్చలచిత్రాలై పోయారంతా. వాళ్ళు పెళ్లి చేసుకున్నారన్న సంగతి బయటపెట్టడానికెవరికీ ధైర్యం చాల్లేదు. ఒకవేళ ధైర్యం తెచ్చుకుని చెబితే, 'దొంగపెళ్లి చేసినందుకు మీ మీద కేసు పెడతాను' అంటాడేమోనని భయపడ్డారు కొందరు.

మళ్ళీ కేబిన్లోకెళ్ళి హర్ష నుద్దేశించి అన్నారాయన, "ఆఖరిసారిగా హెచ్చరిస్తున్నాను. నువ్వు మా అల్లుడ్ని వదిలేసి ఎక్కడికిపోతావో పో. ఇక్కడ్నుంచి తక్షణం బిచాణా ఎత్తెయ్యాల్సిందే. లేకపోతే నిన్ను తిన్నగా వుండనివ్వను. సుఖంగా బతకనివ్వను. నీ బతుకు నరకం చేసిపారేస్తాను. నా సంగతి నీకు తెలీదు. తలచుకుంటే దుర్మార్గుడిగా మారిపోగల్ను. నీ ముఖంమీద యాసిడ్ పోయించగల్ను. నీ కాలో చెయ్యో తీయించెయ్యగల్ను. ఇంకా ఏమైనా చేయించేగల్ను. ఖబడ్దార్!"

అందరికీ విన్పించేలా హర్షని హెచ్చరించారు. తిడుతూ చెమట్లు కక్కుతూ ఒగురుస్తూ అనుచరుల్తో కలిసి వెళ్ళిపోయారాయన.

గాలివాన వెలిసినట్టుగా అన్పించిందందరికీ.

డైనింగ్ రూంలోకి పారిపోయి వెక్కి వెక్కి ఏడ్చేసింది హర్ష.

ఎంత దారుణం! అంతా తనదే తప్పంటున్నారు. తననే వేలెత్తి చూపిస్తున్నారు. తనకే బుద్ధులు చెబుతున్నారు. తనకే నీతులు వర్తిస్తాయంటున్నారు. ఆఖరికి హెచ్చరికలు కూడా తనకే చేస్తున్నారు.

శ్రీనుని ఎవరూ ఏమీ అనడంలేదు.

ఎంత చిత్రం!

ఈ సంఘం శాస్త్రాలూ నీతులూ అన్నీ మగపక్షపాతాలే! ఆడదాన్ని అణగదొక్కాలని చూసేవే. ఆడదాని బతుకుని మగాడి పాదాల దగ్గర కట్టిపడేసిందీ పితృస్వామ్య సమాజం!

వీటన్నిటినీ నాశనం చేసెయ్యాలి. ఈ సంకెళ్లని ఛిట్‌ఫట్‌మని తెంచెయ్యాలి. ఆడా మగా సమానమనీ తప్పొప్పులు ఇద్దరికీ సమానంగా వర్తిస్తాయనీ చెప్పాలి. ఒక తప్పుకి ఇద్దరూ బాధ్యులైతే ఇద్దరినీ సమానంగా శిక్షించాలని బోధించాలి. అప్పుడుగాని తనలాటివారికి న్యాయం జరగదు. మగజులుం తగ్గదు.

ఆమె తనువూ మనస్సూ విపరీతంగా



మథనపడుతూ ఉడకిపోతోంది. ఉక్రోషంతో వూగిపోతోంది. ఉద్వేగంతో ఏడ్చేస్తోంది.

ఇంత రాద్ధాంతం జరిగాక మరి బ్యాంకులో వుండలేకపోయింది. ఎవరికీ ముఖం చూపించగల ధైర్యం లేకపోయింది. ప్యూను ద్వారా సెలవు చీటీ మేనేజరుకి పంపి ఇంటికెళ్ళిపోయింది హర్ష.

ఇంట్లో శ్రీను 'మందు' తాగుతూ కూర్చు న్నాడు.

ఆమెకి కోపం ఉక్రోషం తన్నుకురాగా అతడిమీద విరుచుకుపడింది.

"అవతల మీ మావగారు నా బతుకు బజారుకీడుస్తోంటే నువ్విక్కడ తాగుతూ కూర్చున్నావా? నా మానప్రాణాలు కాపాడా ల్సిన వాడివి నిమ్మకి నీరెత్తినట్టు వుంటావా? అసలు మీ మగాళ్ళంతా నా గురించేమను కుంటున్నారు? ఎవరిష్టమొచ్చినట్లు వాళ్ళు కూస్తారా? ఛీత్కరిస్తారా? ఆడదాన్నని అలు సుగా తీసుకుని బెదిరిస్తారా?"

"ష్... కూల్‌డౌన్ హర్షా కూల్‌డౌన్. కమాన్. గుండెమంట చల్లార్చే పరమౌషధం ఇది. రెండు పెగ్గులేసుకో. అన్నిట్నీఅందర్నీ మర్చిపో. స్వర్గంలో తేలిపో!"

"శ్రీనూ!"

"సత్యం చెబుతున్నాను డియర్. ఇతరు లు సుఖంగా వుంటే చూడలేక కళ్లల్లో నిప్పు లు పోసుకుంటారు. మనకి లేని సుఖం వాళ్ళకి దక్కిందే అని ఏడ్చిపోతూంటారు. పైకెళ్తోన్న వాడి కాళ్లు పట్టుకుని కిందికి లాగెయ్యాలని చూస్తారు. బుట్టలోని పీతలు చూశావా. ఒకటి పైకెళ్తోంటే ఇంకోటి లాగే స్తూంటుంది. అచ్చం అలాటివాళ్లే వీళ్లు. అందుకే వీళ్ళందర్నీ మర్చిపో. జానేదేవ్ అనేసెయ్యి. లెట్ దెమ్ గోటు హెల్... కమాన్... ఎంజాయ్ యువర్‌సెల్ఫ్. ఈ జనం మిధ్య. ఈ ప్రపంచం మిధ్య..."

"ప్లీజ్ శ్రీనూ. నా ఒళ్ళంతా కొలిమిలో పెట్టి కాలుస్తున్నట్టుగా వుంది. బీ సీరి యస్..."

"పిచ్చి హర్షా. నీకో నిజం చెప్పనా. ఈ జనానికి ప్రేమంటే తెలీదు. అసలు చరిత్రలో ఏ ప్రేమికుల్ని ఏ పెద్దలు సుఖపడనిచ్చారు చెప్పు? లైలా మజ్నూ, అనార్కలీ సలీం, పార్వతీ దేవదాసూ... ఎందరో! అందరి ప్రేమా విషాదాంతమే. కాని మన ప్రేమ అలా కానివ్వను. మనది అమరప్రేమ. అపూ ర్వప్రేమ. అయ్ ప్రామిస్ యూ హర్షా. మనల్ని ఏ శక్తీ ఏయుక్తీ విడదీయలేదు. మన ప్రేమపువ్వుని ఏ దుర్మార్గమూ త్రుంచెయ్యలే దు. మనం ఒక్కటి. కమాన్ లెటజ్ సెల బ్రేట్. మనం వెన్నిచ్చి పారిపోతే తరుముతా రు. ఎదురుతిరిగితే కాళ్ళకి బుద్ధి చెబుతారు. ఈ లోకం తీరే అంత. అందుకే వీళ్లనీ ఈ లోకాన్నీ జానేదేవ్ అనేద్దాం. డోంట్‌కేర్ చె ప్పేద్దాం. మనం ఒకటి. మన స్వర్గం ఒకటి. కమాన్ డార్లింగ్..."

ఆమెకేదో మొండిధైర్యం రాసాగింది. గుండెదిటవు చేసుకోసాగింది. ఏదో తెగింపు అణువణువునా విస్తరించసాగింది.

బేలయై వెన్నిచ్చి పారిపోవటం కాదు ఎదిరించి విజయమో వీరస్వర్గమో తేల్చుకో వాలన్న కసి- కాంక్ష వేరూనింది.



**హ**ర్షకి నాలుగోనెల వెళ్ళి అయిదోనెల వచ్చింది.

లేడీడాక్టర్‌కి చూపించుకుంటూ మంగులూ టానిక్కులూ వాడుతోంది.

ఎలాటి ఆందోళనకీ గురికావద్దనీ వాటి ప్రభావం బిడ్డమీదపడే అవకాశం వుందనీ హెచ్చరించిందామె. సాధ్యమైనంతవరకూ మనస్సుని ప్రశాంతంగా సంతోషంగా వుంచుకోమంది.

అందుకనే సీమంతం లాటివిచేసి ఆహ్లాద పరుస్తూనే ధైర్య స్థైర్యాలనిస్తూంటారని తెలుసుకుంది.

తనలాటివాటికి నోచుకోలేకపోయిందే అని బాధపడింది. అయినవాళ్ళంతా వుండి కూడా ఏమీలేని అనాథ అయిపోయిందే అని ఆక్రోశించింది.

తన బిడ్డ భూమ్మీద పడేనాటికి తన సమస్యలన్నీ పటాపంచలై పోతాయని ప్రగాఢంగా విశ్వసిస్తోంది హర్ష.

శ్రీను విడాకుల కేసు వేగిరపరచడానికి తన నెక్లెస్ అమ్మి డబ్బు సర్దింది కూడా. తను శ్రీనుకి చట్టబద్ధమైన భార్య అనీ తన ప్రేమ అపురూపమైనదనీ పదిమందికీ చెప్పాలని ఆత్రుతపడుతోంది. నవ్విన వూరే నగరమవుతుందని చాటిచెప్పాలని వువ్విళ్లూరుతోంది. ఆ శుభతరుణం త్వరగా రావాలని అందుగ్గాను విడాకులు వేగిరం మంజూరవ్వాలని తిరుపతి వెంకటేశ్వరుణ్ణి కోరుతూ కళ్యాణం జరిపిస్తానని మొక్కుకుంది కూడానూ.

శ్రీను మావగార్నుంచిగాని అతడి బంధువర్గంనుంచిగాని మళ్ళీ ఎలాటి ఇబ్బందికర పరిస్థితీ ఎదురవ్వలేదు.

ఎప్పట్లానే బ్యాంకుకెళ్తోంది. వస్తోంది. మితభాషిగా వుంటోంది. ఎవ్వర్నీ దేన్నీ లెక్కచెయ్యట్లేదు.

'నవ్విపోదురుగాక మాకేటి సిగ్గు' అనుకొంటోంది.

గెలుపు తమదేనని చాలా ధీమాగా వుంది హర్ష.

మొదట్లో శ్రీను ఆమె ఇంట్లో దాక్కుని వున్నాడు. తర్వాత చీకటిలో వెళ్లి చీకటిలో వచ్చేవాడు. ఇప్పుడు బహిరంగంగానే వుంటున్నాడు. భార్యాభర్తల్లానే కలిసుంటున్నారు. కలిసి తిరుగుతున్నారు.

అతడు కూడా కేంపులకి వెళ్లట్లేదు. ఇల్లు, ఆఫీసు, కస్టమర్లు వీటిని తప్ప మరేం పట్టించుకోవట్లేదు.

అవాళ బ్యాంకునుంచి వస్తోంది హర్ష. దారిలో గుడిదగ్గర కన్పించింది కామేశ్వరి. ఆగి ఆవిడ్ని స్కూటరెక్కించుకుంది.

"ఈవేళప్పుడు గుడికెళ్లేరేవిటి పిన్నిగారూ. ఏమైనా ఉత్సవాలు జరుగుతున్నాయా?"

"దేవుడికి ఉత్సవం జరగట్లేదుగాని మాకు ఉత్సవం జరుగుతున్నంత ఉత్సాహంగా వుందమ్మా. సహస్ర నామార్చన చేయించి వస్తున్నాను..."

"ఆ శుభవార్తేమిటో నాకు చెప్పరా పిన్నిగారూ''

"నా మతిమండ. నీకు చెప్పనేలేదుకదూ. మా అల్లుడు వుంచుకున్నది డబ్బూ దస్కం నగానట్రా చేజిక్కించుకుని ఎవడ్తోనో లేచిపోయిందిట. ఇహ మా ఇందిర కాపురానికి పట్టిన పీడ విరగడైపోయినట్టే. అయినా మధ్యలో వచ్చినవాళ్ళు మధ్యలోనే పోకుండా ఏటెల్లకాలం వుట్టి కట్టుకుని వూరేగుతారా ఏవిటి? కడదాకా కలిసుండేది కట్టుకున్న దొకత్తేకదా. అందం డబ్బూ వయస్సూ చూసొచ్చినవాళ్లు అవి తరిగిపోగానే మరో పుచ్చని చెట్టు చూసుకుంటారు. అది లోకరివాజు."

ఆవిడేదేదో చెప్పుకుపోతోందిగాని ఆమె చెవులకేం విన్పించట్లేదు. కానామె మాటలే మనస్సులో మార్మోగుతున్నాయి. మనస్సుని కుదిపేస్తున్నాయి.

ఒకవేళ తను కూడా ఛ ఛ తనలాటిది



కానేకాదు. ఒకే మగడు. ఒకే ప్రేమ. ఒకే ప్రాణం. చావైనా బతుకైనా శ్రీనుతోనే.

పోనీ శ్రీను...

అతడూ అంతే. తనని తప్ప మరొకర్ని కన్నెత్తి చూడడు.

అతడికి తను సుఖాన్నిచ్చింది. సంతోషాన్నిచ్చింది. ప్రేమనిచ్చింది. బతుకులోని తీపిదనం చవిచూపించింది. ఇంకొద్దిరోజుల్లో వంశాంకురాన్నివ్వబోతోంది. అలాటి తనని, అతడు వదిలెళ్ళడం అసంభవం. పోలీసుల చేతుల్లో చిత్రహింసలనుభవించి కూడా తనని వెదుక్కుంటూ రావడమే అందుకు సాక్ష్యం!





తను కాదన్నదని ఆత్మహత్యకి తలపడ్డాడంటే అతడి అనురాగానికి అంతకంటే నిదర్శనం ఏం కావాలి? తనమీది ప్రేమ అందర్నీ ఎదిరించగల శక్తి ప్రసాదించిందతడికి!

పిన్నిగారన్నట్టు ఒకవేళతడు తన అందాన్నో వయస్సునో డబ్బునో ఉద్యోగాన్నో చూసి తనవైపాకర్షింపబడలేదుకదా? అవి తరిగిపోతే మరో 'కొమ్మ' కోసం ఎగిరిపోతాడేమో!

గుండెలు గుబగుబలాడాయి.

రకరకాల మాటల్తో పద్ధతుల్తో పథకాల్తో తన దగ్గర్నుండి డబ్బు తీసుకోవడం గుర్తొచ్చింది.

ఎపార్ట్‌మెంట్ ఒక్కటే కాగితంమీద కన్పిస్తోంది. మిగతావాటికి లెక్కాపత్రం లేదు.

ఇప్పటిక్కూడా తన డబ్బుని మంచినీళ్ల ప్రాయంగా ఖర్చు పెట్టేస్తున్నాడు. రోజురోజుకీ తను అప్పుల వూబిలోకి కూరుకుపోతోంది.

ఛా! ఏవిటీ విపరీతపు ఆలోచనలు? పెళ్లయ్యాక తన డబ్బూ అతడి డబ్బూ అని వేరుగా చూడటం అన్యాయం. ఇద్దరూ గంగా యమునల్లా కలిసి ఒక్కటై పోవాలనుకోలేదూ? పైగా ఒకరి ఆనందం ఒకరిదైనప్పుడు ఒకరి అవసరం మరొకరిది కాదా? కాపురమన్నాక తగ్గూ మొగ్గూ వుంటాయి. సర్దుకుపోవాలి. సంసారమన్నాక అప్పులవుతాయి. అందులో అసహజమూ అన్యాయమూ ఏముంది? గుండెలు బాదుకోవాల్సినంత పనేముంది?

కామేశ్వరిని డ్రాప్ చేసి ఇంట్లోకి నడిచిందన్నమాటేగాని హర్ష మనస్సు ఎందుచేతో చేదుగా వుంది.

ఏ మూలో అసంతృప్తి, అభద్రత సెలవేయసాగింది.

హఠాత్తుగా వూడిపడ్డాడు హర్ష చిన్నన్నయ్య గిరీశం.

ఆశ్చర్యబోతూనే ఆనందంగా ఆహ్వానించిందిగాని అతడు వస్తూనే ఉరుమై విరుచుకుపడ్డాడు.

"ఏమే. అసల్నీ గురించి నువ్వేమనుకుంటున్నావే. మేమంతా చచ్చామనుకుంటున్నావా?"

"అది కాదన్నయ్యా..."

"ఛీ అలా పిలవకు. అన్నయ్యనే అభిమానం ఏమైనా మిగిల్చావా అసలు? నలుగుర్లో మన కుటుంబాన్నీ వంశాన్నీ నవ్వుల పాలు చేశావుకదుటే. అమ్మా నాన్న బతుకుంటే నువ్వు చేసిన నీచమైనపనికి ఉరిబోసుకుందురే..."

"నేనంత కానిపనేం చేశాను?"

"చేసిందంతా చేసేసి సిగ్గు లేకుండా ఇంకా సమర్థించుకుంటావేమిటే? అన్నయ్య వచ్చాడు. అన్నీ చెప్పాడు. నీ బాగుకోసం అబార్షన్ చేయించుకోమనీ, అతన్తో సంబంధం తెంచుకోమనీ చిలక్కి చెప్పినట్టు చెప్పాడు. ట్రాన్స్‌ఫర్‌కి అప్లై చేసి అతడికి దూరంగా వెళ్ళిపొమ్మనీ చెప్పాడు. అన్నింటికీ గంగిరెద్దులా తలూపావు. వాడెళ్ళేక మళ్లీ నీ తిరుగుళ్ళూ నీ పద్ధతీ మొదటికే వచ్చాయి. చేజేతులా నీ బతుకునెందుకు బండలు చేసుకుంటున్నావే? ఇదంతా మదపిచ్చే?"

"అన్నయ్యా!" కన్నీళ్ళు చిప్పిల్లగా బాధగా అరిచింది.

"అరచినంత మాత్రాన నిజం అబద్ధమైపోదు. అంతా అలాగే అనుకుంటున్నారే. లోయ నోరు మూయగలంగాని లోకం నోరు మూయగలమా చెప్పు?"

"లోకులు పలుగాకులన్నారు"

"అందుకని కాకిగోలకెందుకాస్కారం ఇవ్వాలి?"

"ప్రేమించాను, పెళ్ళిచేసుకున్నాను, అతడికంతకుముందే పెళ్ళయ్యిందని తెలీలేదు..."

"అసలు పెళ్ళికంత తొందరెందుకుపడాలి? నెలకి ఆరేడు వేలు సంపాదిస్తున్నావు. నీకు పెళ్లి కాదనెందుకని తొందరపడ్డావో మాకు అర్థంకావట్లేదు..."

"ఇలాటి మలుపు తిరుగుతుందనుకోలేదు కదా..."

"అనుకోనిది జరగటమే జీవితమే. అందుకనే కీడెంచి మేలెంచాలన్నాను.





అయ్యిందేదో అయ్యిందనుకో. అన్నయ్య వచ్చి నీ మంచికోరి చెప్పి వెళ్ళాక కూడా నువ్వు మారలేదంటే ఏమనుకోవాలి?"

"అతడు నన్ను ప్రాణప్రదంగా ప్రేమిస్తు న్నాడు''

"పెళ్ళాన్నీ అలాగే ప్రేమిస్తున్నాడేమో. ఆవిడ్తోనూ అవే డైలాగులు చెప్పాడేమో. మా గురించి నీకు కథలల్లి చెప్పలేదూ? ఆఖరికి పెళ్ళివార్త కూడా మాకు తెలీకుండా దాచలే దూ? అంతటి గ్రంథసాంగుడు ఎంతకైనా దిగజారతాడు''

"నువ్వు అపార్థం చేసుకుంటున్నావన్న య్యా. శ్రీను నా కోసం ప్రాణత్యాగానికి సిద్ధపడ్డాడు తెలుసా? అతడి భార్య పిచ్చిదవ డంవల్ల నన్ను ప్రేమించాడుగాని ఆడపిచ్చి వుండికాదు. భార్యనుండి విడాకులు తీసుకో డానికి కోర్టులో దరఖాస్తు వేశాడు. కేసు నడుస్తోంది..."

"వాటన్నిటికీ ఆధారాలు చూపించగల వా?"
నివ్వెరపోయి చూసింది.

"నిజం చెప్పు. అతడి మాటలు రుజువు చేసే పత్రాలు నువ్వేమైనా చూశావా? అతడు చూపించాడా?"

అయోమయంగా చూస్తూ తల అడ్డంగా వూపింది.

"ఆడవాళ్ళంతా కామన్‌గా చేసే తప్పేంటో తెలుసా? మగవాడ్ని అతిగా నమ్మడం! ఆ నమ్మకాన్నతడు తెలివిగా కేష్ చేసుకున్నాడు. అన్నయ్య వచ్చి వెళ్ళగానే నీ బ్రెయిన్‌ని వాష్ చేసేసి తనదారికి తిప్పేసుకు న్నాడు. ఇందువల్ల నష్టపోయేది అతడు కాదు నువ్వు. మగాడు మగమహారాజు ఎలాగైనా బతికేస్తాడు. ఛీ అని ఉమ్మేసినా దులుపుకునెళ్ళిపోతాడు. నీ సంగతేవిటే? ను వ్వలా సిగ్గూ నీతీ పరువూ మర్యాదా అన్నీ వదిలేసి ఆత్మగౌరవం చంపుకుని బతగ్గలవా చెప్పు?"

తలొంచేసుకుంది. అలాటి భయాలు తన గుండెలోతుల్లోనూ మొలకెత్తాయి మరి.

"మొన్న ప్లీడరు రామలింగయ్యగారు ఫోన్‌చేసి నీ గురించీ ఇక్కడి గొడవల గు రించీ చెబితే నమ్మలేకపోయాం. అసలు అన్నయ్యా నేనూ కూడా కలిసొచ్చి నిన్ను తీసుకుపోదామనుకున్నాం. అర్జంటు పనుండి తను రాలేకపోయాడు. ఊరుకాని వూళ్ళో వుంటున్నావు. అతడి తరపువాళ్ళే మో ఈ ప్రాంతంవాళ్ళాయె. వాళ్ళు నిన్నే మైనా చేస్తే నీకిక్కడ దిక్కెవరే?"

హర్షకి ఏడుపొచ్చేసింది.

"నేను చేసింది తప్పని ఎత్తి చూపడానికి ప్పుడొచ్చారు. ఇదివరకు నేను మీకు గుర్తు న్నానా? నా గురించేమైనా పట్టించుకు న్నారా?"

"షటప్. పెళ్ళంటే ఏవిటనుకున్నావే? కట్నాలూ లాంఛనాలూ భోజనాలూ వెరశి నోట్లకట్టలు! ఎవరి బతుకు వాళ్ళే బతకలేకపో తోంటే వేలు కట్నంగా గుమ్మరించడానికి కాలూ చెయ్యా కూడ తీసుకోవద్దూ? అసలు మాకన్నా నువ్వే ఎక్కువ సంపాదిస్తున్నావు. నెలకింత చొప్పున వెనకేసి ఇంత కూడ బెట్టేను అన్నయ్యా అనంటే మాకు వెసులు బాటుగా వుండేదికాదూ? జీతమంతా నగలకీ చీరలకీ తగలేశానని చెప్పావు..."

"పదిమందిలోకెళ్ళి ఉద్యోగం చేస్తున్నదా న్ని. ఆఫీసర్ హెూదాలో వున్నదాన్ని. అందు కనుగుణంగా వుండొద్దా? ఇంట్లో హంగులు అమర్చుకోవద్దా? అది తప్పయిపోయిందన్న మాట"

"తల తిక్కగా వాగకు. మంచం వున్నంతమేరే కాళ్ళు చాపుకోవాలి. నీ జీతంతోనే నీ పెళ్ళి చెయ్యాలని మేమేం భీష్మించుక్కూర్చోలేదు. నువ్వు కూడా చేదో డు వచ్చివుంటే బావుండేదన్నానంతే. అక్క డికీ కొన్ని సంబంధాలు చూశామా లేదా? మొదట్లో అన్నిటా నీకన్నా పైఎత్తువాడు కావాలని కూర్చున్నావు. తర్వాత నీ వయ

స్సు పెరిగేకొద్దీ అందుకు అనువైన వయస్సువాడ్ని చూడాల్సి రావడమే తలనొప్పి అయ్యింది''

"అయితే తప్పంతా నాదేనంటావు? మీదెవరిదీ లేశమంత కూడా లేదంటారు?" రోషంగా ప్రశ్నించింది.

"నిస్సందేహంగా నీదే తప్పు. ఇదివరకు జరిగిందేదో జరిగింది. ఇక అతగాడి గొడవ మర్చిపో అని అన్నయ్య చెప్పేళ్ళాడు. అయినా కూడా నీకు బుద్ధిరాలేదంటే ఏమనుకోవాలి? ఆ దుర్మార్గుడి మాయలో మోజులోపడి..."

సరిగ్గా అప్పుడు గదిలోంచొచ్చాడు శ్రీను.

నిర్ఘాంతబోయి చూశాడు గిరీశం. వెంటనే గుర్తుపట్టేశాడు.

అతడు లోపల వుండివుంటాడని వూహించలేదతడు. కోపతరంగం ఉవ్వెత్తున ఎగసి రాగా అతడిమీదకి దూసుకెళ్ళాడు.

"ఏరా స్కౌండ్రల్. నా దగ్గరికొచ్చి నా చెల్లెలు అలా తిరుగుతోంది, ఇలా తిరుగుతోంది జాగ్రత్తగా చూసుకోండని హెచ్చరించి నువ్వు చేసిన పని ఇదిట్రా. దాని పచ్చని బతుకుని కాటేస్తావుట్రా దౌర్భాగ్యుడా''

అతడి కాలర్ పట్టుకుని గుంజాడు.

"నువ్వెవడివిరా నన్ను కొట్టడానికీ..." అంటూ ఎదురుతిరిగి డొక్కల్లో పొడిచాడు శ్రీను.

ఇద్దరూ కలబడి కొట్టుకొంటోంటే పరుగునెళ్లి అడ్డుపడి విడదీసింది హర్ష.

"ఫోరా ఫో. వెంటనే ఇంట్లోంచి ఫో. లేకపోతే నేనేం చేస్తానో నాకే తెలీదు'' అన్నాడు గిరీశం ఒగురుస్తూ.

"పోవాల్సింది నేను కాదురా. ఇది నా ఇల్లురా బేవకూఫ్. ఇంతసేపూ నువ్వు వాగిందంతా వింటూనేవున్నాను. నీకు బుద్ధిచెప్పాలనే బయటికొచ్చాను. మర్యాదగా తోక ముడుచుకుని బయటికెళ్తావా వెళ్ళు. లేకపోతే..."

"ఏం చేస్తావురా? మేమేం చేవచచ్చిలేం"

"వూరికే రెచ్చగొట్టకు. నేను రెచ్చిపోయానో నీ రక్తం నేలకారిందన్నమాటే''

"అంతటి మొనగాడివా. అమాయకురాల్ని మోసం చెయ్యడం కాదురా దమ్ముంటే ముందుకి రారా''

హర్ష అడ్డుపడి గిరీశాన్ని గుమ్మంవేపుకి తీసుకుపోయింది.

ఈలోగా కేకలు విని రామలింగయ్య దంపతులు కూడా పరుగున వచ్చారు. వాళ్ల తోబాటే వచ్చిన గోపి విప్పారిత నేత్రాలతో చూస్తూండిపోయాడు.

"నీకు దణ్ణం పెడతాను అన్నయ్యా. ప్లీజ్ వెళ్ళిపో అన్నయ్యా''

"వాడ్ని మెడబట్టి బయటికి గెంటాల్సిందిపోయి నన్ను పొమ్మంటావేమిటే''

"ఆయన నా మెడలో పసుపుతాడు కట్టిన భర్త''

"అది పసుపుతాడు కాదే పలుపుతాడు''

"ఏదైనాకానీ అతడు నా భర్త. అతడితోడిదే నా బ్రతుకు''

"మూర్ఖంగా ప్రవర్తించి నీకాళ్లు నువ్వు నరుక్కోకు. ఒకర్ని కాదని నీ పంచన చేరినవాడు రేపు నిన్నూ కాదని ఇంకోచోట చేరడని గ్యారంటీ ఏమిటే?''

"ఎలా జరగాలని రాసుంటే అలా జరుగుతుంది. అదేదో నేనే అనుభవిస్తాన్లే''

"నీకసలేమయ్యిందే? ఇంత ఇడియట్లా మాట్లాడతావేంటి? నీ ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం అన్నీ ఏ బూడిదలో కలిశాయే? చదువు సంధ్యలుండి కూడా ఇలా ఎలా ప్రవర్తిస్తున్నావో నాకర్థం గావట్లేదు''

"నీకర్థం గాకపోతే మాకొచ్చే నష్టమేం లేదుగాని ఇంక దయచెయ్యి. మహగొప్పవాడివిలే. చెల్లెలి కాపురం కూల్చడానికొచ్చిన ఘనుడివి'' వెనకనుంచన్నాడు శ్రీను.

"నా చెల్లెలు చేస్తోంది సంసారమైతే





పూలూ పళ్ళతో వచ్చేవాడ్నిరా పుండాకోర్. అదిప్పుడు నీతో చేస్తోంది సంసారం కాదు వ్యభిచారంరా..." దుఃఖోద్వేగంతో వూగిపోయాడు గిరీశం.

"అన్నయ్యా! ఇంకొక్కమాట తూలినా నేను సహించను. వెళ్ళిపో. మా మానాన మమ్మల్నొదిలి వెళ్ళిపో" అంటూ చేతులు జోడించింది హర్ష.

"హుఁ... అంతేనే. కళ్ళు మీదికెక్కిన నీకు అయినవాళ్ళూ వారి హితబోధలూ తలకెక్కవు. అన్నీ పోయాకగాని తెలిసిరాదే. అప్పుడు నెత్తీనోరూ బాదుకున్నా మేం రామే, పోతున్నానే. ఎలా పోతావో పో. ఈ క్షణంనుంచి నీకూ మాకూ ఎలాంటి సంబంధంలేదు. మేమంతా చచ్చామనుకుని ఆ దౌర్భాగ్యుడితోనే వూరేగు'' బ్యాగ్ తీసుకుని విసురుగా వెళ్ళిపోయాడు గిరీశం.

రామలింగయ్యగారు అతడ్నాపయత్నించారుగాని అతడు విన్లేదు.

"శని వదిలింది'' అన్నాడు కసిగా శ్రీనూ.

అతడ్నీ ఆమెనీ చూసి బాధగా నిట్టూరుస్తూ వెళ్ళిపోయారు రామలింగయ్యగారూ, కామేశ్వరీ.

గోపి శ్రీనుని అసహ్యంగా చూసెళ్ళిపోయాడు.

ప్రాన్పడి చిత్తరువయ్యింది హర్ష.

ఎందుకో రావణుడ్ని వదిలి వెళ్ళిపోయిన విభీషణుడు గుర్తొచ్చాడామెకి.

తన క్షేమంకోరే వారంతా ఒక్కొక్కరూ దూరమైపోతున్నారు.

తను ఒంటిగీత బొమ్మలా మిగిలిపోనుందా?

★ ★ ★

హర్ష సినిమాహాలు ముందు అసహనంగా పచార్లు చేస్తోంది.

అవతల సినిమా మొదలయ్యింది. ఇవతల శ్రీను జాడలేదు. ఎదురు చూసిచూసి విసిగిపోయింది.

"ఇదిగో బయల్దేరుతున్నానన్న మనిషి అయిపులేకుండాపోయాడు చూడు. ఈ మగాళ్ళింతే' అనుకుంటూ పక్కనే వున్న పబ్లిక్ బూత్‌నుంచి అతడి ఆఫీసుకి ఫోన్‌చేసింది.

"శ్రీను... శ్రీనివాస్‌ని పిలుస్తారా?"

"మీరెవరు?"

"నేను..." గొంతులో ఏదో అడ్డుపడినట్టు ఆగిపోయింది.

రెట్టించాడవతలి వ్యక్తి.

"అతడి భార్యని..."

"మీరా మేడం. మీ దెబ్బకి ఠారెత్తి పారిపోయాడు''

"ఏవయ్యాడు?"

"గుండెల్జారిపోగా బేజారెత్తి పారిపోయాడు. అయితే అయ్యిందిగాని మంచిపనిచేశారు. మీదెబ్బ పెన్సిలిన్ డోస్‌లా పన్జేసిందనుకోండి. కాస్త ఆలస్యం చేసినా కేసు పెట్టడం మంచిదయ్యింది. ఇక మిమ్మల్ని వెదుక్కుంటూ వచ్చేస్తాడు చూడండి. మూర్ఛరోగి మొకాన చుట్టతో కాల్చినట్టు ఇలాంటి వాళ్ళరోగం కుదర్చడానికి అలాటి చికిత్స తప్పదు''

"మీరేమంటున్నారో నాకర్థం గావట్లేదు. నేను కేసు పెట్టడం ఏవిటి?"

"మీరు శ్రీను భార్య కాదా?"

"నేను... హర్షని..."

"ఓహో మీరా, అర్థమైంది. శ్రీనివాస్ లేడు. ఎక్కడికో వెళ్ళిపోయాడు''

"ఇందాకేదో కేసన్నారేవిటి?"

"అదీ... అది..."

"నేనేమీ అనుకోను. చెప్పండి''

"శ్రీను మొదటి భార్య పోలీసుకేసు పెట్టింది. కట్నం గురించి వేధిస్తున్నాడనీ, అలక్ష్యం చేస్తున్నాడనీ ఉమన్ ప్రొటెక్షన్ సెల్‌కి ఫిర్యాదు చేసింది. పోలీసులు అరెస్టు చెయ్యడానికొచ్చారు. అది తెలిసి మనవాడు వాళ్ళకి

దొరక్కుండా తప్పించుకుని వుడాయించాడు''

ఆమె చేతిలోని రిసీవర్తోబాటు గుండె కూడా జారిపోయింది.

ఈమధ్య ఎటునుంచీ ఎలాంటి ఒత్తిడి గాని కవ్వింపుగాని లేకపోయేసరికి అంతా సెటిలైపోయిందనుకుంది. శ్రీను మావగారూ వాళ్ళూ తమ ప్రయత్నాలు విరమించారనుకుంది. పరిస్థితుల్తో రాజీపడిపోయి వుంటారని భావించింది. ఇక తమకెలాటి అడ్డంకులూ వుండవనుకుంది. ఈలోగా విడాకులు మంజూరైపోతాయి గనుక కాసింత మనోవర్తి ఖర్చుతో బయటపడి పోవచ్చనుకుంది.

కానది తుఫాను ముందరి ప్రశాంతత అనుకోలేకపోయింది.

ఇప్పుడెలా? ఈ గండం గడిచే దారేది?

అడుగుతీసి అడుగు వెయ్యలేనంత నీరసం ఆవహించింది. అక్కడే కాస్సేపు చతికిలబడింది. కాస్త తేరుకున్నాక లేచి షోడా తాగి సినిమా టిక్కెట్లు వుండగా చేసి విసిరేసింది.

స్కూటర్ స్టార్ట్ చేస్తోంటే, "కంపెనీ ఇవ్వనా?" అన్నాడొకడు పళ్ళికిలిస్తూ.

"షటప్''

"అబ్బో. పతివ్రతలా ఫోజు కొడుతోంది చూడు. దీని సోకులెవరికీ తెలీనట్టు!"

అతడి మాటలకు కళ్లల్లో కన్నీటి అల బ్రద్దలయ్యింది. కంట్లో నలకపడినట్టు నటిస్తూ కళ్లు తుడుచుకుంది.

ఇంటికెలా వెళ్ళిందో ఆమెకే తెలీదు.

ఇల్లంతా బోసిగా శవం వెళ్లిన ఇంటిలా అన్పించింది.

సోఫాలో కూలబడి ఏడ్చేసింది.

కడుపులోని బిడ్డ కల తిరిగినట్టన్పించింది. ఎంతో బాధేసింది. పంటిబిగువున నిగ్రహించుకుంది. కన్నీటిబొట్లు జారిపడ్డాయి.

బయట్నుంచెవరో పేరుపెట్టి పిలిచారు. కళ్లు తుడుచుకుని బయటికెళ్ళి చూసింది.

పోలీసులు!

ఆమె గుండె ఝల్లుమందొక్కసారే. సన్నగా కంపించిపోయింది.

మహిళా యస్సై, కానిస్టేబుళ్ళూ వచ్చి లోపలంతా వెదికారు.

"వాడెక్కడే?" అడిగింది యస్సై.

"తె... తెలీదు..."

"నీకు తెలీకుండా ఎక్కడికి పోతాడు? ఎక్కడ దాచావో చెప్పు"

"నాకు తెలీదు''

"నీ మోజులో పడినవాడు నీకు తెలీకుండా ఎక్కడికి పోతాడే. మర్యాదగా చెప్పు. కేసులో నిన్ను కూడా ఇరికించానా మా స్టేషన్ చుట్టూ కోర్టుచుట్టూ ప్రదక్షిణాలు చెయ్యలేకచావాలి''

ఒళ్ళంతా ముచ్చెమటల్తో తడిసిపోతోంటే వజవజ వణికిపోయింది హర్ష. బేలగా తడిసిన కళ్ళతో చూసింది.

"నువ్వో వెర్రి గొర్రిలా వున్నావే. వాడి మాయలో ఎలా పడ్డావ్? తాళికట్టిన పెళ్ళాన్ని కాదనేస్తే అయిపోతుందేమిటి పెళ్ళాం బాగోలేదనీ డబ్బు కావాలనీ కొత్త స్కూటరు కావాలనీ రాసిన ఉత్తరాలున్నాయి. వేధించుకు తింటున్నాడని చెప్పే ఆధారాలున్నాయి. బుద్ధిగా పెళ్లాన్ని ఏలుకుంటానని అప్పుడెప్పుడో డీయస్పీగారికి రాసిచ్చిన ఉత్తరం వున్నది. ఈ కతలన్నీ నీకు తెల్సునో లేదోగాని నేన్చెప్పేది విను. వాడెలాగూ తప్పించుకోలేడు. అన్నివేపుల్నుంచీ బిగించేసినాం. మర్యాదగా లొంగిపొమ్మను''

తలాడించింది.

"నీ ఇంటిమీద కన్నేసి వుంటాం. రాగానే మా దగ్గరికి పంపు. బెయిలిప్పించడమో రాజీ చెయ్యడమో చెయ్యొచ్చు. రాలేదనుకో 'సితా' కింద నిన్ను లాక్కుపోతాం. సీత అంటే రామాయణంలోని సీత కాదు. పతి





వ్రత పేరెట్టిన పచ్చి వ్యభిచారనేరం. సీతా అంటే తెల్సునా?"

తల అడ్డంగా వూపుతూ భయంగా చూసింది హర్ష.

నవ్వింది యస్సై. "సప్రెషన్ ఆఫ్ ఇమ్మోరల్ ట్రాఫిక్ యాక్ట్. వ్యభిచారనేరం..."

నోటి తడారిపోగా గుటకలు మింగిందామె.

"దెబ్బకి ఫినిష్షయిపోతావు. గుర్తెట్టుకో మర్యాదగా బతకాలనుకుంటే నీ ప్రియుడు రాగానే జుట్టు పట్టుకుని స్టేషన్‌కీడ్చుకురా'' మరోసారి హెచ్చరించి వెళ్ళిపోయారు.

బొమ్మలా నిలుచుండిపోయింది.

ఆమెకి కన్నీళ్లు రాలేదు- ఇంకిపోయాయేమో అసలు మిగలలేదో!



శ్రీను అదృశ్యమై వారంరోజులయ్యింది.

అతడేమయ్యాడో ఎక్కడున్నాడో తెలీలేదు హర్షకి. అతడొస్తే బావుణ్ణనివుంది. కాని తలుపు చప్పుడైతే చాలు అతడొచ్చాడేమోనని హడలిపోతోంది.

అతడొస్తే ఏంచెయ్యాలో పాలుపోవట్లేదు. లోపలికి రానివ్వాలో లేదో కూడా తోచడంలేదు. రానిస్తే పోలీసులేం గొడవ చేస్తారోనని భయంగా వుంది.

ప్లీడరుగారి పనిమనిషొచ్చి ప్లీడరుగారు రమ్మంటున్నారని చెప్పింది.

ఎందుకై వుంటుందోనని ఆలోచిస్తూ వెళ్ళింది. చిన్నన్నయ్య వచ్చి వెళ్ళాక రామలింగయ్యగారిని కలవనే లేదామె.

కామేశ్వరి ఆమెని చూసి మొఖం చిట్లించింది. "హద్దులో వుంటేనే ఆడది. హద్దు దాటితే గాడిద అని వూరికే అన్లేదు''

గొణుక్కున్నట్టుగానే అందావిడ.

ఆగి ఆవిడవంక కించిత్తు తీక్షణంగా చూసి విసవిసా ఆఫీసుగదిలోకి నడిచింది హర్ష.

రామలింగయ్యగారెదుట ఓ ముసలిజంట కూర్చున్నారు. ఆమె రాగానే అంతా తలలు తిప్పి ఆమెవంక చూశారు.

వాళ్ళ చూపులు పట్టించుకోకుండా "పిలిచారా బాబాయిగారూ'' అనడిగింది.

"అవునమ్మా. నీకోసమే చూస్తున్నాం. వీరు శ్రీను అమ్మా నాన్నా..." నిర్ఘాంతపోయింది హర్ష.

తండ్రి చిన్నప్పుడే పోయినట్టూ, మేనమామ ఆదరించినట్టూ శ్రీను చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. అసలా కృతజ్ఞతతోనే అతడి కూతుర్ని పెళ్లాడానన్నాడు. అలాటిది!

ఏది సత్యమో ఏది అసత్యమో తెలుసుకోలేనంత అయోమయం ఆమెని ఆవరించేసింది.

కన్నతండ్రి గురించి శ్రీను ఘోరమైన అబద్ధం చెప్పేడన్న నిజం గ్రహించేసరికి ఆమె నవనాడులూ కృంగిపోయాయి.

ఓ నిముషంపాటు నిశ్చేష్టయై తడికళ్లు టపటపలాడిస్తూ చేతులు జోడించింది.

"నీ నక్కవినయాలకేంలే. మావాడ్నెక్కడ దాచావో చెప్పు. అసలే ఆకలికి తాళలేడు బిడ్డ. ఏమయ్యాడో ఏం తింటున్నాడో. లోకంలో ఇంతమంది మగాళ్లుండగా నీకు నా కొడుకే దొరికాడా తల్లీ. నీ ఒంపులూ వయ్యారాలూ చూపి డబ్బు కుమ్మరించి మావాడ్ని వశపర్చుకున్నావు. వాడు తాగు

డుకి పేకాటకీ అలవాటుపడేలా చేశావు. కడకు వాడి కాపురాన్ని కూల్చి కోడలి వుసు రు పోసుకున్నావుకదుటే పాపిష్టిదానా. ని వ్వు ఆడపుట్టుక పుట్టలేదుటే'' కయ్‌మని మీదపడింది శ్రీను తల్లి.

శ్రీను తండ్రి ఆమెని శాంతపర్చాడు. అనంతరం హర్షతో అన్నాడు.

"చూడమ్మాయ్. నీతో గొడవ పెట్టుకోవాలని రాలేదు. అయ్యిందేదో అయ్యింది. ఇకనైనా మా వాడిని వదిలేసి మాకు పుత్రభిక్ష



పెట్టు. మా వియ్యంకుడికి రాజకీయంగా పలుకుబడి వుంది. కేసు అబ్బాయి పీకచుట్టూ మరింత బిగుసుకుపోయేట్టుంది తప్ప వదిలేలా లేదు. ఆ కేసు తెముల్తేగాని వాడు అజ్ఞాతంలోంచి బయటికి రాడు. ఆ కేసు తెమలాలంటే నువ్వు వదిలేసి వెళ్ళిపోవాలి''

"ఆమాట మీ అబ్బాయిని చెప్పమనండి'' హీనస్వరంతో అంది.

"నీ మోజులో కూరుకుపోయి కన్నూ మిన్నూ కానకుండా వున్నాడాయె. వా

డెందుకు చెబుతాడూ!" అంది శ్రీను తల్లి.

"నువ్వుండవే. నేను మాట్లాడుతున్నానుకదా''



"నాది కన్నకడుపండీ. కడుపు తరుక్కు పోతోంది. బిడ్డ ఏ అడవుల పాలయ్యాడో ఏమో!" కళ్ళొత్తుకుంటూ అంది.

మౌన ప్రేక్షకుల్లా వుండిపోయారు రామలింగయ్యగారు.

"మా అబ్బాయి ఎక్కడున్నాడో చెబితే కాళ్ళావేళ్ళాపడి బతిమాలి అయినా విడిపిస్తాం"

"ఎక్కడున్నారో నాకెలా తెలుస్తుంది?" అంది హర్ష ఇబ్బందిగా కదుల్తూ.

"నంగనాచండీ. తెలిసినా చెప్పదు"

ఆవిడింకా ఏదో అనబోతోంటే కోపంగా చూశాడు శ్రీను తండ్రి. మిగతా మాటల్ని మింగేసిందావిడ.

"మా వాడి గురించి బంధువర్గమంతా రకరకాలుగా చెప్పుకుంటున్నారు. వాడు మా కుటుంబ గౌరవాన్ని పెంచుతాడూ మమ్మల్ని ఉద్ధరిస్తాడు అనుకున్నాం. కానిలా మా పరువు బజారుపాలు చేస్తాడనుకోలేదు"

"మధ్యన వాడేం చేస్తాడు పాపం. ఆడది మగాణ్ణి ఆకాశానికి తీసుకెళ్ళనూగలదు. అధఃపాతాళానికి తొక్కెయ్యనూ గలదు. ఒక్కో మహాతల్లి పాదమహిమ ఒక్కోరకంగా వుంటుంది. మన ఖర్మకొద్దీ వాడు ఈవిడ కొంగుకి చిక్కుపడ్డాడు" మళ్ళీ కల్పించుకునంది శ్రీను తల్లి.

"చిన్నదానివైనా చేతులెత్తి ప్రార్థిస్తున్నాను. మావాడ్ని వదిలిపెట్టు. ట్రాన్స్‌ఫర్ చేయించుకుని దూరంగా వెళ్ళిపో. అవసరమైతే మీ బ్యాంకు అధికారుల కాళ్లు పట్టుకుని బతిమాల్తాం. నీకు ట్రాన్స్‌ఫర్ వచ్చేలా ప్రయత్నిస్తాం. నువ్వు వాడి జీవితంలోంచి తొలగిపోతేగాని వాడికి పట్టిన గ్రహణం విడవదు. వాడు బయటికి రాడు. కేసు క్లోజవదు. వాడి కాపురం చక్కబడదు. వాడి అజ్ఞాతవాసమూ పూర్తికాదు. మా కన్నీళ్లు ఆరవు. ఇవన్నీ నీ ఒక్కదానిమీదా ఆధారపడి వున్నాయమ్మా"

ప్రాధేయపూర్వకంగా అన్నారాయన.

ఎంత కరడుగట్టిన స్వార్థం! వాళ్ళ బిడ్డ గురించీ ఆ బిడ్డ కాపురం గురించీ మాట్లాడుతున్నారుగాని తన గురించి చిన్నగానైనా మాట్లాడుతున్నారా? తన భవిష్యత్తేమిటని ఆలోచిస్తున్నారా? కనీసం సానుభూతి చూపుతున్నారా?

లేదు.

అంతకానిదైపోయిందా తను? తను చేసిన పాపమేమిటీ! మంచివాడని నమ్మి శ్రీనుచేత తాళి కట్టించుకోవడమేనా?

రామలింగయ్యగారి వంక చూసింది. ఆయన కళ్ళనిండా సానుభూతి, ముఖంనిండా బాధ!

ఫరవాలేదు. ఒక్కరైనా తనని అర్థం చేసుకున్నారనుకునేసరికెంతో వూరటగా అన్పించింది. శ్రీను తల్లిదండ్రులవంక చూసింది. తన సమాధానం కోసం ఆత్రంగా చూస్తున్నారు.

"మరి నా గతేమిటి? పుట్టబోయే నా బిడ్డ సంగతేమిటి?"

ఊహించని ప్రశ్నకి తుళ్ళిపడ్డారంతా.

"నీకు లోటేవిటే. ఎర్రగా బుర్రగా వున్నావ్. వేలకొద్దీ సంపాదిస్తున్నావ్. ఎవడో కడు తగులుకోకపోడు" అనింకేదో అనబోతోంటే భార్యని వారించాడు శ్రీను తండ్రి.

"మనం వచ్చిన పని మర్చిపోకే. ఎలా వోలా కార్యం జరిగేపని చూడాలిగాని కలహానికి కాలు దువ్వుతానంటావేమిటి?" అని మందలించి హర్షతో అన్నారు.

"దేవుడి ముందు పెద్దల సమక్షంలో మావాడు నిన్ను పెళ్లాడిన సంగతి మేం కాదనటంలేదు. న్యాయరీత్యా నువ్వు వాడి పెళ్లానివే. కాని చట్టప్రకారం మీ పెళ్లి చెల్లదు. అంచేత హక్కుల గురించి రాద్ధాంతం చెయ్యడం అనవసరం..."

"అమ్మాయి అభిప్రాయం అది కాదనుకుంటాను" మధ్యలో కల్పించుకుంటూ అన్నారు రామలింగయ్యగారు.





"నాకు తెలిసిందిలెండి. అక్కడికే వస్తు న్నాను. ఆడకూతురివి. నోరు తెరచి అడిగావు. నీ కడుపులో పెరుగుతోంది మా మనవడే అంటున్నావు. గనుక ఒకమాట చెబుతున్నాను. నేనూ పెద్ద స్థితిమంతు డ్నేమీ కాదు. ఏదో చిన్న ఉద్యోగాన్ని నమ్ము కుని కాలం వెళ్ళదీస్తున్నవాడ్ని. అయినా వున్నదాన్లోనే కాస్తో కూస్తో అమ్మి పాతికవేలు ఇస్తాను. అది తీసుకుని మావాడి కంటబడ నంత దూరం వెళ్ళిపో"

పిచ్చిగా చూసింది హర్ష.

తను అడిగిందీ ఆశించిందీ అదికాదు. కాని వాళ్ళు మరోలా అర్థం చేసుకున్నారు. డబ్బు కోసం వలలో వేసుకున్న వెలయాలిగా చూ స్తున్నారు.

ఏదో తెలీని ఆవేశం ఆవహించేసిందా మెని. తను వెలయాలు కాదని వెల కట్టలేని ప్రేమికురాలని, నమ్మి మోసపోయిన పడతి అని రుజువు చేసుకోవాలన్పించింది. అలాటి ముద్రతో బతికేకన్నా చావడమే మేల న్పించింది.

విసురుగా లేచి కూర్చున్న కుర్చీని వెన క్కి తోసింది.

అదిరిపడి చూశారంతా.

"డబ్బుకో ఆస్తిలో వాటాకో ఆశపడి మీ అబ్బాయిని పెళ్ళి చేసుకోలేదు. మాట వచ్చింది గనుక చెబుతున్నాను. మీ కోడలు మీ అబ్బాయిని వదులుకుంటుందేమో కను క్కోండి. పాతిక కాదు యాభై కాదు లక్ష రూపాయలిస్తాను. అహంకారంతో ఈ మాట అనడంలేదు. నా ప్రేమబలంతో చెబుతున్నా ను. మీకు తెలుసో లేదో నా సేవింగ్సునీ లోన్ల సొమ్మునీ మీ అబ్బాయికే ఖర్చు పెట్టాను తప్ప అతడి దగ్గర్నుండి పైసా తీసుకోలేదు. నాకు డబ్బు ముఖ్యం కాదు. నాక్కావా ల్సింది సముచితస్థానం. గుర్తింపు. గౌరవం. ఆదరణ. అవి లభించేవరకూ విశ్రమించను. పోరాడుతూనే వుంటాను"

గబగబా బయటికి నడిచింది.

ఒక చిన్న రాయి సూటిగా వచ్చి ఆమె నుదుటికి తగిలింది.

కోపంగా అటుచూసింది.

లోపలికి పారిపోతున్నాడు గోపి!

★ ★ ★

హర్ష బ్యాంకుకెళ్తోంటే వచ్చి కలిశారు రామలింగయ్యగారు.

"నీతో కొంచెం మాట్లాడాలి. ఈ పార్కులో పది నిమిషాలు కూర్చుందామా"

అయిష్టంగానే తలాడించింది. ఇద్దరూ తమతమ వెహికల్స్‌ని ఓ పక్కనపెట్టి పార్కులోకి అడుగులేశారు.

నీడగా వున్నచోట చతికిలపడుతూ కూర్చోమ్మా అన్నారు.

టైము చూసుకుంటూ కూర్చుంది.

"పెద్దవాణ్ణి... నీ మేలు కోరి చెబుతున్నా ను. ఆవేశపడకుండా స్థిమితంగా ఆలో చించు..."

"నా పరిస్థితి మీకు తెలుసుకదా బా బాయ్. నిప్పుల గుండంమీద నిలుచున్నట్టు గా వుంది"

"అందుకనే ఒడ్డునపడేమార్గం గురించా లోచించమంటున్నాను"

"శ్రీనుని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నా ను. అది తప్పంటారా బాబాయ్?"

మందహాసం చేశారాయన.

"సీత కూడా కోరుకుంది. ఏమని? బంగా రులేడి తనకి కావాలని. శూర్పణఖ కూడా కోరుకుంది. ఎవర్ని? అందాల రాముణ్ణి. రావణుడూ కోరుకున్నాడు. ఎవర్ని? సుందరి సీతని. అన్నీ తమకే కావాలన్న విపరీత స్వార్థంతో ఉచితానుచితాలు మరచి కోరుకు న్న కోరికలవల్ల ఎన్ని అనర్థాలు జరిగాయో ఎవరెంత నష్టపోయారో ఉగ్గుపాలతో రామా యణం విన్న నీకు చెప్పక్కర్లేదు"

"కాని శ్రీను భార్య పిచ్చిది బాబాయ్"

"అది నీకనవసరంకదా. అది అతడి

సమస్య. అతడు పరిష్కారం వెదుక్కోవాల్సిన సమస్య. ఆ సమస్య తీర్చడానికి నువ్వు సమస్యల్లో చిక్కుకోవడం ఎందుకు చెప్పు? ఆ సమస్యకి నువ్వు సమాధానం అనుకున్నప్పుడు అది అందరి అంగీకారంతో చట్టబద్ధంగా చేసుకోవచ్చుగా. ఈ దొంగనాట కాలెందుకు?"

ఆ వాదనలో నిజముందన్పించడంతో మౌనంగా వుండిపోయింది.

"చూడమ్మాయ్. రోగీ పాలే కోరాడు వైద్యుడూ పాలే చెప్పేడు అన్నట్టుగా మీ అన్నయ్యలు చెప్పిందీ, శ్రీను తండ్రి చెప్పిందీ ఒకటే. మాకూ అదే సమంజసమన్పిస్తోంది. శ్రీనుని మరచిపోయి నువ్వు కొత్తదారి పట్టడం మంచిది''

"నేను లేకపోతే శ్రీను పిచ్చివాడైపోతాడు బాబాయ్''

"ఎంత అమాయకురాలివమ్మా. ఎడబాటు భరించలేక పిచ్చి వాళ్లయ్యేట్టయితే ఈ ప్రపంచమంతా పిచ్చివాళ్లతో నిండి వుండాలి. ఎంచేతంటే అంతా తమ తమ వాళ్లని పోగొట్టుకుంటూనే వున్నారుకదా!"

"నేనూ అతడ్ని ప్రేమించాను. ప్రేమకి ద్రోహం చెయ్యలేను''

"నువ్వు చెయ్యట్లేదు. అతడే ద్రోహం చేశాడు. నిజాలుదాచి మభ్య పెట్టాడు. దానికి ప్రేమ అనే అందమైన రేపర్ చుట్టేసరికి నువ్వు నమ్మేసి దాసోహమనేశావు''

"కాని అతను లేకుండా నేను నా బిడ్డతో ఎలా... ఎలా బతగ్గలను బాబాయ్? అంతా కాకుల్లా పొడవరూ?"

"వితంతువులు, విడాకులు తీసుకున్నవాళ్లూ ఎందరో మళ్లీ పెళ్లి చేసుకుని బతుకుల్ని తీర్చిదిద్దుకొంటోంటే నువ్వేమిటమ్మా ఇలా బేలగా మాట్లాడతావు? వయస్సుంది, చదువుంది, అందముంది, చక్కని ఉద్యోగం వుంది. శ్రీనుకంటే అన్నివిధాలా మంచివాడు నీకు తప్పక లభిస్తాడమ్మా. నిన్నూ, నీ బిడ్డనీ పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. కొబ్బరి చెట్టు నీడలాంటి శ్రీనుని నమ్మేకన్నా సురక్షిత నీడని వెదుక్కోవడం మంచిదమ్మా''

ఆయన చెప్పిందీ నిజమే అన్పించింది.

ఒకవేళ ఏ కారణం చేతనైనా పెళ్లి కాకపోతే మాత్రమేం? తన కాళ్లమీద తను సగౌరవంగా నిలబడి బిడ్డని పెంచుతుంది. భర్త వదిలేసిన ఇందిర ఆత్మస్థైర్యంతో ముందడుగు వేయగా లేనిది తనెందుకు బెంగపడడం?

"పుట్టబోయే బిడ్డ గురించి ఆలోచిస్తున్నావా? నీ భవిష్యత్తుకి బిడ్డ ప్రతిబంధకమవుతుందనుకుంటే అనాధశరణాలయంలో చేర్చొచ్చు. ఎవరికైనా పెంపకానికి ఇవ్వొచ్చు. నీ బతుకు బాగుపడుతుందంటే మేమైనా పెంచుతాం"

ఆయన మాటలకి కన్నీళ్లు వుబికి వచ్చాయి. "మీలో మా నాన్నగారు కన్పిస్తున్నారు బాబాయ్''

"పిచ్చిపిల్లా వూరుకో. కళ్లు తుడుచుకో. ఎంత పోరాడినా ఓటమి తప్పనప్పుడు ముందే ఓటమి అంగీకరించి మరో మార్గాన్ని అన్వేషించడం విజ్ఞత అన్పించుకుంటుంది. అంతే తప్ప ఆడదాన్ని అబలని నేనేం చేయగలను అన్న భావాన్ని మాత్రం నీలో పెరగనివ్వకు. ఆడది ఆదిశక్తి అంశ. ఏమైనా చెయ్యగలదు. ఏంతైనా సాధించగలదు''

"అలాగే బాబాయ్... నాక్కొంచెం టైమివ్వండి. నన్ను బాగా ఆలోచించుకోనివ్వండి''

"నాకిప్పుడెంతో ఆనందంగా వుందమ్మా. నువ్వు తెలివైందానివి. విజ్ఞతతో వ్యవహరించి సరైన నిర్ణయం తీసుకుంటావని నమ్ముతున్నాను. నీ బతుకో దారిన పడితే మాకంతే చాలు. నీకూ, నీ బిడ్డకీ అదే శ్రీరామరక్ష అవుతుంది'' లేస్తూ అన్నారు.

ఆ చివరి మాటలకి ఆమె ఒడలు పులకించిందొక్కసారే. ఆయన అనాలోచితంగా శ్రీరామరక్ష అనలేదనీ ఆ భగవంతుడే ఆ





మాట అన్పించివుంటాడనీ భావించింది.

సంతోషంగా శలవు తీసుకుని బ్యాంకుకు వెళ్లింది.

చాన్నాళ్ల తర్వాత చాలా వుత్సాహంగా పనిచేసింది. చకచకా పనులు చక్కబెడు తోంటే ఆమె కొలీగ్స్ ఆశ్చర్యపోయారు.

"కొత్తగా వున్నారివాళ. చాన్నాళ్ల తర్వాత మీ మొహంలో కాంతి కన్పిస్తోంది'' అంది సరిత.

"శ్రీనుతో సంబంధాన్ని పునః సమీక్షించు కుంటున్నాను. దాన్ని కట్ చెయ్యడమే అంద రికీ మంచిదన్పిస్తోంది''

"అది కొంచెం బాధాకరమే అయినా మరో గత్యంతరం లేదు. అడుసుతొక్కిన వాళ్లే కాళ్లు కడుక్కోవాలి''

ఇంతలో ఫోన్ మ్రోగగా రిసీవర్ ఎత్తింది హర్ష.

లైన్లో శ్రీను!

ఉద్వేగంతో వూగిపోతూ అడిగింది "ఎక్కడ్నుంచి''

"నీతో చాలా మాట్లాడాలి హర్షా. చాలా అర్జంట్''

"బ్యాంకునుంచి మాట్లాడితే బావుండదు. నీ నెంబరివ్వు.. బయట్నించి ఫోన్ చేస్తాను''

అతడి నెంబరు తీసుకుని ఫోన్ పెట్టేసింది.

అతడ్తో తాడోపేడో తేల్చేసుకోవాలన్న నిర్ణయానికొచ్చేసింది. పది నిమిషాల పర్మిషన్ తీసుకుని బయటికెళ్లి యస్టీడీ బూత్‌లోంచి ఫోన్ చేసింది.

"పరుగెత్తి పరుగెత్తి అలసిపోయాను హర్షా. నాకు నువ్వు కావాలి. నీ ఓదార్పు కావాలి. నువ్వే నన్ను రక్షించాలి. అంతా వేటకుక్కల్లా తరుముతున్నారు. నన్ను నామరూపాల్లేకుండా చెయ్యాలని చూస్తున్నారు. ప్లీజ్ హెల్ప్ మీ హర్షా. నీ సాయం లేకపోతే నేను చచ్చిపోతాను ప్లీజ్''

ఆర్తిగా అర్థింపుగా అన్నాడు. ప్రాధేయపడ్డాడు. ఏడ్చేశాడు.

ఆమె గుండె నీరయ్యింది.

నాగస్వరం విన్న నాగిని అయ్యింది. అతడు తప్పు మిగతావన్నీ కన్పించడం మానేశాయి.

"నువ్వు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావా? సూటిగా సమాధానం చెప్పు"

"అదేమిటి హర్షా అలా అడుగుతున్నావ్. నా గుండెల్నిండా ప్రేమిస్తున్నాను. నువ్వు తల్లివి కాబోతున్నావని తెలిశాక ఆ ప్రేమ రెట్టింపు అయ్యింది. అసలు నీకోసమేకదా ఇంత రిస్కు తీసుకుంటున్నాను. నీ గురించే కదా పోలీసులకి దొరక్కుండా తప్పించుకుని తిరుగుతున్నాను''

"నేన్నీకు నిజంగా కావాలా? గుండెల మీద చేతులుంచుకుని చెప్పు"

"కొత్తగా మాట్లాడుతున్నావేంటి హర్షా. నువ్వు లేకుండా బతకలేను. నీ కోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. ఏం చెయ్యను చెప్పు? రైలు కింద తల పెట్టనా? బ్రిడ్జిమీంచి దూకెయ్యనా?"

"రాత్రికి ఇంటికిరా మాట్లాడుకుందాం"

"పోలీసులు చూస్తారేమో?"

"వాళ్ల కళ్లెలా కప్పాలో నాకు తెలుసు. వెనకవైపునుంచి రా''

"థాంక్స్. పోయే ప్రాణాన్ని కాపాడావు. ఎన్ని జన్మలెత్తినా నీ ఋణం తీర్చుకోలేను. నువ్వే జన్మజన్మలకీ నా భార్యవి కావాలి హర్షా''

ఫోన్ పెట్టేసింది.

తను మాట్లాడిన ధోరణి తన తెగువ తనకే ఎంతో చిత్రంగా అన్పించింది. తను తీసుకున్న నిర్ణయం ఇచ్చిన వూతమే ఆ ధైర్యానిక్కారణం అనుకుంది.

గెలిచే ఎత్తు వేయడం నాకూ చేతనవున నుకుంటూ సన్నగా నవ్వుకుంది.

తిరిగి బ్యాంకులోకెళ్లి సీట్లో కూర్చుందో



లేదో సరిత దినపత్రిక జిల్లా ఎడిషన్ పట్టుకుని హడావుడిగా వచ్చింది.

"ఇందులోని ప్రకటన చూశారా''

"చూడలేదే'' అంటూ అందుకుని చూసింది.

డ్యూటీ ఎగ్గొట్టి వెళ్లిపోయినందునా, ప్రవర్తన సంతృప్తికరంగా లేనందునా శ్రీనుని ఉద్యోగం నుంచి సస్పెండు చేశార్ట. ఇకపై అతడ్తో జరిపే లావాదేవీలకి కంపెనీ బాధ్యత వహించదట. అలా అని తెలియజేస్తూ విజేతా హౌసింగ్ వారిచ్చిన ప్రకటన అది.

చదువుతోంటే గుండెలు విపరీతమైన శబ్దం చేసినా చదివేక అన్నీ సర్దుమణిగాయి.

పెదవివిరిచి పక్కన పడేసింది.

"ఇంక అతడ్తో తెగతెంపులు చేసుకోవడమే మంచిది'' అనేసి వెళ్లిపోయింది సరిత.

'ఇక ఇలాటి బెదిరింపులకి అతీతం కాబోతున్నాంలే' అనుకుంది హర్ష.

అర్ధరాత్రి వేళ ఇంటి వెనుక భాగం నుంచి దొంగలా వచ్చాడు శ్రీను.

గెడ్డం బాగా పెరిగింది. కళ్లు లోతుకు పోయాయి. బాగా చిక్కిపోయాడు. జుట్టు చిందరవందరగా వుంది. బట్టలు మసి గుడ్డల్లా వున్నాయి.

అతనిలో ఒక మజ్నూ ఒక దేవదాసు కన్పించారామెకి. తన ప్రేమ కోసం ఎన్ని కష్టాలు మరెన్ని నష్టాలు భరిస్తున్నాడు అనుకునేసరికి అభిమానం, ప్రేమ, కన్నీళ్లు కూడా వుప్పొంగి వచ్చాయి హర్షకి.

అతడ్ని కావలించుకుని ఏడ్చేసింది.

"ష్... అర్ధరాత్రి అంకాలమ్మ శివాలొద్దు. పోలీసులవసలే డేగ కళ్లు'' అన్నాడతడు.

మరి మాట్లాడకుండా బాత్‌రూంలోకి తీసుకెళ్లి స్వయంగా తలంటింది. వేడివేడి అన్నం వడ్డించింది. ఆ వెంటనే ఆమెని మంచంమీదికి లాగాడు కూడా.





అతడి అన్ని ఆకళ్లూ తీరేక అంది. "ఈ భయాలూ, బెదిరింపులూ, ఏడ్పులూ, గొడవలూ, దాక్కోవటాలూ ఏమీలేని పథకం సిద్ధం చేశాను''

"గుడ్.. ఏమిటది?"

"మనం దూరంగా పారిపోదాం. ఏ ఢిల్లీయో, ముంబాయో చెక్కేద్దాం. హాయిగా స్వేచ్ఛగా ప్రేమ పక్షుల్లా బతికేద్దాం"

నవ్వేడు శ్రీను.

"ఏం తిని బతుకుదాం? గడ్డీగాదమూనా? అలాటి పిచ్చి పిచ్చి ఆలోచనలు మానెయ్యి. డబ్బు ఆరవ ఇంద్రియం లాంటిది. అదొక్కటి లేకపోతే మిగతా పంచేంద్రియాలేమీ పని చెయ్యవు. ఏవిటనుకున్నావో''

"అదికాదు శ్రీనూ. ఈ నరకయాతన, ఈ క్షోభ, ఈ చిత్రహింస నేను భరించలేకపోతున్నాను''

"అసలు బాధలన్నీ నావి. పరువు నష్టంనాది. అడకత్తెరలో పోకలా నలిగిపోతున్నది నేను. నీకేమే. టింగురంగా అంటూ సింగారించుకుని ఆఫీసుకెళ్తున్నావ్ వస్తున్నావ్. నీకు బాధేమిటి నీ మొహం!"

మొహం మీద యాసిడ్‌పోసినట్టు అదిరిపడింది. వింతగా చూసింది. నమ్మలేనట్టు చూసింది. కానతడదేం పట్టించుకోలేదు.

"చూడూ... ఎంత ఆకలిగా వున్నా సింహం గడ్డితినదు. నేనూ అంతే. ఏదో తినేసి మరేదో తాగేసి ఏదోలా బతికేసేవాడ్నైతే నిన్ను కట్టుకునే వాడ్నేకాదు. నాకు అందంకావాలి. వయస్సు కావాలి. డబ్బు కావాలి. నా కోర్కెలు తీర్చే కల్పవృక్షం కావాలి. అంచేత నెల తిరిగేసరికి ఆరేడువేలొచ్చి అరచేతిలో పడే వుద్యోగాన్ని వదిలేస్తానని నెప్పుడూ అనకు. బంగారు గుడ్లు పెట్టే బాతుని కోసుకుని తినే బాపతు కాదు నేను..."

ఆగి సిగరెట్ వెలిగించాడు.

ఊపిరి పీల్చుకోడం మరచిపోయి చూస్తోంది హర్ష.

"డబ్బు, సెక్స్, మృత్యువు- ఈ మూడూ ఏ మానవుడూ తప్పించుకోలేనివి. అందుకు నేనూ ఎక్సెప్షన్ కాదు. అంచేత పిచ్చిపిచ్చి ఆలోచనల్ని నీ బుర్రలోకి రానివ్వకుండా నేను చెప్పినట్టు విను. నేను నా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాను. ఆపైన నన్నెవరూ బెదిరించలేరు. నాకే సంపాదనా లేనప్పుడు మనోవర్తీ అడగలేరు కదా. దెబ్బకి జానకి పుట్టింటికెళ్ళిపోతుంది. మనం స్వేచ్ఛగా మరో వూరుకి ఎగిరిపోదాం. నువ్వు నీ ఉద్యోగం చేసుకుందువుగాని. నేనేదో వ్యాపారం ప్రారంభిస్తాను. హాయిగా చిలకాగోరింకల్లా వుందాం. ఎలా వుంది మనప్లాన్?"

సిగరెట్ స్టైలుగా కాలుస్తూ అడిగాడు శ్రీను.

అప్రతిభురాలై అతడ్నే చూస్తుండిపోయింది.

అతడి ఒంటిమీది ఒక్కోరంగూ వెలిసిపోతూ అసలు స్వభావం బయటపడుతున్నట్టుగా అనిపిస్తోంటే గుడ్లప్పగించి చూస్తుండిపోయింది.

అతడు మధ్యాహ్నం ఫోన్‌చేసినప్పుడు ఒకరకంగా అనిపించాడు. ఇంతక్రితం వచ్చినప్పుడు ఇంకోరకంగా కన్పించాడు. ఇప్పుడు మరోరకంగా...!

ఒక్కరోజులోనే ఎన్నోరకాలుగా ఎన్నో రూపాల్లో కన్పించాడు.

ఇకముందెన్ని రకాలుగా మారతాడో!

ఆకాశంనుంచి రసాతలానికి జారిపోతున్నట్టుగా అన్పించింది.

నవ్వాలనుకుంది.

నవ్వు రాలేదు.

ఏడ్వాలనిపించింది.

ఏడుపు రాలేదు!

★ ★ ★

హర్ష కెనెటిక్ హోండా మీదెళ్తోంటే ఓ కానిస్టేబుల్ ఆపాడు.

భయంగా సన్నగా కంపిస్తూ చూసింది.

"మా యస్సై పిలుస్తోంది. స్టేషన్కి నడు''

"నేనెందుకు రావాలి?" బింకంగా అంది.

షోడా కొట్టినట్టుగా నవ్వేడతడు.

"పోలీస్ స్టేషన్కి పేరంటానికి పిలవరు. బేడీలెయ్యడానికీ, మక్కెలిరగదీయడానికీ పిలుస్తారు''

"నేనేం నేరమూ చెయ్యలేదు. నేను రాను. గొడవచేస్తే మా ప్లీడర్ని పిలుస్తాను''

మళ్లీ నవ్వాడు. ఈసారి ఒళ్ళంతా కదిలేలా నవ్వాడు.

"నాపేరు తెలుసా? సింహాద్రి అప్పన్న. హెడ్డుని. నా సర్వీసెంతో తెలుసా? ఇరవై రెండేళ్ళు. ఇప్పటికి నీలాటోళ్ళని ఎన్నివేల మందిని సూసుంటానంటావ్?"

"నాకేం తెల్సు?"

"తెల్దు. అందుకనే నాకేం తెల్దనుకుంటున్నావ్. ఒక సంగచ్చెప్పనా. సివాద్రికొండ మీది అప్పన్నకీ నాకూ తేడా ఏల్నేదు. ఇద్దరం కళ్ళేట్టుకుని సూత్తా వుంటామంతే. అందుకని మాకేటీ తెల్దు ఎర్రిమాలోకాలమనుకోకు మరి..."

"నీకేం తెల్సంటావ్?"

"డబాయించెయ్యకు మరి కత్తిరించేత్తాను. నీ గురించి తెల్సు. నీ రంకుమొగుడి గురించి తెల్సు. ఆడ్ని నీ ఇంట్లో దాచేవని తెల్సు. కేసు బుక్కుచేస్తే నీకు అయిదారేళ్లకి తక్కువ పడదని తెల్సు. అయినా ఏవీ సెప్పను. నోరు తెరవనే తెరవను. సెప్పాల్సిందంతా మా యస్సై సెప్తుద్ది. స్టేషన్కి నడుత్తావా?" గుబురు మీసాలు దువ్వుకుంటూ నవ్వాడు.

సముద్రమంత అసహాయత ఒక్కసారి ముంచెత్తగా నిస్సహాయంగా చూసింది హర్ష. నిస్తేజంగా చూసింది.

"ఏటి సంగతి గాలి తీసినట్టుగా అయిపో

నావే. సివాద్రి అప్పన్నని సూసేవా? ఎప్పుడూ గంధం పూతల్తో వుంటాడు. పూత తీసేరనుకో నిజరూపం శానా ఉగ్రంగా వుంటాదిలే- సూత్తే గుండెల్జారిపోతాయి. మావూ అంతే. మా టోపీ తీసి - పక్కనెట్టేవనుకో నీ గుండెలు, నీ కాళ్ళు, నీచేతులు అన్నీ జారిపోతాయి. మరంచేత ఎవడితోనైనా ఎట్టుకోగాని పోలీసోడిజోలికి మాత్రం ఎల్లకు. నమల కుండా మింగేత్తాడు''

"ఇప్పుడు నన్నేం చేయమంటావు?" దిక్కుతోచక అడిగింది.

"స్టేషన్కి నడవమంటాను. ఇంకో సంగతి. నీ బండి తుర్రున పోద్ది. నాది డొక్కుసైకిలాయె. అంచేత నడిపించుకుంటూ, కబుర్లు సెప్పుకుంటూ వెళ్దాం. చూ



సినోళ్ళు ఏమైనా అనుకుంటారంటావా. అనుకోనీ మరి. పోలీసోడి పక్కనున్నోడు దొంగ అయినా అవుతాడు మంత్రి అయినా అవుతాడు. ఏవంటావ్?"

ఏమీ అన్లేదామె. మరి గత్యంతరమేదీ కన్పించక అనుసరించింది. ఏం జరగబోతోందో ఎలాంటి పరిస్థితి ఎదురు కాబోతోందోనని ఒకటే ఆందోళనగా వుందామెకి. దీన్నుండి బయటపడటం ఎలాగా అని బుర్ర ఆలోచనలోపడింది.



ఆ సంగతి అప్పన్న గ్రహించాడు.

"పాయింటు ఇట్టే పట్టేసినావు. పాదర సపు బుర్రనీది. ఇలాంటి దానివి ఏ బంగారు పిచికనో పట్టక ఆ వుల్ఫాగాడి బుట్టలో ఎలా పడ్డావో తెలీట్నేదు. ఈడ్చి తన్నినా ఎర్రని ఏగానీ ఇదపడు కదా. నిన్ను గోక్కుని తింటాడు గాని నీకు పెట్టడు. ఆడి బాబు ఆడ్ని మించిన పిసినార్నాకొడుకు..."

"ఆయనీకు తెలుసా?"

"తెలుసంటే తెలుసు తెలీదంటే తెలీదు. శ్రీనివాసుగాడి ఆచూకీ తీద్దావని అదేదో వూళ్ళో వుంటోన్న ఆడి బాబింటికెళ్ళేను. కడుపునిండా భోజనం పెట్టాడు. ఎళ్తానయ్యా శ్రీనుగాడిక్కడ లేడని రిపోర్టు రాసేత్తాన య్యా అని ఎంతసేపు సేతులు నలిపినా అర్థంచేసుకోడే. సివరాకరికి నోరు తెరిసడిగి తే పదికాయితం సేతిలో ఎట్టి దణ్ణవెట్టాడు. శాత్..."

"శ్రీనుకోసం వాళ్ళూరెళ్ళి వెదికారా?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"మాయమైపోతే ఎతకమేంటి. అక్కడికే కాదు హాయిదారాబాదెళ్ళాం. మీ అన్నని సూసేం. తిరపతెళ్ళాం. మీ సిన్నన్నని కలి సేం. పన్లో పనిగా వెంకటేశ్వరస్వామిని కూడా చూసొచ్చాం. అన్నిచోట్లా సెర్చిసే శాం. ఆళ్ళు సదూకున్నోళ్ళు గనక ఆళ్లపద్ధతే రనుకో. కర్సులుపోను పదో పరకో మిగిలేలా ఇచ్చారు"

హతాశురాలయ్యింది హర్ష.

అయితే అన్నిచోట్లా అగ్గి అంటించేశారన్న మాట!

ఒక్కసారిగా డీలాపడిపోయింది.

"పోలీసోళ్ళని తక్కువగా అంచనా ఎయ్యకుమరి. సిటికెలో తలల్తీసేస్తాం. సె నంలో తలలు అతికించేత్తాం. కర్తవ్యం సిని మా చూసినావా?"



తలూపింది.

"అందులోని ఈరోయిన్ని మించిపోద్ది మా యస్సై. నీలాంటి ఆడోళ్ళంటే ఆడపులి లా పడిపోద్ది. చీల్చుకు తినుద్ది-పైగా పుల్‌ప వర్లున్న కేసిది. ఇక నిన్నూ, నీ రంకుమొగు డ్నీ ఇరుచుకు తినదేంటి..." పెదాలు తడుపు కుంటూ అదోలా నవ్వాడు.

ఆమె ఒళ్ళు జలదరించింది.

గబుక్కున ఆగి స్కూటర్‌కి స్టాండువేసి అతడి చేతులు పట్టుకుంది.

"నా తండ్రిలాంటివాడివి. నువ్వే మమ్మ ల్ని కాపాడాలి. నువ్వే మాకేదో దారి చూ పాలి..."

ఆమె అలా అడుగుతుందని ముందే తెలుసన్నట్టుగా నవ్వాడు.

"చెప్పేనుగా నీ బుర్ర పాదరసవనీ. ఆడు నీ ఇంట్లో వున్నాడని తెల్సు. అయినా తెలీన ట్టు కళ్ళు మూసుకున్నాం. ఎందుకనుకున్నా వేటి. నువ్వు రాజీకొత్తావనే. లేపోతే ఆడ్ని బొక్కలో ఎయ్యడం నిమిసాల్లో పని..."

"నువ్వే ఏదో ఉపాయం చెప్పి పుణ్యం కట్టుకో అప్పన్నా. నీ ఋణం వుంచుకోను"

"అద్గదీ పనికొచ్చేమాట. కోర్టులో లొంగి పొమ్మను. బెయిల్తీసుకుని వాయిదాలకి తిర గొచ్చు"

"జైలుకి పంపేస్తారేమోనని భయంగా వుంది"

"మరైతే హైకోర్టుకి పోయి యాంటిసిపే టరీ బెయిలు తెచ్చుకోవల్సిందే. అంతదాకా మేం కళ్ళూ, సెవులూ మూసుకోవాలి గదా. శానా ఖర్చవుద్ది"

"వెయ్యి రూపాయలిస్తాను. ఎలాగైనా ఆపించు. ఈలోగా హైకోర్టునుంచి బెయిలు తెచ్చుకుంటాం"

కిసుక్కున నవ్వాడు.

"అందర్నీ ఆకట్టుకుని ఆపాలి గదా. అస లే కేసులో ప్రోగ్రెసు లేదని ఆ పిల్ల తండ్రీ, ఆళ్ళ పార్టీవోళ్ళూ, ఆడసంఘాలోళ్ళూ సెవి లోని జోరీగలా గొడవ సేత్తన్నారు. పిటీసన్లు

పెడతన్నారు..."

"పదిహేనొందలిస్తాను. అంతకుమించి ఇచ్చుకోలేను'' దీనంగా అర్థించింది హర్ష.

"సోది కేసు కాదిది. లైఫ్ అండ్ డెత్ సమస్య. ఓ ఇరవై కొడతావేంటి?"

"ఇరవై వేలా?"

"అంతేమరి. ఒళ్ళు తగ్గాలనుకున్నోళ్ళు బ్యూటీ పార్లర్లకెళ్ళక్కర్నేదు. ఓపాలి మా కేసులో ఇరుక్కుంటే శాన లావూ తగ్గుద్ది. జేబు బరువూ తగ్గుద్ది!"

"అంత ఇచ్చుకోలేను. పదివేలిస్తాను. ప్లీజ్. ఎలాగైనా మీ ఎస్సైని ఒప్పించి బైము లభించేలా చూడు..." బతిమాలిందామె.

అతికష్టంమీద అంగీకరించాడు అప్పన్న.

★ ★ ★

"నువ్వొట్టి ఫూల్వి. మరీ ఇంత తెలివితక్కువదానివనుకోలేదు. ఎవరో కానిస్టేబుల్గాడు బెదిరిస్తే చేతిగాజులమ్మి పదివేలు వాడి ముఖానపోస్తావా? ఫూలిష్నెస్! అందుకే అంటారు ఆడవాళ్ళకి బుఱ్ఱ మోకాల్లో వుంటుందని!..."

చివ్వున తలెత్తి చూసింది హర్ష. ఆమె చూపుల్ని పట్టించుకోలేదతడు.

"నువ్వేదో గొప్పగా ఆఫీసర్ లెవెల్లో డీల్ చెయ్యకుండా సంగతి నాకు చెప్పుంటే సరిపోయేది. అదే డబ్బుతో అసలు కేసే లేకుండా చేసేద్దును. ఛండాలపు పని చేశావు కదా. ఇంకెప్పుడూ నాకు చెప్పకుండా ఏమీ చెయ్యకు'' రుసరుసలాడాడు శ్రీను.

అతడి మాటలు ఈటెల పోటుల్లా తగిలాయి. ఖిన్నురాలయ్యింది. ముఖం ఎఱ్ఱబడింది.

"నామీద నీ బోడిపెత్తనం ఏవిటి? అసల్నీ జులుం ఏవిటి? నీవల్లే, నిన్ను నమ్మినందువల్లే దొంగవూబిలో కూరుకుపోయాను. ఫో. ఇకనుంచైనా దూరంగా ఫో. నా జీవితంలోంచి శాశ్వతంగా వెళ్ళిపో. నీకూ నాకూ ఈ క్షణంనుంచి ఎలాంటి సంబంధంలేదు''

అంటూ నిప్పులు కక్కెయ్యాలని రోషపడింది.

కాని ఒక్కమాటా వెలువళ్ళేదు! ఏదో తెలీని బలహీనత ఆమె గొంతునొక్కేసింది. మరేదో అసహాయత ఆమెని వెనక్కి లాగింది. అతడి మీదున్న ప్రేమాభిమానాలు కష్టదశలో వున్న అతడ్ని విదిలించి వెళ్ళకుండా కాళ్ళకి బంధాలేశాయి!

మౌనంగా కూర్చుండి కూలబడిపోయింది.

అవాళ పెద్దన్నయ్య మాట విని అతడ్తో వెళ్ళి వుంటే సరిపోయేది. కనీసం చిన్నన్నయ్య వచ్చినప్పుడు శ్రీనుకి ఉద్వాసన చెప్పినా బాగుండిపోయేది. అతడు అదృశ్యమైనప్పుడు రామలింగయ్యగారు చెప్పిన మాటలు విని అతడికి దూరంగా జరిగినా బావుండేది.

దెబ్బమీద దెబ్బ తగుల్తున్నా అతడి ప్రవర్తన విపరీతంగా మారిపోతున్నా అతడ్ని కాదన్లేక పోతోంది! తోసివెళ్ళలేకపోతోంది!

ఇది ప్రేమా? అసహాయతా? బలహీనతా? ప్రారబ్ధమా? కర్మఫలమా?

"ఏంటలా కూర్చున్నావు?"

"మనగురించి ఆలోచిస్తున్నాను..."

"ఏమని ఆలోచిస్తున్నావు?"

"నీ నిజరూపం తెలిసినా నిన్ను వదలి ఎందుకు వెళ్లలేకపోతున్నానా అని''

పిచ్చిగా చూశాడు. ఆపైన పడీపడీ నవ్వాడు.

"ఇలాంటి ఆలోచన వస్తుందనే నువ్వు త్వరగా తల్లివి కావాలని ఆరాటపడ్డాను. ఆ బంధం నీకాళ్ళకి బంధం వేస్తుందని నాకు బాగా తెలుసు''

"అయినా తెంచుకెళ్లగలను''

"వెళ్లలేవు. ఎంచేతంటే వెళ్లనివ్వను గనుక. శమంతకమణిని వదులుకుని శాషగ్ర

స్తుళ్ళా వుండలేను గనుక!"

"శ్రీనూ!" అరిచినట్టుగా అంది.

తేలిగ్గా నవ్వేశాడు "నువ్వెక్కడో పిచ్చిదానివి. సరదాగా అంటే సీరియస్సైపోతావేంటి హర్షా. నీకు నేనూ నాకు నువ్వూ రాసిపెట్టి వున్నాంగనుకే ఇలా జరుగుతోంది. ఇదీ మనమంచికేలే. అతిత్వరలో అన్ని గొడవలూ సర్దుమణగబోతూండగా మనం ఏదేదో అనుకోవడం ఆడిపోసుకోవడం మంచిదికాదు. నా మనస్సు నీకు తెలీదా డియర్'' అన్నాడామె పక్కనే కూర్చుంటూ.

"నాకెందుకో బతుకుమీద విరక్తిపుడుతోంది''

"తప్పుతప్పు మన బిడ్డల బోసి నవ్వులు చూడాలి. బుడిబుడి నడకలు చూడాలి. చిలక పలుకులు వినాలి. కేరింతలు కొట్టాలి. వాళ్ళ చుట్టూ తీయని వూహలల్లుకోవాలి. వాళ్ళు పెరిగి పెద్దవుతోంటే పొంగిపోవాలి. వాళ్ళని ప్రయోజకులుగా తీర్చిదిద్ది మురిసిపోవాలి. వాళ్ళ పెళ్ళి చేసి వాళ్ళ పిల్లలకి కథలు చెప్పాలి. ఇన్ని మధురానుభూతుల్నీ తీయని బాధ్యతల్నీ కాలదన్నేసి ఎక్కడికెళ్ళగలం? ఏం బావుకుందామనెళ్ళగలం! బాధ్యతల్ని నిర్వర్తించడంలోనే సుఖమూ సంతోషమూ వున్నాయి హర్షా..."

ఆమె కళ్ళముందు ఏడురంగుల ఇంద్రధనుస్సులాంటి భవిష్యత్తుని ఆవిష్కరించేసరికి ఆమె మెదడు మొద్దుబారింది. మనస్సు మెత్తబడింది. అతడు చేసిన ట్యూనింగ్‌కను గుణంగా మారిపోయింది.

"ఎంత బాగా చెప్పేవు. ఆ సుందరస్వప్నాన్నెలా చిదిమెయ్యగలను? కాని... కాని... ఆ స్వప్నం సత్యమవుతుందంటావా శ్రీనూ?"

"కష్టకాలంలో నాకు తోడుగా వుండి సుఖపడే కాలం వచ్చేసరికి ఈ వైరాగ్యధోరణి ఏమిటి హర్షా? ఇంకొద్దిరోజుల్లో విడాకులు మంజూరైపోతాయి. మన కష్టాలూ కన్నీళ్ళూ వేదనలూ అన్నీ తీరిపోతాయి. ఒక్కసారిగా ప్రపంచం ఈర్ష్యపడేంత ఆనందపు జంటగా మారిపోతాం హర్షా!"

"మరి ఈ కేసు సంగతి?"

"ఆc... గాలివీస్తే ఈ మబ్బులు తొలగిపోకుండా వుంటాయా చెప్పు? అక్కడి అల్పపీడనంవల్ల ఇక్కడ వాయుగుండం ఏర్పడింది. అది తగ్గితే ఇదీ శాంతిస్తుంది కదా!"

చాన్నాళ్ళ తర్వాత బీటలు వారిన ఆమె మనస్సు బీడుమీద తొలకరి వాన కురిసినట్టుగా ఫీలయ్యింది. భవిష్యత్తు ఆశావహంగా కన్పించసాగింది.

"అయితే అన్ని చిక్కుముళ్ళూ విడిపోతాయంటావు. మన బిడ్డ అదృష్టజాతకుడంటావు..." అతడి ఒళ్ళో తలపెట్టుకుంది.

"అందులో ఎలాంటి సందేహంలేదు. వాడివల్ల మన జీవితాలు ఆనందమయం కానున్నాయి''

"ఇప్పుడా పోలీసు గొడవనుంచి బయటపడ్డానికేం జేద్దామంటావు?"

"కేసుపోతే పోయిందిగాని లా తెలిసిందన్నాట్ట వెనకటికెవడో. అలాగే డబ్బు తింటే తిన్నాడుగాని ఆ పోలీసోడు మంచి క్లూ ఇచ్చాడు. పోలీసులకి దొరక్కుండా తప్పించుకోవడమే మార్గం అనుకున్నాను. యాంటిసిపేటరీ బెయిలు తెచ్చుకోవచ్చని నాకు తెలీనేతెలీదు. ఎలావోలా తెచ్చేసుకుంటే ఆ తర్వాత కథ నేను నడిపిస్తాను. నా తడాఖా ఏమిటో చూపిస్తాను. నువ్వెళ్ళి మీ అల్లురామలింగయ్యతో బెయిలు వ్యవహారం మాట్లాడేసెయ్''

"ఆయన దగ్గరకా! ఇదివరకు తలబిరుసుగా మాట్లాడాను. ఆయన మాటలేవీ వినలేదు. ఇప్పుడు ఏ మొఖం పెట్టుకెళ్ళను? ఇంకో ప్లీడరు దగ్గరికెళ్తాను..."

"డాక్టర్లూ ప్లీడర్లూ పోలీసులూ కేసుల కోసం గోతికాడి నక్కల్లా కాచుక్కూర్చుంటారు. కేసు దొరికిందో అవతలివాళ్ళ పనిగో




విందే. నమలకుండా మింగేస్తారు. అసలే కష్టకాలంలో వున్నాం. ఇంకో ఫ్లీడర్ని మేప లేంగాని ఆ ముసలాయన దగ్గరికెళ్ళు. సెంటిమెంటు దెబ్బతో కొడితే ఫీజు కూడా అడగడు''

అతడివంక అదోలా చూసింది. ఆ చూపుల్లో కించిత్తు అసహ్యం లేకపోలేదు. నిట్టూర్చింది. అయిష్టంగానే లేచి కింది వాటాలోకెళ్ళింది హర్ష.

రామలింగయ్యగారు క్లయింట్సుతో మాట్లాడుతున్నారు. అందుకని హాల్లో కూర్చుంది. అంతవరకూ సోఫాలో కూర్చుని చదువుకుంటున్న గోపి పుస్తకాలక్కడ పారేసి విసురుగా వెళ్ళిపోయాడు.

చిన్నబుచ్చుకుంది హర్ష.

వాడి కళ్ళకి తనెలా కన్పిస్తోందో ఏమో తను కనబడితే చాలు మొఖం తిప్పేసుకుంటున్నాడు!

ఏదో తెలీని సన్నని బాధ గుండెల్ని మెలిపెట్టింది.

పమిటి కొంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది కామేశ్వరి.

"పెనంమీంచి పొయ్యిలో పడ్డట్టయ్యింది. ఆడదైనా మగాడైనా లక్ష్మణరేఖకి ఇవతలే వుండాలి. అది దాటితే ఎంతటి అనర్థమైనా జరగొచ్చు. పెద్ద చదువులు చదివితే చాలదు. లోకరీతి తెలుసుకుని మసలుకోవాలి. లోకజ్ఞానంతో వ్యవహరించాలి. లేకపోతే నీలాగే గానుగలోని చెరకులా నలిగిపోవాల్సొస్తుంది. మగాడికేం మగమహారాజు- కష్టాలూ కన్నీళ్ళూ బరువులూ బాధ్యతలూ నిందలూ నీడలూ అన్నీ ఆడదానికేగా!"

ఆవిడ మాటలకి హర్ష బదులివ్వలేదు.

"పోగాలం దాపురించిన వాళ్ళింతేలేమ్మా. మంచిమాట వినరు'' గొణుక్కుంటూ వెళ్ళిపోయిందావిడ.

ముళ్ళమీద కూర్చున్నట్టుగా కూర్చుంది. దుఃఖం పొంగి రాబోతోంటే అతికష్టంమీద నిగ్రహించుకొంటోంది.

ఇందిర కాలేజీనుంచొచ్చింది.

ఆమెలో చాలా మార్పు కన్పించింది హర్షకి. ఇదివరకట్లా దిగులుగాలేదు. బెరుకుగాలేదు. చాలా ధీమాగా వుంది. ఉత్సాహంగా వుంది. తన శక్తేమిటో తెలిసిందాన్లా వుంది. తుఫానుల్ని తట్టుకుని నిలబడిందాన్లా వుంది. ప్రతికూలకెరటాల్ని ఎదిరించి నిలిచిందాన్లా వుంది.

ఆమె మోములో ఏదో తృప్తి మరెంతో ఆత్మవిశ్వాసం వెలుగులు చిమ్ముతున్నాయి!

హర్షని చూసి చిన్నగా నవ్వింది. పలకరించి గదిలోకెళ్ళిపోయింది ఇందిర.

ఆమె భర్తని వుంచుకున్నావిడ వదిలేసి వెళ్ళిపోయాక ఏం జరిగిందీ తెలీలేదు. అతనిలో మార్పొచ్చిందీ లేనిదీ రాజీప్రయత్నాలు ముమ్మరం చేసిందీ లేనిదీ తెలీలేదు. అవన్నీ అడగాలనుకుంది. కాని నోర్రాలేదు. కన్పించని చేతులేవో నోరుమూసినట్టుగా ఆగిపోయింది.

ఇందిరతో తనని పోల్చుకుంటూ కూర్చుంది హర్ష.

ఆమె తన భర్త మరొకామెని వుంచుకుంటానంటూ ఇంటికి తీసుకొస్తే ఎదిరించింది. అతడు ఇంట్లోంచి తరిమేసినా ధైర్యంగా నిలబడింది. మగతోడు లేకపోయినా తలెత్తుకుని బతకగలననుకుంది. దుఃఖాన్ని దిగమింగింది. జీవితాన్ని తీర్చిదిద్దుకుంది. ఆర్థిక స్వాతంత్ర్యం చేజిక్కించుకుంది. తన బిడ్డల్ని అపురూపంగా పెంచుతోంది. నలుగుర్లో గౌరవంగా మెలుగుతోంది. ఆత్మవిశ్వాసంతో భవిష్యత్తులోకి నడుస్తోంది!

మరి తను?

అడుగడుగునా అనాలోచితంగా అపరిపక్వంగా తొందరపాటుతో వ్యవహరించింది. తప్పుదిద్దుకునే అవకాశాల్ని కూడా చేజేతులా చేజార్చుకుని చీకటి భవిష్యత్తులోకి పరుగులు పెడుతోంది!



బాధతో సుళ్ళుతిరిగింది. తను ఒంటరిది బలహీనురాలు అభాగ్యురాలు- అన్నభావం ఆమెని నిలువునా నమిలేస్తోంటే కళ్ళ నీళ్ళ పర్యంతమయ్యింది!

గుమస్తా వచ్చి పిలిచాడామెని. కళ్ళు తుడుచుకుంటూ ప్లీడరుగారి దగ్గరికెళ్ళింది.

పోలీసులు వేటాడుతోన్న శ్రీనుని తనింట్లో దాచిందని తెలుసుకుని విస్తుబోయారు. ఆందోళనపడ్డారు రామలింగయ్యగారు.

"నువ్వు చాలా తప్పుచేస్తున్నావమ్మా. ఏమైనా గొడవైతే మధ్యన నీ జీవితం నాశనం అయిపోతుంది!"

"ఇప్పుడవ్వలేదంటారా బాబాయ్'' ఆమె కంఠం గాద్గదికమయ్యింది.

"ఇక వెనకడుగు వెయ్యలేనంత దూరం వెళ్ళి పోయాను. యాంటిసిపేటరీ బెయిలుకి ఏర్పాటుచేసి మీరే మమ్మల్ని ఒడ్డున పారెయ్యాలి''

"ఈ కేసులో బెయిలు హైకోర్టునుంచి తెచ్చుకోవాలి..."

తలాడించింది.

"సరే. నా ఫ్రండొకడు హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్నాళ్ళే. అతడి ద్వారా ఏర్పాటు చెయ్యొచ్చనుకో. కాని చాలా ఖర్చవుతుంది. కొందరు పెద్దలో ఉద్యోగులో పూచీకత్తు ఇవ్వాలి. బ్యాంకులోని వాళ్లెవరైనా ఇస్తారా?"

తల అడ్డంగా వూపింది. "మమ్మల్ని నమ్మి హామీ ఇచ్చే పరిస్థితిలో లేరెవరూ''

"సరే... నేనే ఎవర్నో చూస్తాన్లే..."

"శ్రీను భార్య పిచ్చిది. ఆ కారణంమీద విడాకులకోసం చేసిన దరఖాస్తు కోర్టులో వుంది. ఆ ఆధారాల్నేమైనా వుపయోగించుకుని త్వరగా బెయిలు పొందొచ్చంటారా బాబాయ్?"

ప్రమాన్పడిచూశారు. వెర్రిగా చూశారు. జాలిగా చూశారు. బాధగా చూశారు.

"ఆ సంగతి నీకెవరు చెప్పేరమ్మాయ్'' అతికష్టంమీద అడిగారు.

"ఇంకెవరు? శ్రీనే!"

"నువ్వెంత అమాయకురాలివి తల్లీ! గొర్రె కసాయివాణ్ణి నమ్ముతుందన్న నానుడి నిజమని రుజువు చేస్తున్నావు కదా!"

"అలా మాట్లాడతారేమిటి బాబాయ్. అది పచ్చి నిజం. ఆ కేసు వేగిరపరచడానికి నా నెక్లెస్ అమ్మి మరీ డబ్బిచ్చాను తెలుసా?"

"తెలియక్కర్లేదు. కథంతా అర్థమవుతోంది. శ్రీను భార్యని నేను కలిశాను. మాట్లాడాను. ఆమె పిచ్చిది కాదు..."

"బాబాయిగారూ!" షాక్ తగలగా అరిచిందొక్కసారే.

హఠాత్తుగా భూమి చీలి అందులోకి కూరుకుపోతున్నట్టుగా అన్పిస్తోంటే వణికిపోయింది. కళ్ళల్లోంచి కన్నీళ్ళు ధారలుకట్టాయి.

"ఆ విడాకుల కేసు కూడా అబద్ధమే అయ్యుంటుంది. అతడి తల్లిదండ్రులు కూడా ఆ విషయమేమీ చెప్పలేదు''

"ఇప్పుడే వస్తాను..."

విసురుగా పెద్దపెద్ద అడుగులేస్తూ డాబా ఎక్కి తన పోర్షన్లోకెళ్ళింది.

"శ్రీనూ! నీ భార్య పిచ్చిది కాదా?" గర్జించినట్టుగా అడిగింది.

దిమ్మెరబోయి చూశాడు. ఆమె స్థితినిబట్టి పరిస్థితిని అంచనావేశాడు.

"అది కోర్టు తేల్చాల్సిన సంగతి..."

"విడాకులకేసు తాలూకు వివరాలియ్యి..."

"అవన్నీ ప్లీడరు దగ్గరుంటాయి. ఈమధ్య ఈ గొడవలోపడి ఆ కేసుని నిర్లక్ష్యం చేశాను కూడా. అదేమయ్యిందోఏమో. అసలా గొడవలన్నీ మనకనవసరం. నేను ఉద్యోగానికి రాజీనామా ఇవ్వగానే అన్నీ సెటిలైపోతాయి. చెప్పుడు మాటలు విని మనసు పాడుజేసుకోవద్దు. నామీద నమ్మకంలేకపోతే చెప్పు ఇప్పుడే ఈ మేడమీంచి దూకేసి




ఆత్మార్పణ చేసుకుంటాను''

"నమ్మకం! హు! ఆ పదానికర్థం ఏమిటో మర్చిపోయాను!"

ఆమె కళ్ళు కన్నీటిబుగ్గలయ్యాయి. కళ్ళు తుడుచుకునే ప్రయత్నం కూడా చెయ్యకుండా వెనుదిరిగి వచ్చేసింది.

మౌనంగా విషాదమూర్తిలా కూర్చుండిపోయింది హర్ష.

"నా కూతురులాటిదానివి. రెండు మాటలు చెప్పడం నా ధర్మం. ఆపైన నీ ఇష్టం. అసలు చిత్రం చూశావా. ఒక కూతుర్ని కాదని మరొకర్తో సంబంధం పెట్టుకున్నాడో అల్లుడు. తాళికట్టిన పెళ్ళాన్ని కాదని వచ్చి మరో కూతుర్ని ఏలుకుంటానంటున్నాడింకో అల్లుడు. ఎంత విడ్డూరమో చూడు. అంతకంటే విడ్డూరం అతడ్ని అతడి భార్యనుండి రక్షించమని నువ్వు నన్ను కోరటం! సరిసరి. ఆ గొడవకేంగాని ఇప్పటికైనా మించిపోయిందిలేదు. అతడేవిటో నీకు పూర్తిగా అవగాహనయ్యింది గనుక ఇప్పుడైనా అడుగు వెనక్కి తీసుకుంటే మంచిది''

"నాకు చుట్టూ చీకటే కన్పిస్తోంది బాబాయ్''

"చీకటి పోవాలంటే సూర్యకాంతి ఇంట్లోకి రావాలంటే కిటికీ తలుపులు తెరవాలమ్మా''

"నేను అలసిపోయాను బాబాయ్..."

"అలా నిరాశపడొద్దు. నీకోసంగాకపోయి నా నీబిడ్డకోసమైనా నువ్వతడికి దూరంగా వెళ్ళిపోవటం మంచిది. ఇదివరకే చెప్పేను. మీ అన్నయ్యలూ చెప్పేరు. ఈ సుడిగుండంనుంచి బయటపడితే చాలు చులాగ్గా ఈతకొట్టుకుంటూ ఒడ్డెక్కెయ్యొచ్చు..."

"వద్దులే బాబాయ్. ఒక్కో అనుభవమూ ఒక్కో పాఠం చెబుతోంది. ఇలాగైనా నేర్చుకోనీ. కనీసం నాబతుకు నాలాటివాళ్ళకి ఓ గుణపాఠం ఓ హెచ్చరిక కానివ్వండి''

"చూడమ్మాయ్. ఎక్కడా పూర్తి మంచివాళ్ళూ పూర్తి చెడ్డవాళ్ళూ అంటూ వుండరు. అందర్లోనూ రెండు గుణాలూ వుంటాయి. కాదంటే చెడుగుణాల్ని అదుపులో పెట్టుకున్నవాళ్ళే అభినందనలందుకోగల్గుతారు. రావణుడి సంగతే తీసుకో. అతడు గొప్ప పరిపాలనాదక్షుడు. పరాక్రమవంతుడు. పరమశివ భక్తుడు. కళాభిలాషి. అయినవారిని ఆదరంగా చూసే ప్రేమమూర్తి. కాని పరస్త్రీ వ్యామోహం ఒక్కటే అన్ని సుగుణాల్నీ కప్పేసింది. అంతటివాడ్నీ మట్టికరిపించింది. బంధుమిత్ర సపరివార సహితంగా నాశనం చేసేసింది!"

"ఎంత పచ్చి నిజం! చిన్నప్పట్నుంచీ కూడా రామకథని ఎన్నోసార్లు విన్నాను. చదివాను. చూశాను. సీతారాములంటే ఆరాధనాభావాన్ని పెంచుకున్నాను. కాని రామాయణ సారాన్ని గ్రహించలేకపోయాను!"

"వైరాగ్యంవద్దు. వేదాంతమూ వద్దు. చెప్పేది విను. నువ్వు తెలివైందానివి. మంచిదానివి. వయస్సులో వున్నదానివి. అధికారిణిగా హెూదా అధికారం గౌరవం డబ్బూ అన్నీ వున్నదానివి. కాని ప్రేమ అను పెళ్ళి అను, పరపురుష వ్యామోహం అను- ఏ పేరు పెడితేనేం గాక- అందులో పడ్డావు. కళ్ళు మూసుకుని పీకలలోతు వరకూ కూరుకుపోయావు. ఇప్పుడైనా బయటపడటానికి ప్రయత్నించకపోతే రేపు ప్రయత్నిద్దామన్నా ప్రయత్నించడానికేమీ మిగలకపోవచ్చు. అతడ్ని వెళ్ళిపోనియ్యి. భార్యా భర్తల్ని కలవనియ్యి. మూడో మనిషిలా మిగిలిపోవద్దు. పెద్దవాడ్ని. నీ క్షేమం కోరి ఇంతగా చెబుతున్నాను. మనసు పెట్టి బాగా ఆలోచించు''

"మీరు చెప్పింది అక్షరసత్యం బాబాయ్. నేను ఓడిపోయే యుద్ధం చేస్తున్నాను. ఓటమి ఖాయమని నాకు తెలుస్తోంది. అయినా నేను యుద్ధం చెయ్యక తప్పదు. అంతే!"

చీరకొంగు నోట్లో కుక్కుకుని గబగబా వెళ్ళిపోయింది హర్ష!

రామలింగయ్యగారి కళ్ళల్లో కన్నీటి అల భళ్ళున, పగిలింది!

★ ★ ★

బ్యాంకుకి రీజినల్ మేనేజర్ వచ్చారు. హర్ష ప్రైప్రాణాలు పైనే పోయాయి. ఆయనకి తనగొడవ తెలిసే వుంటుంది. తెలియకపోతే మేనేజరు తెలియజేస్తాడు. గనుక ఏదో యాక్షన్ తీసుకుంటారేమోనని భయపడింది.

పుండుమీద కారంలా అవాళ్టి దినపత్రికలో శ్రీనుమీద జానకి పెట్టిన కేసు గురించి వార్తాకథనం ప్రచురించారు. తన పేరూ బ్యాంకు పేరూ కూడా పేర్కొన్నారు. శ్రీను పరారీలో వున్నాడని రాశారు.

'ఆరెమ్' తమిళుడు. గనుక తెలుగు పేప



రు చదివే అవకాశం లేదు. మేనేజరు చెప్ప కుండా వుంటే బావుడ్నని దేవుళ్ళకి మొక్కు కుంది. ఒకవేళాయన ఏకరువు పెడితే ఏం జరుగుతుందన్నది ఆమె ఊహకందటంలే దు!

సన్నగా కంపిస్తూ నేప్‌కిన్‌తో ముఖమూ చేతులూ మాటిమాటికీ తుడుచుకుంటూ కూర్చుంది.



ఆరెమ్ బ్యాంకు వ్యాపార విశేషాలూ ముఖ్యాంశాలు పరిశీలించాక హర్షని పిలిచారు.

ఎత్తుగా వున్న ఆమె కడుపుని చూసి తల పంకించారాయన.

"నువ్వు రెస్పెక్టబుల్ ఆఫీసరువి. నీ ప్రవర్తన డిగ్నిఫైడ్‌గా వుండాలి. బ్యాంక్ ఇమేజ్ పెంచేదిగా వుండాలి. రాంగ్‌కనెక్షన్ గొడవల్లో ఇరుక్కుని బ్యాంక్‌కి బేడ్‌నేమ్ తెస్తే సహించను. బ్యాంకు ఇమేజ్‌కి భంగం కలిగితే సీరియస్ యాక్షన్ తీసుకోడానికి ఐ డోంట్ హెజిటేట్. బీ కాషస్ అండ్ కేర్‌ఫుల్. మైండిట్' అని హెచ్చరించి వెళ్ళిపోయాడాయన.

ఆయనటు వెళ్ళగానే ఆమెని రాష్ట్రపు మరో మూలకి ట్రాన్స్‌ఫర్ చేయిస్తానని ఆయన చెప్పినట్టు బ్యాంకులో గుసగుసలు వ్యాపించాయి.

"మాక్కావల్సిందీ అదే'' అనుకుంది హర్ష. మొత్తానికి గండం గడిచినందుకు సంతోషించింది. పిడుగులు పడకుండా ఉరుములుతోనే సరిపెట్టినందుకు ఎంతో రిలీఫ్‌గా ఫీలయ్యింది.

మధ్యాహ్నంవేళ ఓ మహిళా సంఘం తాలూకు పాతికమంది మహిళలు హర్షతో మాట్లాడాలంటూ బ్యాంకుకొచ్చారు.

మేనేజరు వాళ్ళని లోపలికి రానివ్వలేదు. హర్షనే బయటికెళ్ళి మాట్లాడమన్నాడు.

'ఆరెమ్' వుండగా వాళ్ళొచ్చి వుంటే తనని స్పాట్‌లో సస్పెండ్ చేసి వుందురనుకుంటూ బయటికెళ్ళింది.

అంతా చుట్టుముట్టారు.

ఆశ్చర్యంగా భయంగా గాభరాగా చూసింది హర్ష. వాళ్ళెందుకొచ్చారో అర్థంకాలేదు. ఏమైనా చేస్తారేమోనని గుండెలు గుబగుబలాడాయి.

మరో ఆడదానికి అన్యాయం చేస్తావా అని నిలదీశారు. మహిళా లోకానికి చెడ్డ పేరు తెస్తున్నావని నిందించారు. ఓ దుర్మార్గుడికి ఆశ్రయం ఇస్తావా అని తిట్టారు. అమాయకపు గొర్రెలా కసాయివాడ్ని నమ్మొద్దని హితవు చెప్పారు.

అంతేకాదు, అతడ్ని ఇంట్లోంచి తరిమెయ్యమన్నారు. నిన్ను మోసం చేసి పెళ్ళిచేసుకున్నందుకు ఎదురు కేసు పెట్టమన్నారు. అతడి లాటివాళ్ళకి గుండుకొట్టించి సున్నం బొట్లు పెట్టి గాడిదమీద వూరేగించాలన్నారు. అతడికి నువ్వు బుద్ధి చెప్పాలన్నారు. ఇంకెవర్నీ ఇలా మోసంచెయ్యకుండా తగిన శిక్ష విధించమన్నారు.

ఆ పైన జానకి కాపురాన్ని చక్కబరచగలిగింది నువ్వేనన్నారు. మరో ఆడదాని వుసురు పోసుకోవద్దన్నారు. దుష్టుడితో కాపురం చేసేకన్నా ఒంటరిగా బతకడంలోనే ఆత్మగౌరవం వుందన్నారు.

ఎన్నో చెప్పారు. తిట్టారు. సానుభూతీ చూపారు. నినాదాలూ చేశారు.

హర్ష మాత్రం పెదవి విప్పలేదు. మౌనంగా వింటూండి పోయిందంతే.

విసుగొచ్చి తిట్టారు. శపించారు. హెచ్చరించి వెళ్ళిపోయారు.

జనసముద్రం మధ్య ఒంటరిగా మిగిలిపోయింది హర్ష!

జనం చూపులూ, హేళనలూ, తిట్లూ వెంటాడుతోంటే తిన్నగా వుండలేకపోయింది. అవమానాన్ని దిగమింగలేకపోయింది.

అనారోగ్యంగా వుందని లాంగ్ లీవు పెట్టి ప్యూన్‌ద్వారా మేనేజరుకి పంపి బయటికి నడిచింది.

ఇంటికెళ్ళేసరికి శ్రీను ఈలవేస్తూ కూనిరాగాలు తీస్తూ హుషారుగా గంతులేస్తున్నాడు.

"బెయిలు లభించిందా?" చేటంత మొహంచేసుకుని ఆత్రంగా అడిగింది.

"వచ్చేసింది. ప్రాక్టీసు పెద్దగా లేకపోయి





# సచిత్ర విచిత్రం

## కోర్టు పక్షి




పక్కవాళ్లతో పేచీ అమెరికాలో కూడా ఎక్కువే. పక్కింట్లో పెరిగే బాదం చెట్టు కొమ్మలు తన ఇంటి కాంపౌండ్‌వాల్ మీదుగా తన ఆవరణలోకొచ్చి ఆకులు రాలుతూండటంతో ఆ కొమ్మలు కొట్టించమన్నాడు ఎర్నెస్ట్ హెులింగ్స్. కానీ అతని పొరుగింటాయన అందుకు ఒప్పుకోలేదు. ఎర్నెస్ట్ కోర్టుకెక్కాడు. ఆరువారాలు కోర్టులో వాదోపవాదాలు సాగాక ఎర్నెస్ట్‌కి నష్టపరిహారంగా రెండు వేల డాలర్లు ఇవ్వాలని జడ్జిగారు తీర్పు చెప్పారు. ఎర్నెస్ట్‌కి తన లాయరు ఫీజు, కొమ్మలు కొట్టించడానికయ్యే కూలి ఖర్చులు, కోర్టు ఖర్చులకు మొత్తం 2001 డాలర్లు ఖర్చయ్యాయి. ఈ కేసుకారణంగా అతను నష్టపోయింది ఒక డాలరు. మళ్లీ ఆ డాలర్ కోసం కోర్టుకెక్కాడతడు. కేవలం ఒక్క డాలరు నష్టపరిహారం కోసం కోర్టుకెళ్లిన కేసు ఈయనగారిదొక్కటే.

నా మీ రామలింగయ్య ఘటికుడే. తొందరగా బెయిల్ వచ్చేట్లు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు. లేకపోతే ఇంత త్వరగా వచ్చేది కాదంటున్నారు''

"ఆయనకి నేనంటే ఎంతో అభిమానం!"

"ఆ అభిమానంతోనే మన కేసు టేకప్ చేస్తాడేమో కనుక్కో''

"ఏ కేసు?"

"ఏకేసేవిటి నీమొఖం. జానకి పెట్టినకేసు. ఇప్పుడు మనకి దొరికింది అరెస్టునుంచి తప్పించుకోడానికి బెయిలు మాత్రమే. కేసు మామూలుగానే జరుగుతుంది. సాక్ష్యాలూ కోర్టుచుట్టూ తిరగడాలూ అన్నీ మామూలే'

అంతులేని నీరసం ఆవహించగా సోఫాలో కూలబడింది.

"అలా అయిపోయావేం?"

"అయితే మనం ఈ మనుషులకీ ఈ పరిసరాలకీ ఈ గొడవలకీ దూరంగా వెళ్ళిపోలేమా?"

"వెళ్తే కోర్టుచుట్టూ ఎవరు తిరుగుతారు? నేను ఒక్క వాయిదాకి మిస్సయినా అరెస్ట్ వారంట్ ఇచ్చేస్తారు''

దిక్కుతోచని దాన్లా చూస్తూండిపోయింది హర్ష.

తను నడుస్తోంది. కాళ్ళు పీకుతూనే వున్నా నడుస్తూనే వుంది. కాని ఎప్పటికైనా గమ్యం చేరుకోగలదా? అసలు గమ్యదిశగానే తను నడుస్తోందా?

గుండెలవిసి పోతోంటే సోఫాలో వాలిపోయింది.

అతడదేం పట్టించుకోలేదు. చాలా ఉత్సాహంగా వున్నాడు. సంకెళ్ళు తెగిపోయినట్టుగా వున్నాడు.

"హమ్మయ్య! ఇకనుంచి నక్కినక్కి దాక్కోనక్కర్లేదు. ఘరానాగా కాలర్ ఎగరేసి తిరగొచ్చు. ఇహ ఇప్పుడు నేనేమిటో నా ప్రతాపమేమిటో చూపిస్తాను''

"శ్రీనూ!"

"నాకు అర్జంటుగా డబ్బు కావాలి. మన సమస్యకి శాశ్వత పరిష్కారం కనుక్కోబోతున్నాను''

"ఏం చేస్తావు?"

"మన పెళ్ళి తనకిష్టమేనని పాత తారీఖుతో జానకిచేత లెటర్ రాయిస్తాను. భయపెట్టో బలవంతపెట్టో రాయించడానికి కొందర్ని మాట్లాడతాను. ఆ తర్వాత నా జూలు విదిలిస్తాను. ఈ గొడవలకి మూలవిరాట్టు అయిన మా మావగారి కాలో చెయ్యో తీయించేస్తాను. నా తడాఖా చూపిస్తాను. నా కసి తీర్చుకుంటాను'' వికృతంగా నవ్వేడు.

"వద్దొద్దు శ్రీనూ. అలాటి గొడవల జోలికి పోవద్దు. మరిన్ని కేసుల్లో ఇరుక్కోవద్దు''

"నేను మగాడ్నే. మీసం రోషం వున్నవాడ్ని. నాచేత అజ్ఞాతవాసం చేయించిన వాడ్నెలా వదుల్తాను చెప్పు?"

"నీకు మతి చలిస్తున్నట్టుంది. లేకపోతే..."

"షటప్. ఆడదానివి ఆడదానిలా పడుండు. వూరికే సలహాలివ్వకు'' అధికారం ప్రదర్శించేడు.

నోరెళ్ళ బెట్టి చూసిందో క్షణం.

"నీతో బంధం ఏర్పరచుకున్నందుకు తప్పకుండా ఏ శంకరగిరి మాన్యాల్లోనో పడివుంటాన్లే. ఆరోజూ రాబోతోంది. మా ఆరెమ్ వచ్చి వెళ్ళాడు. మారుమూల బ్రాంచికి ట్రాన్స్ఫర్ చేయిస్తాట్ట''

"ఏడిశాడు! అతడు నీతో అసభ్యంగా ప్రవర్తించాడనీ రాత్రి హెూటల్‌కి రాకపోతే మారుమూల ప్రాంతానికి ట్రాన్స్ఫర్ చేయిస్తానని బెదిరించాడనీ మీ హెడ్డాఫీసుకి లెటర్ రాసి పడెయ్. దెబ్బకి అతడి తిక్క కుదిరిపోతుంది!"

శ్రీనూ! అంత అసహ్యంగా మాట్లాట్టానికి నీకు నోరెలా వచ్చింది?"

"నోరున్నది ఎలాగైనా మాట్లాట్టానికేగాని




కబుర్లకి టైములేదు. నాకు అర్జంటుగా డబ్బు కావాలి. ఇవ్వు'' డిమాండ్ చేశాడు.

"ఎక్కడ్నుంచి తెచ్చివ్వను? నేను దాచుకున్న డబ్బు ఇచ్చాను. నగలు ఇచ్చాను. లభించినన్ని లోన్లు తీసుకుని ఇచ్చాను. చీటీలు పాడి చేబదుళ్లు చేసీ ఇచ్చాను''

"అంతా నాకోసం ధారబోసినట్టూ పెద్ద త్యాగజీవి వైనట్టూ మాట్లాడతావేంటి?!"

"నేనే ఇచ్చానో నీ గురించే ఖర్చుపెట్టానో ఏమైతేనేం అంతా అయిపోయింది. ఇక మిగిలింది నేనూ, నా మెడలో చెయినూ, కడుపులో బిడ్డా, ఆ అపార్టుమెంటూ అంతే!"

"అయితే అపార్టుమెంటు అమ్మేద్దాం"

"శ్రీనూ!"

"ప్రాణాలిమ్మన్నట్టు అరుస్తావెందుకు? లోకంలో ఇళ్ళెవరూ అమ్ముకోరా?"

"గృహప్రవేశం చెయ్యకుండానే అమ్మేద్దామనడానికి నీకు నోరెలా వచ్చింది శ్రీనూ?" కన్నీళ్ళు వుబికివస్తోంటే అంది.

"అవసరం అలాటిది. మరి. అది మనిషిచేత ఎన్ని వేషాలైనా వేయిస్తుంది''

"కేవలం డబ్బుకోసం కలలుకన్న ఇంటిని..." ఆ పైన మాటలు రాలేదు.

"కేవలం డబ్బు కాదు. డబ్బే సర్వస్వమూనూ. డబ్బుని మించిన మెజీషియన్ ఈ భూమ్మీదే లేదు తెలుసా?"

"దానిమీద బ్యాంక్‌లోన్ వుంది తెలుసా?"

"ఎలా మర్చిపోతాను. లోన్ అప్లై చేయించింది నేనే కదా. అప్రిసియేషన్ పాతిక ముప్పై వేలుంటుంది. అమ్మి అప్పు తీర్చినా మిగిలింది నాకు చాలు''

"చచ్చినా దాన్ని అమ్మను. ఆ ఇంటి గురించెన్ని కమ్మని కలలు కన్నాను! ఎంతగా తపించాను! నిర్మాణం పూర్తవ్వొచ్చింది గనుక వచ్చే నెలలో గృహప్రవేశం చెయ్యొచ్చనుకున్నాను. నీతో కలిసి పీటలమీద కూర్చుని సత్యన్నారాయణస్వామి వ్రతం చెయ్యాలని ఆశపడుతున్నాను. అంతేకాదు, ఆ అపార్ట్‌మెంటుకి మన బిడ్డ పేరు పెట్టాలనీ దాన్ని వాడికి చిరుకానుకగా బహూకరించాలనీ మధురోహలల్లుకున్నాను''

"వూహలెన్నైనా అల్లుకో. కలలెన్నైనాకను. పెట్టుబడి అక్కర్లేనివి అవేకదా. కాని అపార్ట్‌మెంటు అమ్మనని మాత్రం అనకు. నేనసలే మంచివాడ్నికాదు''

"ప్లీజ్ శ్రీనూ. మన బిడ్డకోసం అది కూడా మిగల్చలేవా చెప్పు?"

"ఏకంగా పెద్ద ఇల్లే కొంటాన్లేగాని ముందు దీన్ని అమ్మేద్దాం"

"నో... నేనొప్పుకోను'' అరిచినట్టుగా అంది.

"మన బిడ్డకి బహూకరించాలి. అంతే'' అంది మళ్ళీ.

"బిడ్డకోసం నన్ను కాదంటున్నావన్న మాట"

"అవును అలాగే అనుకో''

"అయితే బిడ్డే లేకుండా చేసేస్తాను''

"శ్రీనూ!"

"ఒక్క తాపుతన్నితే చాలు నెత్తురుగుడ్డగా మారిపోతాడు''

రాక్షసంగా నవ్వుతూ మీదిమీదికొస్తోంటే భయవిహ్వలఅయ్యింది. కడుపుని చేతుల్తో కప్పుకుని "వద్దు. రావద్దు. నా బిడ్డనేం చెయ్యొద్దు. నువ్వు చెప్పినట్టే వింటాను..." అంది . ఏడ్చేస్తూ.

"దట్స్ గుడ్. హర్ష మంచి అమ్మాయి. ఇల్లు అమ్మడానికి కొంచెంటైము పట్టొచ్చు. ఈలోగా ఖర్చులకి నీ మెడలోని గొలుసు ఇచ్చేసి పసుపుతాడు వేసుకో. ఉరితాడు తప్ప ఏతాడు వేసుకున్నా ఫర్లేదు!"

సృష్టిలో అసహ్యాన్నంతా ముద్దచేసి చూ



పుల్లో దట్టించి అతడి మీదకి విసిరేసింది హర్ష.



శ్రీను తల్లీ తండ్రీ వచ్చారు.

శ్రీనుతో మాట్లాడుతూ కూర్చున్నారు తప్ప హర్షవంక చూళ్ళేదు. పలకరించలేదు. అసలామె వూసే ఎత్తలేదు.

ఇద్దరూ కలిసి శ్రీనుకెంతో నూరిపోశారు.

అతడు మంచివాడే అన్నారు. ఆ అమ్మాయే చెడగొట్టిందన్నారు. మత్తుమందు పెట్టిందన్నారు. గతం మరచి పొమ్మన్నారు. బంధువుల్లో చెడ్డపేరు తీసుకురావద్దన్నారు. వంశంలో మచ్చగా మిగిలిపోవద్దన్నారు. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్య కంటనీరు పెడితే అతడికి జయం కాదన్నారు.

అతడికి మళ్లీ ఉద్యోగం వచ్చేలా మావగారు ప్రయత్నిస్తానని హామీ ఇచ్చారన్నారు. వ్యాపారం చేస్తానంటే ఏదోఒకటి తెగనమ్మి డబ్బు సర్దుతామన్నారు. జానకి కన్నీరు మున్నీరుగా విలపిస్తోందన్నారు. ఆమె కన్నీరు తమ వంశాన్ని నాశనం చెయ్యగలదన్నారు. ఇంటికి తిరిగిరమ్మని బతిమాలారు.

గదిలో వున్న హర్షకి వారి సంభాషణంతా స్పష్టంగా విన్పిస్తూనే వుంది. శ్రీను ప్రతిస్పందన ఏమిటో తెలీక తల్లడిల్లిపోతోంది.

ఒకపక్క తనతడికి దూరంగా వెళ్ళిపోనందుకు రోజుకొక్క సారైనా పశ్చాత్తాపపడుతూనే వుంది. మరోపక్క తనని విడిచి అతడు వెళ్ళిపోతాడేమోనని భయంగానూ వుంది.

ఏది మంచో ఏది చెడో, ఏం చేయాలో ఏం చేయకూడదో తేల్చుకోలేకుండా వుంది. అనేక భావాల ఆటుపోట్ల మధ్య కొట్టుమిట్టాడుతోంది.

మాటల మధ్యలో శ్రీను ఆమెని పిలిచాడు.

అదుర్తోన్న గుండెల్తో వెళ్ళింది.

"ఏం చేస్తున్నావే మొద్దూ. మా అమ్మానాన్నలకి కాఫీ నీళ్లు ఇవ్వాలని తెలీదూ? మా అమ్మకి చిక్కని ఫిల్టర్ కాఫీ ఇష్టం. బాగా తయారుచేసి పట్రా'' అంటూ హుకుం జారీ చేశాడు.

కన్నీళ్లు అదిమిపట్టి కాఫీ ఇచ్చివచ్చింది.

అప్పుడు కూడా వాళ్ళామెవంక చూళ్ళేదు. ఆమె అనే మనిషి లేనట్టు ప్రవర్తించారు.

కాస్సేపు మాట్లాడాక వాళ్ళ వెంట వెళ్ళిపోయాడు శ్రీను.

మాటమాత్రంగానైనా హర్షకి చెప్పలేదు.

తనని వదిలేసి వాళ్ళతో శాశ్వతంగా వెళ్ళిపోయాడేమో అన్పించిందొక్కసారి.

ఒంట్లోని రక్తమంతా అకస్మాత్తుగా నీరైపోయినట్టు నీరసంగా నిస్సత్తువగా కూలబడింది.

కన్నీళ్ళు బుగ్గలమీంచి జలజల కారాయి.

కన్నీళ్ళు!

పెళ్లయిన మరుక్షణంనుంచీ తనని గాఢంగా హత్తుకున్న నెచ్చెలి!

అంతకుపూర్వం నవ్వుతూండేది. తుళ్ళుతూండేది. ఉత్సాహంగా వుండేది. చక్కగా ఆలోచించేది. సరైన నిర్ణయాలు తీసుకునేది. ఇంటా బయటా అభినందనలందుకునేది.

పెళ్ళి తర్వాత ఒక్కొక్కటిగా రేకలూడిన

పూవైపోయింది. డబ్బూ దస్కం పరువూ మర్యాద సిగ్గూ లజ్జా అన్నిట్నీ వదులుకోవాల్సివచ్చింది. ఒక ప్రతి నాయికగా, ఒక కృతఘ్నురాలిగా ఒక అభాగ్యురాలిగా, ఒక బలహీనురాలిగా మారిపోవాల్సి వచ్చింది.

ఎంత చిత్రం! ఎంత విషాదం!

మరి రెండుగంటలకి తిరిగొచ్చాడు శ్రీను. తనకి తెలీకుండానే నిట్టూర్చిందామె.

"పోలీస్ స్టేషన్కిరమ్మని కబురొస్తే వెళ్ళాను'' బూట్లని విప్పుతూ అన్నాడు.

"ఎందుకుట?"

"రాజీ పరిష్కారానికి''

"ఏమన్నారు?"

"ప్రస్తుత స్థితిలో ఎవరికీ ఎలాంటి నష్టమూలేని పరిష్కారం సూచించారు. నాకూ అదే మంచిదన్పించింది''

"ఏ... ఏమిటో అది?"

"అక్కడ కొన్నాళ్ళు, ఇక్కడ కొన్నాళ్ళు. పెద్దిల్లు చిన్నిల్లు. పట్టపురాణి, ప్రేమరాణి. దేవుళ్ళక్కూడా ఇద్దరేసి భార్యలున్నారుకదా. ఇక నేనెంత? చాలా సినిమాల్లో కూడా ఇలాటి పరిష్కారాన్నే చూపించారు. సమర్థించారు. అసలు ఇద్దరు పెళ్లాల పద్ధతి మీ ఆడవాళ్ళకి భలేగా నచ్చుతుంది. అందుకే అలాటి సినిమాలన్నిటిని హిట్ చేసిపారేస్తుంటారు'' వంకరగా నవ్వేడు.

చిర్రెత్తుకొచ్చింది. ఒళ్లంతా బ్లేడుతో గీరి కారం అద్దినట్టు మండింది. రోషంగా చూసింది.

"అసల్నువ్వు నా గురించే మనుకుంటున్నావు? నువ్వు లేకపోతే బ్రతకలేననా? లేక బ్రతుకే లేదనా?" తీక్షణంగా చూస్తూ ప్రశ్నించింది.

"నిజం చెప్పాలంటే నువ్వో ఫూల్వి అనుకుంటున్నాను'' నవ్వేడు.

ఒళ్ళంతా తేళ్ళూ, జెర్రులూ ప్రాకినట్టన్పించిందా నవ్వుకి.

"శ్రీనూ''

"అరుపులు నీ ఒంటికి పడవుగాని నేనన్నది నిజమా కాదా చెప్పు, మాట్లాడవేమే..."

"ఇక మాట్లాడాల్సిందీ ఆలోచించాల్సిందీ ఏమీలేదు. నీ దృష్టిలో నాకు విలువ లేనప్పుడు మన సంబంధం కొనసాగించడమంత మూర్ఖత్వం మరొకటుండదు. అయ్యిందిచాలుగాని ఇక వెళ్ళిపో. నా ఇంట్లోంచి నా జీవితంలోంచి వెళ్ళిపో. నీకు వేనవేల నమస్కారాలు'' చేతులు జోడించింది.

"భలే తేలిగ్గా చెప్పాశావే. పొమ్మంటే పోయేవాడ్నయితే అంత కష్టపడి నీ చుట్టూ ఎందుకు తిరుగుతాను? నిన్ను ముగ్గులోకి ఎందుకు లాగుతాను? నా వాళ్ళకెందుకు దూరమవుతాను? ఇబ్బందుల్నీ ఇక్కట్లనీ ఎందుకు కొనితెచ్చుకుంటాను?"

"మరి... మరి... ఏంకావాలి? నీకు నేను మనోవర్తి ఇవ్వాలా?"

"నా దృష్టిలో ఆడదంటే అందమైన శరీరం. అద్భుతమైన స్వర్గం. అది నాకెప్పుడూ కావాలి. డబ్బు నా ఆరోప్రాణం. అది లేకపోతే నాకు వూపిరాడదు. అంచేత అదీ కావాలి. నువ్వు కల్పవృక్షానివి. నా కోర్కెలన్నీ తీర్చగల ఏకైక సాధనానివి. సో నిన్ను ప్రేమించాను. పెళ్లాడాను. అందలం ఎక్కించాను. అదుపులోకి తెచ్చుకున్నాను. నా పట్టులోంచి నువ్వు జారి వెళ్ళలేవు. వెళ్ళినా సుఖంగా వుండలేవు. వుండనివ్వను. మనది సెల్ఫ్ డిస్ట్రక్షన్ పాలసీ. నేను నాశనమైనా సరే ఎదుటివార్ని సర్వనాశనం చెయ్యాలనుకునే రకాన్ని. అర్థమైందా? అర్థమయ్యే వుంటుందిలే. నువ్వు చదివింది యల్కేజీ కాదు బియస్సీ కదా!"

పిచ్చిగా చూసింది. అసహ్యంగా చూసింది.

"ఇంత దుర్మార్గుణ్ణి ప్రేమించాననుకొంటోంటే నామీద నాకే అసహ్యం వేస్తోంది''



గట్టిగా నవ్వేశాడు "అందుకే అన్నారోయ్ ప్రేమ గుడ్డిదని. ప్రేమలో పడ్డవాళ్లకి అవతలి వారిలోని మంచి గుణాలు మాత్రమే కన్పిస్తాయి. అదీ భూతద్దంలో కన్పిస్తాయి''

"చెప్పుతో కొట్టినట్టు నాకు బాగా బుద్ధి చెప్పావులే. పది జన్మలకి సరిపడా పాఠం నేర్పేవు. ఇక నీతో వాదనలనవసరం. తక్షణం నా ఇంట్లోంచి బయటికి ఫో' తర్జని చూపిస్తూ అంది.

"వెళ్ళను'' మంచంమీద కూర్చుని కాళ్ళాడిస్తూ అన్నాడు.

"ఆడది ఆటబొమ్మ కాదు అవసరమైతే అణుబాంబుగానూ మారగలదు. నన్నింకా రెచ్చగొట్టకు. నేనేం చేస్తానో నాకే తెలీదు. ఆడపులిముందు నీలాటి నక్కలు నిలవలేరు. గుర్తుంచుకో'

ఆమె ఉగ్రరూపం చూసి జంకాడు.

"ఆడది భయపడినంతకాలమే మగాడి ధైర్యం. ఎదురుతిరిగిందో నరకాసురులూ మహిషాసురులూ కూడా తలలు తెగి నేలకూలాల్సిందే. ఇంకా మీనమేషాలు లెక్కిస్తూ కూర్చున్నావేం. వెళ్ళు ఇంకెప్పుడూ నీ పాపిష్టిముఖం నాకు చూపించకు''

ఆమె నేత్రాలు విస్ఫులింగాల్లా వున్నాయి.

చిన్నగా బెదిరాడు. అది కప్పిపుచ్చుకుంటూ నవ్వాడు. "ఓకే. అలాగే వెళ్తాన్లే. లోకం గొడ్డుపోలేదుకదా. మరో బంగారు పిచిక దొరక్కపోదులే. మళ్ళీ దానికోసం పసుపుతాడు ఎక్కడ వెదుక్కోను? మెడలోని ఆ అలంకారాన్ని తీసిచ్చెయ్యమ్మా వెళ్ళిపోతాను''

ఆవేశంగా మంగళసూత్రాన్ని చేతుల్లోకి తీసుకుంది. ఏవో అదృశ్యశక్తి ఆపగా బేలగా చూసింది. కన్నీటితో చూసింది.

మంగళసూత్రం!

మంగళప్రదమైన రెండు జీవితాల్ని ముడివేసే సూత్రం!

భర్త చనిపోయినప్పుడు మాత్రమే తెంపే సూత్రాన్ని ఇప్పుడు తాళికట్టినవాడే త్రెంచెయ్యమంటున్నాడు.

నిస్సహాయంగా చూసింది.

క్రమక్రమంగా స్థాయి పెంచుతూ నవ్వాడు శ్రీను.

"తాళి మగాడి ఆయుధం. ఆడదాని బలహీనత!"

అతడెళ్ళిపోయాడు.

ఏడుస్తూ కూలబడిపోయింది హర్ష!

మరో గంటకి వచ్చింది కామేశ్వరి.

కళ్లు తుడుచుకుంటూ మొఖానికి ప్రసన్నపురంగు పూసుకుంటూ ఆహ్వానించింది.

"ఏదో ఘర్షణపడినట్టున్నారు..."

"ఇక అతడ్తో కాపురం చెయ్యలేను పిన్నిగారూ. వెళ్ళిపొమ్మంటుంటే వినటంలేదు. ఎలా వదిలించుకోవాలో తెలీటంలేదు..."

"ఆ పని ఇదివరకే చేసుండాల్సింది. నెలలు నిండుతుండగా ఇప్పుడు... అది సరే. మీ బాబాయిగారితో మాట్లాడదాం రా. ఏదో దారి దొరక్కపోదు. మనస్సుంటే మార్గం వుండకపోతుందా చెప్పు. అన్నట్టు మా అల్లుడు ఇందిరని ఏలుకుంటాననీ తిరిగి కాపురానికి పంపించమనీ మధ్యవర్తుల్ని పంపాడు''

"చాలా సంతోషం..."

"కాని ఇందిర ఒప్పుకోవట్లేదు. ఇంకొన్నాళ్లు దూరంగా వుంటాను. అప్పటికీ నన్నే కోరుకుంటే అప్పుడు వెళ్తానంటూ భీష్మించుక్కూర్చుంది. మాకూ అదే మంచిదన్పిస్తోంది. ఈ మగాళ్లనెవరు నమ్మగలరూ? అలా తిరిగి ఇలా వచ్చేలోగా మారిపోతారాయె''

"మెరిసేదంతా బంగారం కాదనీ పైపై మెరుగుల్ని చూసి మైమరచి పోకూడదనీ కళ్లు మూసుకుని నిర్ణయాలు తీసుకోకూడదని నా జీవితం నాకు నేర్పిన పాఠాలు పిన్నిగారూ. అన్నిటా ఆచితూచి అడుగె





య్యటం శ్రేయస్కరం"

"బాగా చెప్పావు. రా... మీ బాబాయిగా రితో మాట్లాడదాం"

తలుపేసి ఇద్దరూ మేడదిగి వచ్చినవార ల్లా బయటి దృశ్యాన్ని చూసి మ్రాన్పడిపో యారు.



రోడ్డుకవతల తమ ఇంటిముందు చిన్న శిబిరం వెలిసింది. అందులో ఒకామె నిరాహా రదీక్ష చేస్తూ కూర్చునుంది.

ఆమె చుట్టూ ఎందరో ఆడవాళ్లు చేరుతు న్నారు. రోడ్డున పోయేజనం పోగవుతున్నా రు.

"ఎవరావిడ? అక్కడేం జరుగుతోంది పిన్నీ?" గాభరాగా అడిగింది హర్ష.

"కనుక్కొస్తానుండు'' అంటూ గబగబా అడుగులేసుకుంటూ వెళ్ళి వెంటనే తిరిగొ చ్చింది.

"చెప్పడానికి నోర్రావడంలేదే తల్లీ. ఆ అమ్మాయి నీ సవతి జానకి. తన మొగుడ్ని విడిచిపెట్టమని ఆమరణ నిరాహారదీక్షకి కూర్చుంది. నాకు కాళ్ళూ చేతులూ ఆడ టంలేదే అమ్మాయ్. ఆఖరికి నీ బతుకేమవు తుందో తలచుకుంటే గుండెలు గుభేలు మంటున్నాయే తల్లీ!" కలవరపడ్తూ అంది.

తనని సూటిపోటి మాటల్తో 'పొడిచే ఆవిడ తన గురించి ఆందోళన పడుతోంది.

హర్ష కళ్లు చెమ్మగిల్లాయ్. పేలవమైన నవ్వు పెదాలమీద కదలాడగా "వెదకపో యిన పరిష్కారం కాలికి తగిలిందన్న మాట" అంది.

ఆవిడేం మాట్లాడలేదు. జాలిగా చూ సిందంతే.

ఇంతలో ఇద్దరు పిల్లల్ని తీసుకుని శిబిరం దగ్గర్నుంచొచ్చారు రామలింగయ్యగారు.

"ఈ పిల్లలెవరండీ..." కామేశ్వరి అడి గింది.

"శ్రీను బిడ్డలు..."

కళ్ళు తిరిగి పడబోయింది హర్ష. కామే శ్వరి పట్టుకుని మెట్లమీద కూర్చోబెట్టింది.

"అయితే పిల్లల్లేరంటూ శ్రీను చె ప్పిందంతా''

"పచ్చి అబద్ధం! కట్టుకథ!"

తన ఆశాసౌధం పేకమేడలా కూలిపో యిందొక్కసారిగా!

నరనరాల్లో దాగిన శక్తిని కూడదీసు కుంటూ ఆ పిల్లలవంక చూసింది.

అమ్మాయికి ఆరేళ్ళూ అబ్బాయికి నాలు గేళ్ళూ వుంటాయి. జాలిగొల్పుతూ వున్నా రు. అనాథల్లా వున్నారు.

దీనంగా చూస్తూ చేతులు జోడించారు. గబుక్కున ఆమె కాళ్ళమీద పడిపోయారిద్ద రూ ఏడుస్తూ.

గుండెల్లో చేయిపెట్టి కెలికినట్టన్పించింది హర్షకి. కడుపులోని బిడ్డ మెలికలు తిరిగింది.

భరించలేనంత బాధ, నొప్పి కలగ్గా ఏడు స్తూ ఇంట్లోకి పారిపోయి తలుపు గడియపె ట్టుకుని బావురుమని కూలబడింది.

అలా ఎంతసేపు ఏడుస్తూండిపోయిందో ఆమెకే తెలీదు.

శ్రీను వచ్చాడు. ధుమధుమలాడాడు.

"రాజీ ప్రతిపాదనకి ఒప్పుకున్నాం. కేసు విత్‌డ్రా చెయ్యమని చెప్పాను. అయినా విన కుండా టెంట్‌వేసి రాద్ధాంతం చేస్తోంది చూ డు. నువ్వు వచ్చి చెప్పాలట. రాసివ్వా





లట..."

"ఉంపుడుగత్తెగా పడివుంటానూ అనా?"

"షటప్. తలతిక్కగా వాగకు. చెప్పింది చెయ్యి. దట్సాల్. పళ్ళరసమో, గ్లూకోజు నీళ్ళో తీసుకురా''

"ఎందుకు?"

"నువ్విస్తే దీక్ష విరమిస్తుందిట"

"అంతకర్మ నాకు పట్టలేదు. నేనా పరిష్కారానికి ఒప్పుకోవట్లేదు''

"అంటే ఏవిటి నీ ఉద్దేశం! ఈ కేసుల్తో గొడవల్తో అపనిందల్తో ఏళ్ళెల్లకాలం నరకం అనుభవిస్తూ చచ్చిపోదామంటావా?"

"అనను. నాతోబాటు నా బిడ్డ బ్రతుకు నరకం చేసే హక్కు నాకు లేదు. ఇప్పుడు నా మెడలో తాళిలేదు. నువ్విహ స్వేచ్ఛాజీవివి. వెళ్ళిపో''

తుళ్లిపడి చూశాడు. నిజమే. మెడ బోసిగా వుంది. పెదవి కొరుక్కున్నాడు. దేవుడిపటం తగిలించిన మేకుకి వేలాడుతోంది పసుపుతాడు.

"నేను వెళ్లను''

"నేను పొమ్మంటున్నాను''

"ఐ లవ్యూ''

"బట్ ఐ హేట్యూ''

"ఫర్లేదు సర్దుకుపోతాను''

"నేను సర్దుకుపోలేను. వెళ్లిపో. నీ ఇంటికి నీ పెళ్ళాంబిడ్డల దగ్గరికిపో. నన్నూ నా బిడ్డనీ వదిలేసెయ్యి. నీ పాపిష్టినీడ మామీద పడనంత దూరంగా వెళ్ళిపోతాం"

"వెళ్ళనివ్వనని పొద్దున్నే చెప్పాను. నువ్వు నాక్కావాలి''

"నేను ఛీకొట్టి పొమ్మంటున్నా ఆ మాటన డానికి సిగ్గులేదూ? నీలో చీమూ నెత్తురూ ప్రవహించటంలేదూ?"

"లేదు. మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. నాకు సుఖం కావాలి. డబ్బు కావాలి. సుఖజీవనం కావాలి. అందుకే నిన్ను వదల్ను''

"తాళి తీసేశానుగా. ఇక మనమధ్య ఏ బంధం మిగిలివుందనీ ఈ అధికారం?"

"నీ కడుపులోని నా బిడ్డ!"

నిర్విణ్ణురాలైంది. వెర్రిగా చూసింది. 'భగవంతుడా!' అంటూ భోరున ఏడ్చేసింది.

అతడు చిన్నగా నవ్వుకుంటూ అన్నం వడ్డించుకుని తిన్నాడు.

పిమ్మట గదిలోకెళ్ళి గుర్రుపెట్టి నిద్రపోయాడు.

బయట రోడ్డుమీద ఒక భార్య నిరాహారదీక్షలో వుంది. మరొకరు ఇంట్లో దిక్కుతోచక దుఃఖంతో అలమటిస్తోంది.

కానదేమీ పట్టనట్టు హాయిగా నిద్రపోతున్నాడు.

అవునతడు పురుషుడు!

బయట జనం పోగవుతున్నారు. రకరకాలుగా చెప్పుకుంటున్నారు. ఆశ్చర్యపోతున్నారు. తిడుతున్నారు. ఎన్నెన్నో వ్యాఖ్యానాలు చేస్తున్నారు. వ్యంగ్యాస్త్రాలు విసురుతున్నారు.

అవన్నీ సన్నగా గోలగా విన్పిస్తున్నాయి.

అయినా రాయిలా నేలమీద చతికిలబడి కూర్చునుండిపోయింది హర్ష.

శ్రీను నిద్రలేచొచ్చాడు.

"ఏవిటే దెయ్యంలా కూర్చున్నావ్. టీ కాచేవా లేదా?"

ఆమె మాట్లాడలేదు. గుమ్మంలోకెళ్ళి బయటికి చూశాడు.

"అరె. అప్పుడే చీకటి పడుతోందే. పొద్దుట్నుంచి జానకి ఏమీ తినలేదే దౌర్భాగ్యురాలా. పిల్లలైనా ఏమైనా తిన్నారో లేదో. నడవ్వే నడు. నేన్చెప్పిన రాజీసూత్రానికి అంగీకరిస్తున్నానని చెబుదువుగాని పద" ఆమె రెక్కపట్టుకుని లేపాలని ప్రయత్నిస్తూ అన్నాడు.

ఆమె కదల్లేదు. "నేను రాను. నువ్వెళ్ళిపో. వాళ్ళనీ శిబిరాన్ని తీసుకెళ్ళిపో''

"నీ రోగం ఎలా కుదర్చాలో నాకు బాగా తెలుసులే''



అతడు విసురుగా బయటికెళ్ళిపోయాడు.

రెండు గంటలు గడిచినా రాలేదు. బయటి శబ్దాలూ గొడవా కూడా తగ్గాయి. జనం వెళ్ళిపోయారేమో అనుకుంది. అతడు బహుశా పెళ్లాం బిడ్డల్ని తీసుకెళ్ళి పోయి వుంటాడనుకుని గాఢంగా నిట్టూర్చింది.

అలాగని బయటికి తొంగిచూడటానికి మనస్కరించలేదు.

ఇందిర కొడుకు గోపి మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ గుమ్మంలోకొచ్చాడు. ఆమెని చూసి ఓ కాగితాన్ని రాకెట్‌లా చేసి ఆమెమీదకి విసిరేసి పారిపోయాడు. అది ఆమె గుండెలకి తగిలి ఒళ్ళోపడింది. తీసుకుని చూసింది.

అదో బొమ్మ. ఆడమనిషి బొమ్మకి కొమ్ములూ కోరలూ తగిలించి వికృతంగా రాక్షసంగా మార్చాడు.

అంటే ఆ పసివాడి దృష్టిలో తనో రాక్షసా?

ఆమె గుండెలు వేయివక్కలయ్యాయి. దుఃఖం కట్టలు తెంచుకుంది. హోరున విలపించి కన్నీరెండిపోగా సొమ్మసిల్లినట్టుగా పడిపోయింది.

ఎప్పటికో వచ్చాడు శ్రీను కిళ్ళీ నములుతూ.

మనిషి తూలుతున్నాడు. తాగి వచ్చాడని గ్రహించింది. భయం భయంగా చూసింది.

"నీకో గంట టైమిస్తున్నాను. నువ్వొప్పుకుంటే సరే. లేకపోతే నేనేం చేస్తానో నాకే తెలీదు'' బటన్ నైఫ్‌తో గెడ్డం గోక్కుంటూ వికృతంగా నవ్వాడు.

"ప్రాణమంటే నాకేం తీపిలేదు. ఆవిడో నేనో ఒక్కరే మిగలాలి. ఈ కథకిదే ముగింపు''

"నిన్నెందుకు చంపుతాను. చంపను''

"మరి..."

"నీ పొట్టలో బజ్జున్న బుజ్జినాన్నని చంపుతాను''

"శ్రీనూ! నువ్వు మనిషివా రాక్షసుడివా?"

"ఏదైనా అనుకో. నేను చేయబోయేది చెప్పేనంతే''

"ఇంకా కన్ను తెరవని పసిగుడ్డుని నీ రక్తాన్ని పంచుకున్న నెత్తురుగుడ్డుని..." దుఃఖోద్వేగంతో ఆమె కంఠం పూడుకుపోయింది.

"నాకు సెంటిమెంట్సు లేవు''

ఒక్కక్షణం అతడ్ని భస్మం చేసేలా చూసింది. మరుక్షణం స్ప్రింగులా లేచింది. "నీకన్నా ముందు నేనేం చేస్తానో కళ్ళెట్టుకుని చూడు''

స్కూటర్ కోసం దాచి వుంచిన పెట్రోలు డబ్బా తీసుకుని వడివడిగా బయటికి నడిచింది.

"ఏయ్ ఏం చేస్తున్నావే!"

"అడ్డు తొలగిస్తున్నాను''

పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ శిబిరం దగ్గరికెళ్లింది.

చీకట్లో బిక్కుబిక్కుమంటూ అశోకవనంలోని సీతలా శిబిరంలో కూర్చునుంది జానకి. ఆమె వంక చూసింది హర్ష.

వీధిలైటు కాంతిలో ఆమెని గుర్తించింది.

ఒకనాడు తనని జుట్టు పట్టుకుని వంగదీసి మరీకొట్టింది ఆవిడే!

శిబిరం ఎదురుగా కూర్చుని పెట్రోలు దిమ్మరించుకుంది.

ఇరుగు పొరుగు జనం ఏం జరుగుతోందో అర్థంగాక విస్మయంగా చూస్తున్నారు.

ఆమె చేస్తున్నదేమిటో జానకి గ్రహించింది. ఆదుర్దాగా లేచి నిలబడబోతుండగా భగ్గున మంటలేచింది, రోడ్డుమీద.

అంతా తుళ్ళిపడి భయవిహ్వాలురై చూశారు.

క్షణాల్లో అంతా అయిపోయింది. హర్ష కోరుకోని ముగింపు అది.



# చతుర ప్రపంచం

## ఎసిడిటీకి యాంటీడోస్

ఈ రోజుల్లో చాలామంది... ముఖ్యంగా స్త్రీలు తమ శరీరాకృతిని కాపాడుకుందుకు చాలా శ్రమపడుతున్నారు. స్థూలకాయం కొంతమంది స్త్రీల పాలిట పెద్ద సమస్యలా తయారయింది. ఎన్నో స్లిమ్మింగ్ సెంటర్స్, వ్యాయామ పద్ధతులు వచ్చినా తినే ఆహార పదార్థాలలో కూడా కొవ్వు శాతం అధికంగా




లేకుండా చూసుకోవాలి. కూరగాయల్లో బంగాళదుంపని స్థూలకాయులకు అసలు సిసలైన శత్రువు అంటారు చాలా మంది. ఎవరు చెప్పినా ముందు దుంప కూరలు... ముఖ్యంగా బంగాళాదుంపలు మానాలి అంటారు. కానీ ఆ అభిప్రాయం పూర్తిగా రైటు కాదు అంటున్నారు.

ఇది చాలా పోషక విలువలు కలిగిన శాకమన్నది చాలామందికి తెలియదు. బహుశా చెప్పినా నమ్మరు ఎంతోమంది. దీనిలో వుండే పోషకవిలువలపై 1771లో యూరప్‌లో పరిశోధన జరిగింది. అప్పట్లో గోధుమ సరిగా పండక కరువు ఏర్పడగా గోధుమకు సమానమైన పోషక విలువలు కలిగిన మరో ప్రత్యామ్నాయ ఆహారపదార్థాన్ని కనుగొన్నవారికి మంచి బహుమానం లభిస్తుందన్న ప్రకటన వెలువడింది. ఫ్రాన్సు దేశం... గోధుమకు దీటైనది బంగాళదుంప మాత్రమే అన్న పరిశోధనా ఫలితాన్ని వెలువరించి బహుమతి కొట్టేసింది. దాంతో అప్పట్లో చాలా దేశాల్లో అది ముఖ్యాహారంగా స్థిరపడింది.

నిజానికి బంగాళదుంప ఇష్టంకాని వారుంటారంటే అనుమానమే. ముఖ్యంగా పిల్లలకి రోజూ బంగాళదుంప వండిపెడితే తిండికి సంబంధించిన పేచీలుండవు. సమోసాలు, చిప్స్ ఇవన్నీ ఎంతోమంది ఇష్టపడతారు. కానీ పోషకాహార పరిశోధకులు ఈ పొటాటోల గురించి మరో ముఖ్యమైన మాట చెప్పారు సుమా. ఏమిటంటే "దుంప పైనున్న తొక్కని తిని లోపలి దుంపను కోళ్లకి ఆహారంగా వెయ్యండి" అని. అంటే

దుంపలో వుండే అత్యంత విలువైన భాగం కేవలం పైపొట్టు మాత్రమే. అక్కడే మనం ఆ కాయగూరని ఉపయోగించుకోవడంలో ఎక్కడ తప్పుచేస్తున్నామో అర్థమవుతుంది.

దుంపతో ఏంచేయాలన్నా ముందుగా మనం చేసేది పొట్టును చెక్కేయడం లేదా ఉడికాక పొట్టును ఒలిచేయడం. కానీ... ఈ తొక్కలోనే యాంటీ ఆక్సిడెంట్స్ వున్నాయంటున్నారు పరిశోధకులు. ఇవి శరీరంలో ఎలాంటి ఇన్‌ఫెక్షన్‌కి సంబంధించిన క్రిములనయినా సంహరిస్తాయని, రక్తకణాలను బలవర్థకం చేస్తాయని అంటున్నారు.

ఈ తొక్కలో తక్కువ కొలెస్ట్రాల్ వుంది. మిగిలిన దుంప భాగంలో మంచి ప్రొటీన్లు, మినరల్ సాల్ట్స్ వున్నాయి. బంగాళదుంప క్షార సంబంధమైన శాకం. ఇందులో సోడా, పొటాష్ ఎక్కువగా వుండి సున్నపు పాలు తక్కువ. దాంతో ఇది శరీరంలోని ఎసిడిటీకి యాంటీడోట్‌గా పనిచేస్తుంది.

దుంపలో కార్బోహైడ్రేట్‌లు ఎక్కువగా వుండటంతో చక్కెరవ్యాధి వున్నవారు వీటిని ఎక్కువగా తినకూడదు. కార్బోహైడ్రేట్‌లు శరీరపు బరువును కూడా కొంచెం పెంచుతాయని అందరికీ తెలిసిందే. అయితే ఇందులో వుండే క్షారగుణం, పొట్టులోవుండే రోగ నిరోధక శక్తి మాత్రం ఈ శాకాన్ని ఉన్నత స్థానంలో నిలబెడుతున్నాయి. బంగాళదుంపలు కొనేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్త ఏమిటంటే వీటిపై ఆకుపచ్చ మచ్చలుండరాదు. దుంపలో సోలనైన్ అనే పదార్థం వుంటుంది. ఆకుపచ్చ మచ్చలు ఎక్కువగా వున్న దుంపలలో సోలనైన్ అధికంగా వుందని తెలుసుకోవాలి. ఇది ఉదర సంబంధమైన రోగాలను కలుగజేస్తుంది. కొందరికి సోలనైన్ వలన ఎలర్జీ కూడా వస్తుంది.

---

## అణుయుద్ధం వస్తే...?

**పా**కిస్థాన్ ఇండియామీద మొదట అణుబాంబు వేస్తుందా, లేక ఇండియా పాకిస్థాన్ మీద వేస్తుందా అన్నది అభివృద్ధి చెందిన దేశాల్లో సంపాదకీయాల్లో చోటు చేసుకుంటున్న ఈ రోజుల్లో అణుబాంబు యుద్ధం గురించి అవగాహన ప్రజల్లో కలిగించాల్సిన బాధ్యత ప్రభుత్వానికుంది.

బాంబుపడి డైరెక్ట్ హిట్ జరిగినచోట ప్రజలు మరణించవచ్చుకాని, చుట్టుపక్కల 'ఫాలౌట్ ఏరియా'లోని ప్రజలు తగిన నివారణ చర్యలు తీసుకుంటే తమ ప్రాణాలను రక్షించుకోవచ్చు.

రష్యా, అమెరికాల మధ్య అణ్వాయుధాల పోటీ హెచ్చుగా ఉన్నప్పుడు సబ్-వేలని రవాణాకే కాక బాంబ్ షెల్టర్‌గా కూడా ఉపయోగించేలా రష్యన్ ప్రభుత్వం జాగ్రత్తలు తీసుకుంది.

అణుబాంబు పడ్డచోట టన్నులకొద్దీ మట్టి ద్రవంగా, ఆవిరిగా మారుతుంది. అదంతా భూమికి లక్ష అడుగులు పైదాకా వ్యాపిస్తుంది. ఎంతో వేడిగా వుండే ఈ ద్రవం, రేడియో ఏక్టివ్ పదార్థాలను కలిగివుంటుంది. ఈ ద్రవం ఉపరితలంలోని చల్లటి గాలికి గడ్డకట్టి తిరిగి భూమిమీదకి కురుస్తుంది. ఈ 'ఫాలౌట్' భూమిని చేరడానికి 50 నిమిషాలనుంచి 8 గంటల కాలం పట్టవచ్చు ఈలోగా బాంబుపడ్డచోట చుట్టుపక్కల ప్రజలు ఇళ్లల్లోంచి బయటకు వచ్చి మంటలు ఆర్పవచ్చు తమ ఇళ్లకు చేరుకోవచ్చు అలా బాంబు పడ్డ భూమిమీద రేడియో ఏక్టివిటీ వుండదు. ఈ 'ఫాలౌట్' మొదలవగానే ప్రజలు తిరిగి కప్పుకిందకి వెళ్ళాలి. ఎందుకంటే మనిషికి హానిచేసే ధార్మిక శక్తి ఈ ఫాలౌట్‌లోనే వుంటుంది. ఆకాశంలోంచి కురిసే ఆ ధూళి (ద్రవం ధూళిగా మారుతుంది) మనిషి చర్మానికి అంటుకోకూడదు. అలాగే గాలి ద్వారా ఊపిరితిత్తుల్లోకి కూడా వెళ్లకూడదు. అతిచ

వ్వకైన, అందరికీ అందుబాటులో వున్న ఫేస్ మాస్క్ వేసుకుని, నీళ్లలో తడిపిన చేతిరుమాలుని ముక్కువద్ద వుంచుకోవడం చెయ్యాలి. అలా ధూళి కురిసిన 10 గంటల తర్వాత అందులోని ధార్మికశక్తి 90 శాతం నశించిపోతుంది. రెండు వారాల్లో, ఆ ప్రాంతంలో రేడియేషన్ 10 నుంచి ఒక్క శాతానికి చేరుకుంటుంది. ఇది మనిషికి హాని చేసే రేడియేషన్ కాదు.

ఫాలౌట్ టైంలో ఆహారపదార్థాలలోకి అవి చేరకుండా మూతలు మూసివుంచాలి. వండే గిన్నెలని సోప్‌వాటర్‌తో శుభ్రంగా

పోతోందని నిర్ధారణ చేసి రష్యన్ ప్రభుత్వం, అమెరికా రష్యాల అణ్వాయుధ పోటీ జరుగుతున్న రోజుల్లో 90 శాతం ప్రజలకి ఈ అంశంమీద శిక్షణనిచ్చింది.

ఈ శిక్షణ కార్యక్రమానికి పొల్లు డొసాన్ అనే పేరుపెట్టారు. మాస్కోలోని క్రెమ్లిన్‌కి 7 మైళ్ల దూరంలో రేడియేషన్ ప్రూఫ్‌షెల్టర్ని కూడా నియమించారు.

అణుయుద్ధ సమయంలో రష్యా ప్రభుత్వం భూమికి 1300 అడుగుల లోతున గల ఆ షెల్టర్‌నుంచి పనిచేస్తుంది.




కడిగి వండాలి. ఒంటిమీద ఆ ధూళి చేరితే నీళ్లతో శుభ్రంగా ఒంటిని అనేకసార్లు కడుక్కోవాలి. పెంపుడు జంతువులు, ఇతర జంతువుల విషయంలో కూడా మనుషులకి తీసుకునే జాగ్రత్తలనే తీసుకోవాలి. వర్షం వస్తే ఆ ధూళి నేలలోకి ఇంకిపోతుంది.

న్యూక్లియర్ బాంబు పడుతుందన్న అనుమానం కలిగినప్పుడు భూమిలో ఎల్ ఆకారంలో గుంటలు తవ్వుకుని అందులో దాక్కోవడంవల్ల ఇంట్లోకన్న అధికశాతం రక్షణ లభిస్తుంది. అణుబాంబువల్ల కలిగే ప్రమాదాలు, వాటినుంచి నివారణ విషయంలో శిక్షణ పొందడంవల్ల అణుయుద్ధంలో మరణించే ప్రజల సంఖ్య బాగా తగ్గి

20 మెగాటన్ల హైడ్రోజన్ బాంబ్ డైరెక్ట్‌గా ఆ షెల్టర్‌మీద పడ్డా లోపలివాళ్లకేం కాదు. ఆ షెల్టర్‌లో ఆహారపదార్థాలు, నీరు, ఆక్సిజన్, రెండేళ్లకి సరిపడే విధంగా స్టోరుచేసి వుంచారు. ఇదికాక కొన్నివేల చిన్న చిన్న షెల్టర్లు రష్యా అంతటా నిర్మించారు. మాస్కో, కీవ్, లెనిన్ గ్రామాలలోని సబ్‌వేలు రవాణాకే కాక బాంబ్‌షెల్టర్లుగా కూడా ఉపయోగించేలా తీర్చిదిద్దారు.

# వాళ్ళ పనే హాయి

సామాన్య మానవుడు అర్జెంట్‌గా ఊరెళ్ళాలంటే రైల్లో బెర్త్ రిజర్వేషన్ దొరకదు. కనీసం నాలుగు రోజులు ఆగాల్సి వుంటుంది. అయితే మనదేశాన్ని సందర్శించడానికి వచ్చే విదేశీ టూరిస్ట్‌లకి ఈ సమస్య లేదు. అక్టోబర్ 1986 నించి మన దేశంలోని అంతర్జాతీయ ఎయిర్‌పోర్ట్‌లలో (ఢిల్లీ, కలకత్తా, బాంబే, మద్రాస్), ఇండియన్ రైల్వేస్‌వారి కంప్యూటరైజ్డ్ కౌంటర్స్‌లో ఎక్కడనించి ఎక్కడికైనా, ఏ క్లాస్‌లోనైనా విదేశీయులు వివిధ రైళ్లలో మొత్తం జర్నీకి టిక్కెట్లు రిజర్వేషన్ చేసుకోవచ్చు. అన్ని ముఖ్యమైన రైళ్లలో వీరికోసం కొంత కోటా వుంది. ఇందువల్ల వాళ్ళు విమానం దిగాక సిటీలోని రైల్వేబుకింగ్ ఆఫీస్‌లకి పరిగెత్తక్కర్లేదు. అంతర్జాతీయ విమానాలు వచ్చే సమయాలైన రాత్రి పదినించి ఉదయం ఎనిమిది దాకా ఈ కౌంటర్లు పని చేస్తాయి. వీరికి ఇండ్‌రైల్ పాస్ సౌకర్యం కూడా కల్పించారు. 7, 15, 21, 30, 60, 90 రోజులు ఏ రైల్లోనైనా ఎప్పుడైనా ప్రయాణించే సౌకర్యంగల ఇండ్‌రైల్‌పాస్‌లను విదేశీ టూరిస్ట్‌లు, ఎన్.ఆర్.ఐలు కొనచ్చు. రిజర్వేషన్ ఫీజ్, బర్త్‌ఛార్జెస్, సూపర్‌ఫాస్ట్ రైళ్ళకి వుండే సప్లిమెంటరి ఛార్జీలు మళ్ళీ మళ్ళీ ప్రత్యేకంగా చెల్లించే పనిలేదు. రైల్లో ఖాళీలేకపోతే ఈ పాస్‌హోల్డర్స్‌కి టూరిస్ట్ కోటాలో లేదా ఎమర్జన్సీ కోటాలో రిజర్వేషన్స్ ఇవ్వాలి.




ఇండ్‌రైల్ రోవర్ స్కీమ్ అనే ఇంకో స్కీమ్‌లో మొత్తం టూర్ ఇటినరి ప్రకారం సీట్స్ లేదా బెర్త్‌లు రిజర్వ్ చేసి ఇస్తారు. 32 రకాల ఇటినరీలు గల బ్రోషర్‌ని రైల్వే డిపార్ట్‌మెంట్, టూరిస్ట్‌ల కోసం డిజైన్ చేసింది.

ఈ పాస్‌లు కేవలం ఢిల్లీ, కలకత్తా, బాంబే, మద్రాస్, భోపాల్, సికింద్రాబాద్, అహ్మదాబాద్, లక్నోలాంటి కొన్ని రైల్వే కౌంటర్స్‌లోనే అమ్ముతారు.

విదేశస్థులు తరచు ప్రయాణం చేసే రైళ్లు పాతిక దాకా వుంటాయి. ఢిల్లీనించి అమృతసర్‌కి, బాంబేకి, లక్నోకి, హౌరాకి, తాజ్ ఎక్స్‌ప్రెస్, ప్రయాగ్ తాజ్ ఎక్స్‌ప్రెస్, వైశాలి ఎక్స్‌ప్రెస్, గోమతి షాలిమార్, జీలం, చేతక్, పింక్ సిటి మొదలైన రైళ్ళు విదేశీయులు సందర్శించే ప్రధాన టూరిస్ట్ సెంటర్‌లని కవర్‌చేస్తుంది.

అయితే విదేశస్థులు, ఎన్.ఆర్.ఐ.లు ఈ టిక్కెట్లకి సొమ్ము అమెరికన్ డాలర్లలో చెల్లిస్తూ, తమ పాస్‌పోర్ట్‌లని **కూడా** చూపించాల్సివుంటుంది. 

# "కాటిచిలక" పై సమీక్షలు

అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన ఐ. కవిత రచన
'కాటిచిలక'పై మాకందిన ఉత్తమ సమీక్షలు



## శ్మశాన విజ్ఞాన సర్వస్వం

*(ప్రథమ బహుమతి రూ. 100/-పొందిన సమీక్ష)*

అక్టోబర్ చతుర నవల 'కాటిచిలక'లో ఇతివృత్తం కొత్త బాటలో కొనసాగింది. రచయిత్రి ఐ.కవిత తన ప్రయత్నంలో విజయం సాధించారు. కథంతా కథానాయిక శివాని చుట్టే తిరుగుతుంది. ఓ స్త్రీ అందులోను యౌవనవతి కాటికాపరి కావడం ఆశ్చర్యం. అడుగడుగునా భయానక సన్నివేశాలు, జుగుప్సాకర దృశ్యాలు తటస్థిస్తాయి. శ్మశానం గురించి ఇంత వివరంగా చెప్పిన నవల మరొకటి లేదేమో! లారీ ప్రమాదంలో ఆమె తన తల్లిదండ్రుల్ని పోగొట్టుకున్న దగ్గర్నించీ చివరిలో శివానీ, శివలు ఒక్కటయ్యే వరకు అతిశయాలేమీ లేకుండా సంఘటనలన్నీ సహజంగా జరిగిపోతాయి. ఇందులో కాపరి శివానిది ఆఖ్యానమైతే శివది ఉపాఖ్యానం. కడకు రెండింటిని జోడించి ముగించడం చక్కగా అమరింది. రామదాసు శిక్షణతో ఆమె రాటుతేలి శ్మశాన నిర్వహణా బాధ్యతల్ని స్వీకరించాక శ్మశానాన్ని సంధించుకుంటూ అనేక కార్యకలాపాలు సంభవిస్తాయి. శివానికి కలిగే జుగుప్స, కుతూహలం, మందహాసం, బాధ, భావరా





హిత్యం మొదలైన ఎన్నో అనుభూతుల్ని పాఠకుల్లో ప్రతిస్పందింపజేయడంలో రచయిత్రి వర్ణనా నైపుణ్యం, ప్రతిభా చాతుర్యం దోహదం చేశాయి. పనికిరాని పరిజ్ఞానంతో వెంటబడే విద్యార్థి, శవాలకు సంతోషంగా వీడ్కోలు చెప్పే మహర్షి, చితాభస్మంలో బంగారాన్ని, వెండిని వెతుక్కునే జలగడుగు లవాళ్లు, మనిషి ముంజేతి ఎముక కోసం వచ్చిన గారడీవాడు, మతానికొక్కటి చొప్పున శ్మశానం కావాలనే రాజకీయ వాది, గొంతెత్తి మంత్రాలు చదివే భూతవైద్యులు, పిచ్చిదానిపై అత్యాచారం చేసే కుష్ఠువాళ్లు, గోరీ ప్రక్కన దిగంబరంగా క్రీడించే జంట, అనుకూల స్థలంగా భావించి శ్మశానానికి వచ్చిన తాగుబోతులు, వామాచారులైన క్షుద్ర దేవతోపాసకులు, స్త్రీ శవాన్ని నగ్నంగా చూడాలనే పర్వెర్టర్డు కుర్రాడు, శవ భక్షకుడైన అఘోరి- ఇట్లా రకరకాల పాత్రలు మన ముందు సజీవంగా సాక్షాత్కరిస్తాయి. భయంతో, జుగుప్సతో, ఆశ్చర్యంతో వళ్లు గగుర్పొడుస్తుంది.

ఇది నవలా సాహిత్యంలో ఓ వినూత్న ప్రయోగం. మృత్యువుకు చెందిన కొటేషన్లు, దయ్యాల ఉనికి తదితర మూఢ విశ్వాసాల ఖండనలు కథనానికెంతో పటుత్వాన్నిచ్చాయి. దీన్లో రచయిత్రి తడమని శ్మశాన విషయమేదీలేదు. అందుకే ఇది శ్మశాన విజ్ఞాన సర్వస్వం.

-అంకిత కేశవులు
ఖమ్మం-507 003

## 'కాటి కోయిల'

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**న**వలా ప్రక్రియలో ఇప్పటివరకూ ఎవరూ టచ్ చేయని సరికొత్త ఇతివృత్తాన్ని ఎన్నుకొని 'కాటిచిలక' రాసి, శ్మశానాన్ని గూర్చి సాధారణంగా మనకు తెలిసిన దానికి భిన్నంగా వేరే కోణంలో నిగ్గుతేల్చిన నిజాలను చెప్పి అబ్బురపరిచారు రచయిత్రి ఐ.కవిత. ఆడది సాధించలేనిది ఏదీ లేదని శివాని పాత్రను చక్కగా మలచి స్త్రీ ఉన్నతిని సున్నితంగా చాటగలిగారు. అయితే రచనలో కాస్త కంటిన్యుటీ దెబ్బతిందని చెప్పక తప్పదు. అలాగే నవలలో రచయిత వినయ్ పాత్ర యొక్క ఆవశ్యకత ఏమిటో అర్థంకాలేదు. కేవలం కథా వస్తువు కోసం వచ్చిన అతను శివాని జీవితానుభవాలను చెప్తే వచ్చే పారితోషికంలో సగం ఇస్తాననప్పుడు అతనో కమర్షియల్ రైటర్‌గా కనిపించాడుగానీ సామాజిక దృక్పథం గల రచయితగా కనిపించలేదు. అందుకే అతను సమజాన్ని కమ్చీపెట్టి మేల్కొలుపుతాననడం హాస్యాస్పదంగా అనిపించింది. ఆదర్శవంతమైన శివాని అతని ప్రతిపాదనను అనాలోచితంగా, ఏ అభ్యంతరాలు చెప్పకుండా ఒప్పుకోవడంతో ఆ పాత్ర నిండుదనంలో కొంత కొరత ఏర్పడినట్లయింది.

అలాగే రామదాసు పాత్ర ఉన్నతంగానే తీర్చిదిద్దబడినా అతను భార్య చనిపోయాక శారీరక అవసరాలకోసం తరచుగా సాని వీధుల వెంట వెంపర్లాడటం ఏహ్యమైన విషయమనిపిస్తుంది. గాంధీగారి సిద్ధాంతాలను అమలు పరిచే అంతటి ఆదర్శవాది ఈ విషయంలో బలహీనుడవడం ఒక తప్పయితే, దాన్ని సమర్థించుకోవడం మరో తప్పు.

'అగ్ర కులాలవాళ్లు తమని అణగదొక్కుతున్నారని గోల పెట్టే నిమ్నజాతుల వాళ్లు తమను, తమ వృత్తులను తామే గౌరవించుకోవడంలేదు' వంటి మాటలద్వారా సందర్భోచితంగా సామాజిక రుగ్మతలను స్పృశించి సున్నితంగా ఎండగట్టిన రచయిత్రి శైలి అభినందనీయం.

ఏది ఏమైనా కాటిచిలక గూటికి మరో వెలివేయబడ్డ గోరువంక శివను చేర్చి, అంకితభావంతో ఆచరించే ఏ వృత్తి అయినా, సేవ అయినా గౌరవప్రదమయినదేనని తెలియ




జేసి మానవసేవే మాధవ సేవ అన్న సత్య సూక్తికి నైతిక బలాన్ని ఆపాదించారు రచయిత్రి.

-ఏ.వి.ఎన్.ఎమ్.మనోహర్
కా(ప్రా- 500 062

## కొత్తప్రపంచం

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**అ**క్టోబర్ చతుర నవల 'కాటిచిలక' సమాజంలో వెలివేయబడ్డ మనుషుల మానసిక వేదన, ఒంటరి జీవితాలెదుర్కొనే ప్రేమరాహిత్యం ఎంత బాధాకరమైనదో కళ్ళకు కట్టినట్లు చెప్పింది. ముఖ్యంగా శ్మశానం గురించి, శవరాజకీయాల గురించి మనకి తెలియని చాలా విషయాలు తెలియచేసింది. అలాగే వెలివలన ఎదుర్కొనే దుస్థితిని వాస్తవికంగా రాశారు. ప్రత్యేకంగా వాళ్ళ దగ్గరికే వెళ్ళి ఈ విషయాలన్నీ సేకరించి, వాళ్ళ భావోద్రేకమే పాత్రలకు అద్దినట్లు అనిపిస్తుంది. మధ్యమధ్య కొన్ని వైజ్ఞానిక విషయాలనూ అందించి పాఠకులకు మేలుచేశారు. గంగానది గురించి చదివాక మనకు తెలియని విషయాలు ఇన్ని ఉన్నాయా అన్పించింది. అలాగే ఈ నవల సమాజంలో ఉన్న మానసిక రుగ్మతలనూ తాకింది. విద్యార్థుల పందెం, పిచ్చిదానిపై అత్యాచారం, అట్టడుగు వర్గాలవారైన అఘోరీలు, జలకడుగులోళ్ళు మొదలైన వారి జీవితాలు కూడా మా కళ్లముందుంచారు.

శివాని మనస్తత్వం సహజంగా రూపొందించారు. ఒక్కోసారి ఎంత ధైర్యంగా కనిపిస్తుందో, మరోసారి అంత బేలగా ప్రవర్తిస్తుంది. ముగింపు సహజంగా ఉంది. అలాగాక కాటికాపరి కొడుకో, పత్రికా విలేఖరో పెళ్లి చేసుకున్నా ఆ ఆదర్శం ఎంతోకాలం నిలవదేమో. సమాజంనుండి వెలివేయబడి, ప్రేమరాహిత్యంవల్ల బాధపడుతున్న వారిద్దరూ పెళ్ళి చేసుకుంటే ఒకరికి ఒకరు న్యాయం చేసినట్లుగా ఉంటుంది.

పత్రికా విలేఖరి పేరు మొదట 'వినయ్'గా, చివర్లో విప్లవ్‌గా మారిపోయింది. అలాగే కాటికాపరి కొడుకు తిరిగొచ్చినప్పుడు బెంగతో మరణించిన అతని తల్లి ప్రస్తావన రచయిత్రి తీసుకురాలేదు. ఇలాంటి అతి చిన్న పొరపాట్లు తప్ప నవల చాలా ఆకట్టుకొంది. ఆద్యంతం ఆసక్తికరంగా నడిచిన శైలి బాగుంది. తెలియని విషయాలెన్నో తెలియచేసిన రచయిత్రిగారికి ధన్యవాదాలు.

-జి.వి.వి.ఆర్. లక్ష్మి,
ధర్మసాగరం - 531 116

## విజయదశమి కానుక

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**వి**భిన్నమైన ఇతివృత్తపు నవల ఇది. శ్మశానం పూర్వాపరాలు చక్కగా వివరిస్తూ నవల చాలా సాఫీగా సాగిపోయింది. శివాని పాత్ర మలచిన తీరు అభినందించతగ్గది.

"ప్రాణంలాంటి భావం, విషయం వుంటే మిగిలిన అలంకారాలు ఎలా ఉన్నా పెద్ద ప్రమాదమేమీ ఉత్పన్నమవదని నా ఉద్దేశం. కథకు మాత్రం విషయమే ప్రాణమని నా భావం" అన్న రచయిత్రి ఈ కథలో వాస్తవంగా ఆ విషయమే రుజువు చేసింది.

"చచ్చిపోవడం అంటే మరేమీ కాదు. నువ్వు మాత్రం ఉండకుండా మిగిలిన ప్రపంచమంతా అలాగే వుంటుంది''

"మానవ సమాజానికి మేధావులు ఎంత అవసరమో మేదరి, తాపీమేస్త్రి, మెకానిక్ అంతే అవసరం"

అంటూ చాలా సున్నితమైన విషయాలను చక్కగా చెప్పారు.

"ప్రజలు మనల్ని గుర్తించడం కాదు.





మనం ప్రజలను గుర్తించి వారికి అవసర మైన సేవలందించాలి'' అన్న రామదాసు జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని సాహసంతో కాటికాపరి అయిన శివాని నేటి మహిళలకు ఆదర్శం. అయితే చివరకు నాకెవరున్నారు? నేనెవరికోసం? నా జీవితం ఎందుకు? అను కున్న శివాని స్త్రీ సహజ బేలతనానికి గురై ఆత్మహత్య చేసుకోవాలనుకోవడం అవి వేకం.

శ్మశానం గురించీ, దాన్ని ఆలంబనగా చేసుకుని జరుగుతున్న చీకటి కథలనూ, శ్మశానాన్ని నమ్ముకొన్న వివిధ వృత్తులవారి గురించీ, వివరించడంలో రచయిత్రి విజయ వంతమైనదనే చెప్పవచ్చు. శ్మశానం గు రించిన మూఢనమ్మకాలను చర్చించడం అభినందనీయం.

సమాజానికి పనికొచ్చే పనిచేసే కాటికాప రిని సమాజం సాటి మనిషిగా గుర్తించకపో వడం బాధ కలిగించే విషయం. చివరకు "హ్యాంగ్ మెన్'తో శివానిని కలిపి ఏ గూటి పక్షులు ఆ గూటికి చేరతాయనిపించారు. అలాకాకుండా ఒక సామాన్య పౌరుడు శివా నితో జీవితం పంచుకునేలా చేసి వుంటే ముగింపు మరింత బాగుండేది. ఈ నవలకు నిండుదనం వచ్చేది. ప్రతీనెల విభిన్నమైన మంచి నవలతో వచ్చే 'చతుర'లో ఇది మరో మంచి నవల!

-టి.వి. రమణయ్య,
గండిపాలెం - 524 236

## ప్రతిబింబం!

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**ఐ.** కవితగారి 'కాటిచిలక' నవలలోని 'కథా వస్తువే' వైవిధ్యంగా, రసస్ఫోరకంగా వుంది. కండలు తిరిగిన మగవాళ్ళు చేయాల్సిన 'కాటికాపరి' ఉద్యోగం సుకుమారమైన ఓ యువతి చెయ్యడం ఉత్సుకతకు గురిచే సింది. విధి విలయతాండవానికి గురై 'పితృ వనాన్నే' తన ఆవాసం చేసుకున్న అబల కుటుంబపరిస్థితులు సభ్యసమాజాన్ని తల దించుకునేలా చేస్తాయి.

'వర్గీకరణ' అంటూ కొన్ని వృత్తులను కొందరికి అంటగట్టి వాళ్ళని నీచమానవు లనీ... వాళ్ళు నిర్వర్తించేవి 'అల్పవృత్తు'లనీ అనడం దారుణమనీ, అపరిశుభ్రమనీ అనుకో కుండా ఎవరి పారిశుధ్యపు పనులు వారు చేస్తే సమాజం దేవాలయం అవుతుందని... ఈ విషయంలో పూజ్య 'బాపూజీ'ని ఆద ర్శంగా తీసుకోవాలని రచయిత్రి చేసిన సూచ నలు ప్రతి ఒక్కరికి అనుసరణీయాలు.

'స్త్రీ' అబలైనప్పటికీ ప్రతికూల పరిస్థితుల ను సానుకూలంగా మలుచుకుంటే భవిష్య త్తు స్వర్గమవుతుందని... 'శివాని' పాత్ర నిరూపించింది.

నవల 'వల్లకాడు' చుట్టూ తిరిగినా చావు తోను, శవంతోనూ, శ్మశానంతోనూ సంబంధమున్న మనుష్యుల్లోని కపటాన్ని, మూర్ఖత్వాన్నీ, అజ్ఞానాన్నీ నవల్లో అపూ ర్వంగా లిఖించారు.

శ్మశానం నేపథ్యంగా, థ్రిల్, సస్పెన్స్, మషాలాలేవీ లేకుండా నాగరిక సమాజానికి ప్రతిబింబంగా సాగిన ఈ నవల అజరా మరం.

-డాక్టర్ కె. శివసుబ్బారావు,
పోలవరం - 534 315

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 3730328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777: Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

S
ంటే
సి(

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్ళు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.


Mango Avakaya · Mango Thokku · Cut Mango · Tender (Vadu) Mango · Sweet Mango Chutney · Amla · Gongura · Drumstick · Lime · Tomato · Mixed Vegetable




Pickle
ఏ పచ్చడ
ఆ పచ్చడి సం


Bitter Gourd · Green Tamarind · Ginger · Sweet Ginger · Mango Ginger · Garlic · Onion · Red Chilli · Green Chilli (Sliced) · Green Chilli (Paste) · Gongura & Red Chilli · Green Tamarind & Red Chilli

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500